

"మహామనిషి"లో
కృష్ణ, జయప్రద

# జుట్టుకు
# సిల్క్‌వంటి మృదుత్వము
# నిచ్చుటకు నైసర్గిక
# ఉపాయము...



శుద్ధమైన షికాయిలోని సహజ లాభకర గుణములు స్వస్తిక్ షికాకాయ్ సబ్బులో నింపబడినవి. వాడడానికి అనువైనది. లిక్విడ్ షాంపూ కంటే ఎంతో పొదుపైనది.



దీని పుష్కలమైన, మృదువైన నురగ మీ జుట్టును మెత్తగా, పూర్తిగా శుభ్రపరుస్తుంది. మీ జుట్టును ఆరోగ్యంగా, నిగనిగలాడేలా వుంచుతుంది. తాజా సువాసన నింపి పట్టువంటి మృదుత్వాన్ని ఒసగుతుంది.




# స్వస్తిక్
# షికాకాయ్ సబ్బు

ఇందులో షికాయి కలిసి వుంది. భారత స్త్రీల అందమైన జుట్టుకు పారంపర్యమైన రహస్యము.

shilpi dm 25/79 tel

## శుభాకాంక్షలు

మా పాఠకులు, రచయిత (త్రు)లు, ఏజంట్లు, ప్రకటనకర్తలందరికి స్వాతంత్ర్య దినోత్సవ శుభాకాంక్షలు.

—సం.

## ముఖచిత్రం

అందాల నటి జయప్రద ముఖచిత్రంతో వెలువడిన పత్రిక ఎంతో రమణీయంగా ఉంది

ఎ. సుమతి, ఓబనపల్లె

* * *

నటి అనురాధ ముఖచిత్రముతో వెలువడిన సంచిక చాలబాగుంది

కేసరి వెంకటసత్యనారాయణ, శివకోడు

## కథలు

5-11 జూలై 85' సంచికలో "ఆల్ ఇన్ వన్", 'నీతి నీ చిరునామా ఎక్కడ? మరియు "ఎరపు సొమ్ము' కథలు చాలా బాగున్నాయి.

ఎ జి. ఎస్ రావు, రాయ్‌పూర్

* * *

నటి రాధ ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రికలో శ్రీ మధుర్‌జీ గారి ఇది జీవితం కిశోరిగారి 'తిరిగి వచ్చిన వసంతం కథలు చాలా బాగున్నాయి

కాళ్ళకూరి వెంకటేశ్వరరావు, తాడేపల్లిగూడెం

## ఉదాత్తం

శ్రీదేవి ముఖచిత్రంతో వెలువడిన పత్రికలో శ్రీ కొలపల్లి ఈశ్వరరావు గారి కథ 'ఉదాత్తం' మాకెంతో నచ్చింది వారికి మా ప్రత్యేక అభినందనలు

శిరీష, గౌతమి, కాకినాడ




## నాకు నచ్చిన నా కార్టూన్

12-18 జూలై 85 సంచికనుండి ప్రారంభించిన కొత్త శీర్షిక "నాకు నచ్చిన నా కార్టూన్ బాగుంది ప్రస్తుత సామాజిక స్థితిగతులను ప్రతిబింబం కాగలదనుటలో సందేహం లేదు వివిధ విషయాలను కార్టూనుల ద్వారా విశదపరుస్తూ సున్నితమైన హాస్యాన్ని, వంగ్యాన్ని నింపుతూ పాఠకులకు ఆహ్లాదాన్ని కలిగించే ఈ శీర్షిక అంటె మాకెంతో యిష్టం ఈ వారం శ్రీ బాబు చిత్రించిన కార్టూన్ సామాన్య మానవుని, మరియు నిరుపేదల స్థితి గతులను తెలుపుతున్నది నానాటికి నింగినంటే ధరల వలన జీవితావసరాలకు దూరమై దుర్భర జీవితాలను గడుపుతున్న పేదల పాట్లకు ప్రతిబింబంగా చిత్రించిన ఈ కార్టూన్‌లో హాస్యం లేదు కాని 'గొప్ప సత్యం అదే మనం ప్రతిచోట తిలకిస్తున్న 'నిత్య సత్యం' హృదయమున్న మానవుని కలచివేసే, సకల సౌకర్యాలనూ అనుభవిస్తూ, పేదవాడు చెమటోడ్చి, కట్టిన భవంతులలో నివసించే పాలకు(ను)లకు 'కనువిప్పు' కలిగించే 'సత్యం' గోచరిస్తున్నది ఈ శీర్షిక సద్వినియోగ మగుటకు అది చాలు

స్వరాజ్యలక్ష్మి, ఆనంద గజపతిరావు, వరఘట్టం

## నచ్చింది

మీరు ప్రారంభించిన 'నాకు నచ్చిన నా కార్టూన్' శీర్షిక నాకు చాలా బాగా నచ్చింది 'బాబు' గారు కార్టూన్ చాలా బాగా వేసారు

ఎస్ ఎమ్ ఇబ్రహీం, రాజమండ్రి




ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు (1938-1972)

శుక్రవారం, 9-15 ఆగస్టు, '1985
శ్రీ క్రోధన నామ సం అధిక శ్రావణ బ అష్టమి

సంపుటము 77 : సంచిక 49

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2 50 |
| పోస్టులో 6 నెలల చందా | రు. 71-50 |
| పోస్టులో 12 నెలల చందా | రు. 143-00 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధినగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక


ముఖచిత్రం :
'మహా మనిషి లో కృష్ణ

కథలు :

పున్నతుడు 14
ఆడవాళ్ళూ-జాగర్త 24
శ్రీమతితో సినిమాకు 30
ఎస్కార్ట్ 36
పన్నీరు-కన్నీరు 52
నాకూ మానవత్వం ఉంది 68

సీరియల్ నవలలు:

శుశ్రుత నర్సింగ్‌హోమ్ 8
జిగిబిగి 18
ప్రతిభ (ప్రారంభం!) 38
మల్లిక 56

వ్యాసాలు, శీర్షికలు :

ఉత్తరాలు-4, న్యూఢిల్లీ లేఖ-6, ధర్మపథం-12, నాకు నచ్చిన నా కార్టూన్-16, డాక్టర్ సలహాలు-22, ఇ'వేమన పద్యాలు-28, వారఫలం, వ్యక్తిగతం-29, గౌతమ బుద్ధుని తొలి ధర్మ ప్రచార కేంద్రం సారనాథ్-34, సుభాషితాలు-43, సినిమా విశేషాలు-44, సరాగమాల-50, బాల్ బేరింగ్ గిరక-51, వస్త్రాలంకరణ-54, ప్రశ్నావళి-63, 'మెర్లిన్' ఎవరు?-64, **అవీ-ఇవీ-అన్నీ—66, ఫాల్గుని డైరీ—67,** హైదరాబాద్ నోట్‌బుక్-74

ఎవరన్నారు నేను రిటైర్ అయ్యానని. కొత్త జీవితాన్ని ప్రారంభించానంతే! ప్రతి రోజు చిన్ననాటి స్నేహితులతో కలిసి షికారుగా పార్కుకి వెడతాను. పాట కచేరీలకు, హరికధలకు, గ్రంధాలయానికి వెడతాను. పెరట్లో మొక్కలకు నీళ్ళు పోస్తా. మనవలతో ఆడుకుంటా. ఇలా రోజంతా గడిచిపోతుంది. నేను రెండుపూటలా హార్లిక్స్ తాగుతాను. నా పనులు నేను చేసుకుని, హాయిగా కాలం గడపడానికి హార్లిక్స్ నాకు తోడ్పడుతుంది.

మాల్టెడ్ బార్లీ, వెన్నతో కూడిన పాలు, బంగారు వన్నె గోధుమలలోని పోషక శక్తుల మంచితనమంతా చక్కగా రంగరించబడిన హార్లిక్స్ ఎంతో రుచికరమైన పానీయం.

పోషక శక్తిని సమకూర్చేందుకు ఉత్తమ మార్గంగా అందరు నమ్ముతారు. 100 సంవత్సరాలకు పైగా ప్రపంచమంతటా లక్షలాది కుటుంబాలు హార్లిక్స్‌ని నమ్ముకున్నాయంటే ఆశ్చర్యం ఏముంది?




కొత్త సమయం, కొత్తరూపం

మంచి పుష్టికరమైనది

HTD-HMM-8071 TEL

# అలాంటి పరిస్థితికి అర్థం ఏమై ఉంటుంది ! ?

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుభాషి

ఈ దేశానికి శాపం ఏమైనా ఉన్నదా? భారతదేశానికి రోజులు బాగున్నట్లు కనిపించడం లేదు 13 నెలల క్రితం అమృతసర్‌లో సైనిక చర్య అనంతరం ఏదో ఒక విషాద సంఘటన ఒకదాని తర్వాత మరొకటి జరుగుతూనే ఉన్నది. అప్పటి నించి హత్యలు, ఊచకోతలు, మారణహోమాలు జరుగుతూనే ఉన్నాయి ఇక ఇప్పుడు ఆకాశంలో ఆరు మైళ్ల ఎత్తున ఎగురుతున్న ఒక పౌరవిమానం పిడుగు తాకిడికి గురైనట్లు ఘోర ప్రమాదానికి గురి కావడం జరిగింది ఈ శాపాలు, చేతబడులు అంతగా పట్టించుకోని అమెరికన్‌లు కూడా భారతదేశం శాపగ్రస్తం అయిందని అంటున్నారు ఎయిర్ ఇండియా విమానం ప్రమాదానికి గురి అయిన తర్వాత గతంలో న్యూయార్క్ టైమ్స్‌కి విలేఖరిగా ఉన్న ఒక పత్రికా రచయిత బొంబాయి వారపత్రిక ఒకదానిలో వ్యాఖ్యానిస్తూ ఆ మాటే అన్నారు

ఇక ఇప్పుడు రాజీవ్‌గాంధీ విషయానికి వస్తాను అమెరికా సంయుక్తరాష్ట్రాల పర్యటనని విజయవంతంగా పూర్తి చేసుకుని వచ్చి రాగానే ఆయన పరిస్థితులు అదుపు తప్పితే అత్యవసర పరిస్థితిని విధిస్తామని బెదిరించారు ఆయన అన్నమాటలు అక్షరాలా అలా ఉండకపోవచ్చు కానీ పదాల కన్నా వాటి వెనుక ఉన్న భావాన్నే ప్రధానంగా మనం తీసుకోవాల్సి ఉంటుంది అలాంటి పరిస్థితి వస్తే అత్యవసర పరిస్థితి సమర్థనీయమేనని ఆయన అన్నారు ఇది చాలా ఆసక్తికరమైన విషయం మొట్టమొదటిది ఆయన తల్లి తమకి వ్యతిరేకంగా అలహాబాదు కోర్టు తీర్పు రాగానే తమ పదవి పోతుందనే భయంతో దేశంలో అత్యవసర పరిస్థితి విధించారు ఆ రాష్ట్రంలోనే ఇప్పుడు ప్రధానమంత్రికి వ్యతిరేకంగా అలాంటి కేసే ఒకటి నడుస్తున్నది ఆయన మనసులో ఉన్న 'అలాంటి పరిస్థితి' అన్న దాని అర్థం ఇదే అయి ఉంటుందా?

ఇక రెండవది. పరిస్థితులు ఎలా ఉన్నప్పటికీ వాటిని మనకి అనువుగా ఎప్పుడైనా మలుచుకోవచ్చు' శ్రీమతి గాంధీ ముఖ్యంగా పంజాబు విషయంలో అలాగే చేశారు గత నాలుగున్నర నెలలుగా గుజరాత్‌లో పరిస్థితులు పూర్తిగా అదుపు తప్పాయి ఆ రాష్ట్రం ప్రధానమంత్రి పార్టీ ఏలుబడిలోనే ఉన్నది ప్రధానమంత్రే ఆ పార్టీ అధ్యక్షులు కూడా శాసనసభ ఎన్నికల దగ్గర నించి అక్కడ దాదాపు అంతర్యుద్ధం అనదగినటువంటిది జరుగుతూ ఉన్నది ఏది ఏమైనా సోలంకి పదవిలో కొనసాగుతారని ప్రధానమంత్రి అందరికి హామీ ఇచ్చారు గుజరాత్‌లో అల్లర్లు అధికార పార్టీ వారు సృష్టించినవే అక్కడ సాంఘిక వ్యవస్థని అస్తవ్యస్తం చెయ్యడానికి బాగా ఆలోచించి చేసిన ప్రయత్నం అది అలాంటి కల్లోలాన్ని గుజరాత్‌లో సృష్టించి నెలల తరబడి అది అలాగే కొనసాగడానికి దోహదం చేసిన వారు మిగతా రాష్ట్రాలలో కూడా అలాంటి పని చెయ్యరన్న నమ్మకం ఏమిటి? ఉదాహరణకి బీహార్‌నే తీసుకుందాము ఇలాంటి వర్గ పోరాటానికి అక్కడ పరిస్థితులు బాగా అనువుగా తయారై ఉన్నాయి అటువంటప్పుడు పరిస్థితి వేజారిపోయిందని, అటువంటి పరిస్థితి ఏర్పడిందన్న కారణంతో ప్రధానమంత్రి అత్యవసర పరిస్థితిని ప్రకటిస్తారా? అసలు ప్రధానమంత్రి మనసులోనే అత్యవసర పరిస్థితి చోటు చేసుకుని ఉన్నదన్న విషయం గమనార్హం దానిని కప్పి పుచ్చడానికి ఆయన మద్దతుదారులు తర్వాత ఏవో సాకులు చెబుతూ ఆ మాటల్ని ఆయన చేత అనిపించే విధంగా ప్రధానిని రెచ్చగొట్టారని అనవచ్చు శ్రీమతి గాంధీ గురించి కూడా అప్పుడు వాళ్లు టైమ్స్ ఆఫ్ ఇండియాలో అలాగే అన్నారు అదే టైమ్స్ ఆఫ్ ఇండియా ఇప్పుడు దాన్నే చెబుతున్నది ఆయన మనని హెచ్చరించ లేదనుకోటానికి వీలులేదు

మళ్లీ శాపం విషయానికి వస్తాను. తర్కానికి అందని విధంగా సంఘటనలు జరిగితే మనం వాటిని విధి పైకి నెడతాము. నేను సంఖ్యా శాస్త్రవేత్తని కాను కానీ సంఖ్యలతో గమ్మత్తులు చేసేవాళ్లు కొందరు ఉంటారు. ఒక్కోసారి అవి కూడా అర్థవంతంగానే ఉంటాయి. ఒక్కొక్కప్పుడు అద్భుతమైన విషయాలని అవి మనకి తెలియచేస్తూ ఉంటాయి



తీసుకోండి అది బంగారు గుడితో ప్రారంభం అయింది శ్రీమతి గాంధీ దారుణ హత్య, భోపాల్ విషవాయు విషాదాంతం ఆ సంవత్సరంలోనే జరిగాయి ఆ సంవత్సరంలోని అంకెలనన్నిటిని కూడితే మొత్తం 22 వస్తుంది 1948 లో మహాత్మాగాంధీ హత్య చెయ్యబడ్డారు ఆ అంకెల మొత్తం కూడా 22 1966 లో లాల్‌బహదూర్‌శాస్త్రి మరణించారు ఆ అంకెల మొత్తం కూడా 22 ఆ తర్వాత తొమ్మిది సంవత్సరాలకి మనందరికీ ఇష్టం లేనటువంటి అత్యవసర పరిస్థితి విధించబడింది దానిని మనం కానీ, రాజీవ్ గానీ మరిచిపోలేదు అదే 1975 వ సంవత్సరం మళ్లీ అదే సంఖ్య 22

ఇంకా వెనక్కి వెడితే 1939 లో రెండవ ప్రపంచ యుద్ధం మొదలైంది సిపాయిల తిరుగుబాటు అనంతరం ఒక సంవత్సరానికి అంటే 1858 లో భారత ప్రభుత్వం ఈస్టిండియా కంపెనీ నించి బ్రిటిష్ సింహాసనానికి బదిలీ చెయబడింది దానితో ఈ సువిశాల భారతావని యూరోప్‌కి చెందిన ఒక చిన్న దీవికి వలస రాజ్యంగా మారిపోయింది ఇదంతా గతంలో చాలా వెనక్కి వెళ్ళిపోవడం అవుతుంది కానీ ఈ శాపం అన్నది ఇటీవలి కాలంలోనే తగిలిందేమోనని నాకు అనిపిస్తున్నది మన పాలకులు దేశం యొక్క ఆత్మని తీవ్రంగా గాయపరిచారు అది ఏదో ఒక రూపంలో బయటికి వస్తూ ఉన్నది మీరు నాటిన దాన్ని బట్టి ఫలితం ఉంటుంది ఆ ఘోరమైన హింసవల్ల ఉత్పన్నమైన ఫలితాలనేమనంచవిచూస్తున్నాము ఆభూతాన్ని పారద్రోలితే తప్ప అది ఆగదు

విచారకరమైన విషయం ఏమిటంటే ఇంకా మన పాలకులు గుణపాఠాన్ని నేర్చుకోలేదు సరికదా ఏదో విధంగా సరిపెట్టాలనే అనుకుంటున్నారు కొస్తే అటూ ఇటూగా అయినా చేసిన పాపం ఊరికే పోదు అది కొన్ని సంవత్సరాలే కావచ్చు లేదా కొన్ని దశాబ్దాలు పట్టవచ్చు భారతదేశం విషయంలో మాత్రం అది కొన్ని సంవత్సరాలేననిపిస్తోంది మనకి స్వాతంత్ర్యం వచ్చి ఇంకా 40 సంవత్సరాలు కాలేదు కానీ మనకి వరుసగా అన్ని భయంకరమైన సంఘటనలే జరిగాయి. మన సామాజిక శాస్త్రవేత్తలు, ఇతర విమర్శకులు వాటికి మరేవో కారణాలని చూపించవచ్చు కానీ వాళ్ళు పొరపాటు పడుతున్నారని నా నమ్మకం ఈ దేశం చాలా త్వరితగతిన మార్పు చెందుతున్నదన్నది నిజం మన వ్యవస్థ ఈ మార్పుకి తట్టుకోలేకపోవడం వల్లనే ఇలాంటి హింసాత్మకమైన వొత్తిడులు ఏర్పడుతున్నాయి అమెరికా సంయుక్త రాష్ట్రాలు గత 100 సంవత్సరాలుగా మనకంటే త్వరితగతిన మార్పు చెందుతూ వస్తున్నా అక్కడి వ్యవస్థ ఆ మార్పుని తట్టుకోగలిగింది అమెరికాలో కూడా హింస ఉండవచ్చు కానీ అది వేరే రకానికి చెందినటువంటిది. దానితో ప్రభుత్వానికి సంబంధం లేదు కానీ భారతదేశంలో ప్రభుత్వమే హింసని ప్రేరేపిస్తున్నది – ఉదాహరణకి గుజరాత్‌లో సోలంకీ – అంతేకాదు తాను స్థిరంగా ఉండేందుకు ప్రభుత్వమే హింసని ఉపయోగించుకుంటున్నది అలహాబాద్ తీర్పు అనంతరం శ్రీమతి గాంధీ తట్టాబుట్టా సర్దుకుని సఫ్దర్‌జంగ్ రోడ్డులోని ఒకటో నెంబరు ఇంటిని ఖాళీ చేసి ఢిల్లీ నించి బయలుదేరే మొట్టమొదటి రైలు ఎక్కి ఉండవలసింది దానికి బదులుగా ఆమె కోర్టులని ధిక్కరించి పూర్తిగా నమ్మడానికి వీలులేని కారణాలతో అత్యవసర పరిస్థితిని విధించి రాజ్యాంగానికి అపచారం చేశారు వ్యక్తికి ఆత్మ ఎలాంటిదో దేశానికి రాజ్యాంగం అటువంటిది ఈ శాపానికి కారణాలని వెదకటానికి మనం సిపాయిల తిరుగుబాటు, రెండో ప్రపంచ యుద్ధ కాలంలోకి వెళ్లనవసరం లేదు ఆ రోజు 25 జూన్, 1975. అధికార పక్షంలో ఈ తేదీ గురించి తెలియని వారు ఎవరైనా ఉంటే వారు పదవిలో ఉండటానికి అనర్హులు

శ్రీ రాజీవ్‌గాంధీ తాము అన్న దానికి ఎలా అర్థం చెప్పినా అది అంత ముఖ్యం కాదు ఒక దేశం ప్రధానమంత్రి ఆ మాటలు అనడమే ఆందోళన కలిగించే విషయం 25 జూన్ 1975 న, జయప్రకాష్ నారాయణ్ నిర్బంధింపబడిన ఆ రోజున ఆయన అన్నారు వినాశకాలే విపరీత బుద్ధి అని. □

సీరియల్

# సుశ్రుత నర్సింగ్ హోమ్

## డాక్టర్ కె. రవీంద్ర బాబు

(గత సంచిక తరువాయి)

నర్సింగ్ హోమ్ ముందు కారు వచ్చి ఆగింది డాక్టర్ రఘును చేతుల మీద మోసుకుని తీసుకు వచ్చారు రఘు, రవి యం బి బియస్‌లో యం యస్‌లో క్లాస్ మేట్సు' రఘు గవర్నమెంటు సర్వీస్‌లో చేరాడు రవి నర్సింగ్ హోమ్ పెట్టుకున్నాడు అవసర మైనప్పుడు రఘు వచ్చి రవికి ఆపరేషన్లలో సాయం చేసేవాడు రవి హైదరాబాదులో రచయితల మహాసభకు వెళ్ళినప్పుడు నర్సింగ్ హోమ్‌ను రఘు చూసుకున్నాడు కూడాను

స్పృహ లేని రఘుని ఇరుగు పొరుగు వాళ్ళు తీసుకుని వచ్చారు అతను పొద్దున ఎంత సేపటికీ లేవకపోయే సరికి తల్లి నరసమ్మ గారు గదిలోకి వెళ్ళి తట్టి లేపిందట. ఎంత సేపటికి లేవ లేదు వళ్ళు చల్లగా వున్నది' ఆమెకు భయం పుట్టి ఏడ్వసాగింది దాంతో ఇరుగు పొరుగు వాళ్ళు వచ్చి చూసి టాక్సీలో నర్సింగ్ హోమ్‌కు తీసుకుని వచ్చారు

"బాబూ' నా బిడ్డను బ్రతికించు' అని ఏడుస్తున్న నర్సమ్మగారితో 'మీరు ధైర్యంగా వుండండి పిన్నిగారూ'" అంటూ రఘు దగ్గరకు వెళ్ళాడు

సరోజ నరసమ్మగారిని వోదార్చుతూ అవతలకు తీసుకుని వెళ్ళింది

రఘు వళ్ళు చల్లగా వుంది స్టెతస్కోపుతో పరీక్షించ బోతె జేబులో వుత్తరం కనపడ్డది రవికి

డియర్ రవీ'

నా పరిస్థితి చూసాక ముందుగా నీకు కబురు వెళ్తుందనీ చూడటానికి నువ్వు వస్తావనీ నాకు తెలుసు ఈ ప్రపంచంలో నాకు మిగిలివున్న ఒకే ఒక స్నేహితుడివి నువ్వే'

మాది శ్రోత్రియ కుటుంబం' నిప్పులు కడిగే ఆచారం గల వంశంమాది నాన్న చిన్నప్పుడే పోయినా అమ్మ కంటికి రెప్పలా చూచుకుంటూ పెంచింది నన్ను అమితమైన కట్టుబాట్లలో పెరిగిన నాకు మెడికల్ కాలేజీలో చేరగానే ఏదో వింత లోకంలో అడుగెట్టినట్లనిపించింది' అంత వరకు నేను బతికిన బావిలో కప్ప లాంటి జీవితం అంటే రోత పుట్టింది' అమ్మ మీద ఎందుకో విపరీతమైన కోపం కలుగ సాగింది చీటికి మాటికి ఆమె మీద విసుక్కుని కసురుకునే వాడిని భూదేవిలా అన్నీ వోర్చుకునేదామె మా కుటుంబాలలో ఆడవాళ్ళు ఎంతో చాదస్తంగా వుండేవాళ్ళు నాకు వాళ్ళ ఆచారాలు అలవాట్లు అంటే విపరీతమైన ఏవగింపు కలిగింది రంగుల రామచిలుకలు, పంచవన్నెల సీతాకోక చిలుకలు కాలేజీలోనూ ఆస్పత్రిలోనూ కనపడుతుంటే గొంగడి పురుగుల్లాంటి ఆడవాళ్ళను, మా బంధువుల పిల్లలను వివాహ మాడ మని అమ్మ చెబుతుంటే కోపంతో కస్సు బుస్సుమనే వాడిని ఆమె తీసుకు వచ్చిన సంబంధాలన్నీ తిరగగొట్టే వాడిని సంప్రదాయమన్నా ఆచారమన్నా విసుగుపుట్టి ముఖం మొత్తిపోయి వున్నానేమో థియేటర్ నర్సు లిల్లీ నాకళ్ళకు ఒక దివ్యాంగనలా కనపడేది ఎటువంటి మగధీరుడి నైనా పాదాక్రాంతం చేసుకో గల అందం ఆమెది! ఆ విషయం నేను నీకు చెప్పక్కర్లేదు కూడాను సహజంగా అందగత్తె, పైగా మగ వాళ్ళను ఆకర్షించ గల నేర్పు ఆమెకు పుష్కలంగా వుండేది పురుగులను ఆకర్షించే దీపంలా మగవాళ్ళను హవుస్ సర్జన్సును పోస్ట్‌గ్రాడ్యుఏట్సును, కొంత మంది అసిస్టెంటులను తనచుట్టూ తిరిగేలా చేసుకునేది

మేలిమి బంగారు మేనికాంతితో మెరుపు తీగలా మెరసిపోతూ, ముత్యాల సరాలను వెక్కిరించే పండ్ల వరుసను ప్రదర్శించే విధంగా నవ్వుతూ, నిర్మల తటాకంలో నుండి ఎగసి పడే చేపపిల్లల్లాంటి చూపుల తూపులతో ఎదుటి వారిని సమ్మోహపరుస్తూ వుండేది. వంటిలోని వంపు సొంపులను ప్రదర్శించి ఎదుటి వారిని ఎలా కవ్వించాలో ఆమెకు బాగా తెలుసు

ఆమె అందర్నీ కవ్వించి తన చుట్టూ తిరిగేలా చేసుకుంటుందే గాని ఎవ్వర్నీ దరి జేరనీయదు అని వొక వాడిక వుండేది' కాని తమకళ్ళ ఎదుటనే తమమిత్రులు పడి భస్మమయి పోతున్నా వివేకం తెచ్చుకోక ఆతురతగా వెళ్ళి దీపశిఖలో పడి ఆహుతి అయిపోయే పురుగులలా ఆమె చుట్టూ తిరిగే వారి సంఖ్య పెరుగుతున్నదే గాని తగ్గలేదు'

మిగిలిన వారి సంగతి ఏమో గాని ఆమె నన్ను పూర్తిగా పాదాక్రాంతుడిని చేసికొంది! మాకుటుంబాళ్ళలోని వయసులోవున్న ఆడపిల్లలు ఎవరూ నాతో కలివిడిగా వుండేవారుకాదు ఎవరింటికి వెళ్ళినా తలుపు చెక్కల చాటునుంచీ, గుమ్మంమాటునించీ తప్పక 'ఉ' 'ఆ' అని సమాధానాలు చెప్పేవాళ్ళేగాని చనువుగా ఎదటికి వచ్చి స్నేహంగా పలుకరించే వాళ్ళు లేకపోయారు

ఒకరోజు థియేటర్ పర్కు అయే సరికి సాయంత్రం నాలుగు దాటింది బాగా అలసిపోయి వున్నానేమో థియేటర్ నుండి బయటకు వస్తూంటే ఆమె నన్ను పేరు పెట్టి పిలవడం వినపడడంలేదు వార్డు బోయ్ చంగయ్య "సార్' మిమ్మల్ని

**జరిగిన కథ–7:** రచయిత, సర్జన్ అయిన రవితో రచయిత్రి, లెక్చరర్ అయిన ఇందువదనకు హైదరాబాద్‌లో పరిచయం అయ్యింది విజయవాడలో తన ఇంటికి వచ్చిన ఇందూకి చంద్రహాస్ నుంచి వచ్చిన ఉత్తరం సాక్షాత్కరించింది తనకి కడుపునెప్పి ఎక్కువగా ఉందని, అందు మూలంగా గుంటూరులోని రవిగారి శుశ్రుతా నర్సింగ్ హోమ్‌లో చేరానని రాసాడు ఇందుకి చంద్ర మొదట తనని ఎలా అల్లరి పెట్టిందీ తుదకు ఏ విధంగా ఆప్త మిత్రుడైనది గుర్తుకు వస్తుంది చంద్రను చూడటానికి గుంటూరు వస్తుంది ఇందువదన రవి ఇంట్లో దిగుతుంది అక్కడి నుండి ఆ రాత్రే చంద్రను చూడను నర్సింగ్‌హోమ్‌కి వెళుతుంది చంద్ర ఆమెను చూసి ధైర్యం తెచ్చుకుంటాడు. చంద్ర, రాకేష్ ఇందువదన పేరు కలవరించటం విన్న రవి మనసు కల్లోలం చెందుతుంది .రవికి మేనకోడలు గీతను పెళ్లి చెసుకోవటం ఇష్టం లేదు రవి క్లాసుమెటు మంజు అమెరికా నుండి వచ్చింది చంద్రహాస్‌కి అల్సర్ ఆపరేషన్ జరిగింది ఇందు, మంజు అక్క చెల్లెళ్ల ఎల్లలని తెలుసుకుంటాడు రవి ఇందు మంజు పినతల్లి కూతురని తెలియగానె రవి అమ్మమ్మకు ఇందుపై అబిమానం పెరిగింది రవి అమ్మమ్మకు పక్షవాతం వచ్చి పడిపోయింది

లిల్లీ స్టాఫ్ పిలుస్తున్నారు" అన్నాడు నాదగ్గరకు వచ్చి!

అతని మాటలు నాకు అమృతపు సోనల్లా వినపడ్డాయి. నేను వెనుదిరిగే లోపలే లిల్లీ నాదగ్గరకు వచ్చింది.

"డాక్టర్ సాబ్! శంకరాభరణం సినిమా చూడాలని నాలుగు రోజులుగా అనుకుంటున్నాను!చంగన్నను టికెట్ తెమ్మంటే వుత్తి చేతులతో తిరిగి వస్తున్నాడు. నాస్నేహితు రాండ్రంతా నన్నెగతాళి చేస్తున్నారు."అంత పెద్ద ధియేటర్ ఇన్‌ఛార్జి నర్సువి సినిమా టికెట్ తెప్పించుకో లేకపోయావా" అని. ఏమీ అనుకోకపోతే యీ రాత్రి మొదటి ఆటకు రెండు టికెట్లు తెప్పించి పెడతారా, హెడ్ నర్స్ సువర్ణం కూడ సినిమా చూడాలంటున్నది."అంది

నోట మాట రాలేదు! అలాగే అన్నట్లు తలూపాను. దాదాపు పరుగు లాంటి నడకతో సినిమా హాలు దగ్గరకు వెళ్ళాను. అసలు రేటుకు రెండు రెట్లు ధర యిచ్చి బ్లాకులో రెండు టికెట్లు సంపాదించాను! ఆట మొదలయే సమయానికి లిల్లీ వచ్చింది. మబ్బురంగు నైలాన్ చీరలో మెరపు తీగలా మెరసి పోతూ వచ్చింది.

"హాయ్ డాక్టర్ సాబ్! ఎలా అయితేనేం టికెట్లు సంపాదించారు! కాని ముసలి పీనుగ సువర్ణానికి సడన్‌గా స్టమక్ అప్‌సెట్ అయింది. 'రాలేనే'అని మూలుగుతుంటే టయిమయిపోయిందని వచ్చేసాను! ఒంటరిగా యీ రష్‌లో సినిమా చూడాలంటే భయం!

పోనీ వొకపని చేస్తే?

మీరు ఏమీ అనుకోక పోతే యీరోజు సినిమాకు రారాదా?" అంది లిల్లీ.

ఆపుకోలేని సంతోషంతో తల వూపి ఆమెను తీసికొని సినిమాకు వెళ్ళాను. సినిమా హాలులోని మగవాళ్ళందరూ ముందు లిల్లీకేసి ఆతర్వాత అసూయగా నాకేసి చూడటం గమనించాక నాకు ఎంతో గర్వం వేసింది. సినిమాలో హాస్య సన్నివేశాలు వచ్చినప్పుడు సంతోషంతో పకపక నవ్వుతూ నా భుజం మీద జబ్బమీద తనచేతితో పొడుస్తూ వుండేది. సీరియస్ సీను రాగానే వెక్కి వెక్కి ఏడ్చేది. ఆమె అలా ఏడవడం చూసి నేనుచాలా దిగులుపడి "లిల్లీ! ఏడవకు!" అంటూ ఆమెను సముదాయించబోయాను. నామాటలు విన్న కొద్దీ యింకావెక్కి వెక్కి ఏడుస్తుంటే ఆమె చేతిని నాచేతిలోకి తీసుకుని మృదువుగా నవరిస్తూ వుండి పోయాను. అంతే ఆమె తల నా భుజంపై ఆనించి కన్నీళ్ళు కారుస్తూ నా షర్టు తడిపేసింది. అలా ఏడ్పులు కేరింతలు మధ్య సినిమా అయిపోయింది. లిల్లీ అలా నేస్నిహితంగా మసలుకుని పక్కనే కూర్చోవడం నాలో ఎంత అనుభూతుల్ని రేపింది. అందమైన ఆడపిల్లను తీసుకుని సినిమాకు రావడం అదే మొదటిసారి నాకు.

"రఘు! ఇప్పుడెటుదిరిగి మా మెస్ కట్టేస్తారు!హోటల్‌కు వెళ్ళి భోంచేద్దాం! ఏం?" అంది లిల్లీ!

ఉడిపి హోటల్లో ఫామిలీ రూమ్‌కు తీసుకు వెళ్ళానామెను. భోజనం తర్వాత కిల్లీ వేసుకుని బయటకు వచ్చాం! మొదటి సారిగా హోటల్‌లో భోంచేసినట్లు మాట్లాడింది లిల్లీ!' రఘూ! నీతో గాబట్టి యిలా వొంటరిగా సినిమాకు వచ్చాను! మరే డాక్టరుతో నయినా చస్తే వచ్చేదాన్ని గాదు.' అని ఆమె అంటూంటె నిజమేననుకుని పిచ్చివాడిలా ఆమె వెంట నర్సెస్ క్వార్టర్సు దాకా వెళ్ళాను.

"బై డాక్టర్!" అంటూ వెళ్ళిపోతూ తన పర్సులోనించి చాక్‌లెట్ తీసి నా చేతిలో పెట్టి వెళ్ళిపోయింది. అరచేతి లోని చాక్‌లెట్ వంక చూస్తూ ఇంటికి జేరాను!

అప్పట్నుంచీ లిల్లీకి సినిమాకు వెళ్ళటానికి షికారు చేయటానికి, షాపింగ్‌కు, హోటలుకు వెళ్ళటానికి, ఇంతెందుకు, ఆస్పత్రి ఆవరణ దాటి వెళ్ళ వలసిన ప్రతిసారీ ఆమె వెంట తోడుగానే నుండేవాడిని.

చాలామంది స్నేహితులు 'జాక్‌పాట్‌ను కొట్టావురా రఘూ" అంటూండేవారు. నాకు ఆమె అంటే వెర్రి వ్యామోహం పెరుగసాగింది. లిల్లీతో మాట్లాడకుండా ఇంటికి వెళితే ఆ రోజు నాకు నిద్రపట్టేది గాదు! మరలా పరిగెత్తుకుంటూ క్వార్టర్సు ముందు నిలబడే వాడిని. నేను అలా ఆ సమయానికి అక్కడకు వస్తానని ఎలా వూహించేదో ఏమో మేడమీద వరండాలో నుల్చుని నావంక చూసి నవ్వుతూ చెయివూపేది! అలా ఆమె వంక కొంతసేపు చూచి యింటికి తిరిగి వచ్చేవాడిని!

క్రమంగా రోజులు గడచిన కొద్దీ మేమిద్దరం ఒకరి కొకరమ్ దగ్గరయాము. ఖాళీ సమయాలలో వూరిబయట వున్న రోజ్ గార్డెన్ వద్ద జేరేవాళ్ళం. లిల్లీ నన్ను ప్రేమిస్తున్నదనీ అందువలననే ఆమెనాతో అలా చనువుగా వుంటున్నదనీ అనుకునేవాడిని!

మా పిన తల్లికి వంట్లో బాగా లేక పోతే మా అమ్మ ఆమె దగ్గరకు బరంపురం వెళ్ళింది. సాయంత్రం లిల్లీ మాయింటికి సరాసరి వచ్చేసేది! ఆమె అలా రావడం మా బజారులో వాళ్ళు వింతగా చూసేవాళ్ళు! బుగ్గలు నొక్కుకుంటూ ఆడవాళ్ళు



# శుశ్రుత నర్సింగ్ హోమ్

తలుపు సందుల నుండి చూస్తే బజారులో నిలబడి మరీ చూసేవారు యువకులు వాళ్ళంతా అలా లిల్లీని చూడడం నాకొక విధంగా గర్వంగా వుండేది!

ఎక్కడకు వచ్చినా, ఎంత చనువుగా వున్నా కొన్ని హద్దులు మీరి ప్రవర్తించేది కాదు లిల్లీ! చూచే వాళ్ళందరూ వూహించినట్లు మాయిద్దరి మధ్య శరీర సంబంధమైన ప్రేమ కాదు! శారీరక మైన సంబంధంవుంటే అసలు ఆమెను నేను అంత గాఢంగా ప్రేమించి వుండేవాడిని కాదేమో? తుచ్ఛ కామకలాపాల జోలికి వెళ్ళకుండా అమలిన శృంగార రసాస్వాదనానందంతోనే ఇద్దరం పరిపూర్ణ తృప్తి పొందేవాళ్ళం!

లిల్లీ ప్రతిరోజూ చక్కగా వంటచేసి పెట్టేది. కబుర్లు చెప్పకుంటూ భోంచేసేవాళ్ళం రాత్రి తొమ్మిదింటికి తీసుకుని వెళ్ళి నర్సెస్ క్వార్టర్సు దగ్గర దిగబెట్టి వచ్చేవాడిని.

ఇలా లిల్లీ యింటికి వస్తున్నదని ఎవరో అమ్మకు వుత్తరం వ్రాసారు మూడో రోజుకే వచ్చేసిందామె. ఇరుగు పొరుగు ఆడవాళ్ళు చిలువలు పలువలు చేసి ఆమెకు చెప్పారు. వస్తువులన్నీ మైల పడ్డాయని అమె గోల చేసింది అంతా వేడివేసి కడిగి శుద్ధిచేసి వంట చేసింది

భోంచేసిన తర్వాత నింపాదిగా 'ఏమిటిరా ఈ అప్రాచ్యపు పని?' అని అడిగింది.

"అమ్మా! లిల్లీ నేను ప్రేమించు కుంటున్నాం! నువ్వు వొప్పుకుంటే ఆమెను పెళ్ళి చేసుకుంటాను" అన్నాను

"రఘూ! మనదెలాటి వంశమో తెలుసుగదా! చూస్తూ చూస్తూ నువ్వు ధర్మభ్రష్టుడివి, కర్మ భ్రష్టుడివి కావడం ఎలా సహించేదిరా" అంది.

"అమ్మా! ఆరు నూరయినా లిల్లీని వివాహమాడి తీరుతాను అలా కాని పక్షంలో మత్తు బిళ్ళలు మింగి చచ్చిపోతాను" అన్నాను

నేనలా అనగానే అమ్మ చాలాసేపు మాట్లాడకుండా వుండిపోయింది.

"రఘూ! ఈ వయసులో నాకు కడుపుకోత పెట్టకు! నేను రేపే మళ్ళీ బరంపురం వెళ్ళిపోతాను అయుష్షు వున్నన్నాళ్ళు నా చెల్లెలియింట్లోనే వుంటాను. నేనెక్కడున్నా నీ క్షేమం కోరుకుంటూనే వుంటాను! నువ్వు సంతోషంగా వుండటమే నాకు కావలసింది" అంది అమ్మ

నాకు వొకవైపు మహదానందం, మరోవైపు దిగులు! అమ్మ నేను లిల్లీని వివాహం చేసుకోటానికి మార్గం సుగమం చేస్తున్నది కాని ప్రాణం కంటే మిన్నగా పెంచి పెద్దచేసి నన్నింత వాడిని చేసిన అమ్మ ఇక నాకు జీవితంలో కనపడదు! 'అమ్మా' అంటూ పసిపిల్లవాడిలా బావురు మని ఏడ్చాను.

"పిచ్చి రఘూ! ఎందుకురా ఏడుస్తావు? బిడ్డ క్షేమంకంటే తల్లికి కావల్సిందేమున్నదిరా?" అంది అమ్మ క్రమంగా లిల్లీ మీద నాకుండే ఆపేక్ష నాలో అమ్మ అంటే వుండే ప్రేమను జయించింది!

ఎప్పుడు తెల్లవారుతుందా, ఎప్పుడు లిల్లీకి ఈ విషయం చెబుదామా అని రాత్రంతా జాగారం చేసాను

ఏడింటి కల్లా క్వార్టర్సుకు వెళ్ళి మేట్రిన్‌ను లిల్లీని చూడటానికి పర్మిషన్ అడిగాను

"డాక్టర్ రఘూ! మీకింకా తెలియదా? రాత్రి లిల్లీ వుద్యోగానికి రాజీనామా యిచ్చి వెళ్ళిపోయింది రేపే లిల్లీ వివాహం జరుగుతుంది నిజంగా ఆమె చాలా అదృష్ట వంతురాలు. కోటీశ్వరుడూ, టొబాకో కంపెనీ ప్రొప్రయిటర్ శివరావు ఆమెను పెళ్ళి చేసుకుంటున్నాడు! హనీమూన్‌కు పారిస్ వెళుతున్నారు!"

లిల్లీ అదృష్టవంతురాలా! నేను, లిల్లీ ఎంత సన్నిహితంగా వుండేవాళ్ళమో మేట్రిన్‌కు తెలుసు! అయినా లిల్లీ అదృష్టవంతురాలన్నది! అంటే అదృష్టానికి కొలబద్ద డబ్బన్నమాట!

నా సుఖం కోసం తన నమ్మకాలను, ఆచారాలను, కులాన్ని సర్వం త్యాగం







చేసింది అమ్మ!

లిలీ కోసం అమ్మను వదులుకోవటానికి సిద్ధపడ్డాను నేను!

కాని డబ్బుకోసం నన్ను బహు తేలికగా మర్చిపోయింది లిలీ!

అమ్మ ముఖం ఎలా చూచేది? నేను లిలీ ప్రేమలోపడి వున్మాదిలా ప్రవర్తించాను!

అందుకే డైజపామ్ బిళ్ళలు మింగాను. ఈ వుత్తరం నీ చేతిలోకి వస్తుందని తెలుసు అన్ని విషయాలూ వ్రాసాను నా కోసం ఒక కన్నీటి బొట్టు విడువగల మంచి మనసు నీకున్నదని తెలుసు.

నీ స్నేహితుడు,
రఘు

వెంటనే సరోజని కేకవేసి స్టమక్‌ట్యూబ్ తెప్పించాడు రవి. రఘు బిళ్ళలు మింగి ఎన్ని గంటలయిందో? ప్రయోజనం వున్నా లేకపోయినా స్టమక్‌వాష్ చేయించినందువల్ల నష్టం లేదుగదా అనుకుంటూ రఘు జీర్ణకోశంలోని ద్రవాలను సక్షన్ ఏపరేటస్ ద్వారా తోడివేయించాడు. మేనిటాల్ డ్రిప్ పెట్టించాడు

పక్క గదిలో కూర్చుని విలపిస్తున్న నరసమ్మగారిని వోదార్చుతూ మధ్య మధ్య రఘు పరిస్థితి గమనిస్తూ అటూ యిటూ తిరగసాగాడు రవి

రఘు పరిస్థితిలో మార్పు లేదు మేనిటాల్ బాగా పనిచేసి మూత్రం బాగా జారీ అయింది కాని అతను బతుకుతాడా లేదా అనే ప్రశ్నకు సమాధానం అంతు చిక్కలేదు రవికి. ఒకోసారి ఇలా ఆరేడు రోజులపాటు అపస్మారక స్థితిలో వుండి బతికినవారూ వున్నారు! గంటలలోనే ప్రాణం పోయిన వారూ వున్నారు!

ఎలాగయినా రఘు బతికితే బాగుండును కొడుకు కోసం అలమటించి ఆక్రందిస్తున్న నరసమ్మగారి కోసమైనా అతడు బ్రతకాలి!

జాగ్రత్తగా అతడిని చూస్తుండమని సరోజకు చెప్పాడు రవి ఇంటి దగ్గర అమ్మమ్మ ఎలా వుందో అని అనిపించి మనసు చివుక్కుమన్నది.

'ఒకసారి ఇంటికి వెళ్ళి చూచివస్తాను" అనుకుంటూ బయల్దేరి అంతలో రఘు వుత్తరం బల్లమీద వుండటం చూచి, "ఈ వుత్తరం ఎవరికంటా పడకూడదు' అనుకుని తీసి డ్రాయరులో పల వేసాడు

ఇంటి దగ్గర అమ్మమ్మకు బాగాలేదు! వొకసారి వెళ్ళి చూసి వస్తానమ్మా! మీరేమీ దిగులు పడకండి! రఘుకు నయమవుతుంది" అని నర్సమ్మగారితో చెప్పి బయల్దేరాడు రవి

ఎంతో నిదానంగా నివురుగప్పిన నిప్పులా వుండే రఘు ఇంత పని చేసాడంటే అతను ఎంత గుండెకోతకు లోనయ్యాడో! లిలీ రఘు కలసి తిరుగుతుండటం చూచినా ఆ విషయం గూర్చి పెద్దగా పట్టించుకోలేదు రవి పరిస్థితి ఇంత భయంకరంగా మారుతుందని బహుశ రఘు కూడా వూహించి వుండలేదేమో?

ఆప్తమిత్రుడైన తన వద్ద కూడా లిలీ విషయం రహస్యంగా వుంచాడు రఘు! అలా కాకుండా వున్నట్లయితే సకాలంలో సరిఅయిన సలహాయిచ్చి రఘును ఆత్మహత్యా ప్రయత్నం నుండి తప్పించి వుండేవాడేమో?

రఘుని పిచ్చివాడిని చేసి భగ్న ప్రేమికుడిగా ఆత్మహత్యకు పాల్పడేట్లు చేసిన లిలీ అంటే రవికి మనసులో కోపం పెల్లుబికింది!

ఆకర్షణతో పురుగులను ప్రలోభపెట్టి మంటలో మసి చేసే దీపం లాటిది లిలీ!

లోపం పురుగులదిగాని దీపానిదికాదేమో? లిలీ సంగతి తెలియనివారు లేరు. కాని ఇలా రఘులా జీవితం అంతం చేసికోటానికి ప్రయత్నం చేసిన వారు లేరు!

రఘును తన వెంట తిరిగేలా చేసుకున్నందువల్ల లిలీకి కలిగిన మేలేమిటి? శ్రోత్రియ కుటుంబీకుడు తన కోసమై ఉన్మాది అయిపోయాడని నలుగురికి తెలిసినందువల్ల ఆమె అహం తృప్తిపడి వుంటుందా?

లేదూ నిజంగానే రఘును ప్రేమించి అతన్ని వివాహం చేసుకుందా మనుకుని తీరా కోటీశ్వరుడు శివరావు వివాహం చేసుకుంటాననేసరికి డబ్బుకు దాసోహమని రఘు ప్రేమను తృణీకారం చేసిందా? ఏమో?

రఘుకు స్వస్థత చిక్కి అతని నోటివెంట నిజం చెబితేగాని అసలు రహస్యం తెలియదు ఎలాగయినా రఘుని బ్రతికించాలి!

అతను చనిపోతే నరసమ్మగారి గుండె పగిలి పోతుంది! భర్త పోయాక ఆమె తన పంచప్రాణాలూ అతనిమీద కేంద్రీకరించి జీవించింది అతని సుఖం కోసం తన నమ్మకాలను త్యాగం చేయటానికి సిద్ధపడింది వివాహం చేసుకుని బిడ్డాపాపలతో కలకల లాడవలసిన తన కుమారుడు మరణిస్తే ఇక ఆమె విచారానికి అవధులుంటాయా?

రవి యింటికి వచ్చే సరికి ఇల్లంతా ప్రశాంతంగా వున్నది ఉదయం రవి వెళ్ళేప్పుడు ఇల్లంతా అస్తవ్యస్తంగా వున్నది. మంజు గీత సాయంతో ఇల్లంతా మామూలుగా పరిస్థితికి తెచ్చింది అమ్మమ్మమంచం పక్కన కూర్చుని ఆమెను చూస్తూ వుండిపోయాడు రవి. ప్రశాంతంగా నిద్రపోతున్నది సావిత్రమ్మ.

"రవీ! బి పి తగ్గటానికి ఇంజక్షన్ ఇచ్చాను రెస్ట్‌లెస్‌గా వుంటే సెడేటివ్ ఇచ్చాను. కాఫీ, గ్లూకోజ్ నీళ్ళు తాగటానికి ఇచ్చాను గురక తగ్గటానికి డెరిఫిలిన్ ఇంజక్షన్ ఇచ్చాను. ఇప్పుడామె కొంచెం సెటిలయి వున్నది

నువ్వు స్నానం చేసి వస్తే భోజనం వడ్డిస్తాను" అంది మంజు

ఆమె మాటలకు సమాధానం చెప్పకుండా అలాగే కూర్చుండి పోయాడు రవి. ఈ అమ్మమ్మ జీవిత సంగ్రామంలో ఎడతెగకుండా పోరాడింది కన్న బిడ్డ కోసం ఆ బిడ్డ కొడుకైన తనకోసం, తన అక్కకోసం, ఆమె పోయాక ఆమె బిడ్డ గీతకోసం రెక్కలు ముక్కలు చేసుకుని ఎముకలు అరిగి పోయేలా శ్రమ చేసింది ఈరోజు తను, గీత బతికి వున్నారన్నా తను ఒక సర్జన్‌గా వున్నత స్థితికి రాగలిగాడన్నా ఆమె చలవే! ఆమె ఇలా పడిపోయివుండడం అతనికి భయం ఆందోళన కలిగించింది.

# ధర్మపథం



## అచంచల భక్తి

భగవంతుని యెడ విశ్వాసమున్నా, దైవ భక్తి ఉన్నా వానిఅనుసరణలో తారతమ్యాలుకానవస్తాయి. తమ గడ్డు పరిస్థితుల్లో అవి ఉన్నత స్థాయిని చెందుతాయి. "భగవంతుడా! నీదే భారం, ఈ ఆపద నుండి కాపాడితివా, నీకీ మ్రొక్కుబడిని చెల్లించుకుంటాను"అని మ్రొక్కుకుని దేవునిమీద భారం వేసి,ఆ ఆపద తప్పిన తర్వాత తానను కొన్న మ్రొక్కుబడిని చెల్లించి మనశ్శాంతిని పొందడం చాలాచోట్ల కానవస్తున్నది. అవసరం తీరేక పని ముగియగానే భక్తి మీది శ్రద్ధ తగ్గుతుంది. కాని, కష్ట సుఖాలతో భక్తికి ముడిపెట్ట కూడదు. సుఖ దుఃఖాలు ఒక దాని తర్వాత మరొకటి బండి చక్రపు రేకులవలె తిరుగుతూనే ఉంటాయి. వాటిని లెక్కచెయ్యకుండా ఎప్పుడూ అచంచలమైనభక్తి కలవారికి ఎన్నడూ హాని కలుగదు. దానికి సదా ఒకే రీతి భక్తిగల కుచేలుడే మనకి గొప్ప తార్కాణం.

భగవానుడు శ్రీకృష్ణునితో కలిసి, సాందీపని వద్ద విద్యలు నేర్చుకొన్న కుచేలుణ్ణి – దరిద్రదేవత వరించింది. గంపెడు సంసారం! భార్యాబిడ్డలను పోషించడం అసాధ్యమయిపోయింది. అయినా, సదా భగవంతుణ్ణి ధ్యానించే కుచేలుడు కుటుంబాన్ని గురించి పట్టించుకోలేడు. కాని, భార్య నిర్బంధం వల్ల – తన బాల్య మిత్రుడూ, ద్వారకాధిపతి అయిన కృష్ణుని వద్దకు పోయి, తన కుటుంబ పరిస్థితిని చెప్పి, ధనం తెచ్చుకుని సుఖంగా కాలం గడపాలని అనుకున్నాడు. "రిక్త హస్తేన నోపేయాత్ రాజానం దైవతం గురుమ్"అనే సూక్తి ఉన్నది గదా! రాజ్యాధికారి వద్దకు ఉత్త చేతులతో పోకూడదు. ఏదో కానుక తీసుకొని వెళ్ళాలి గదా! అతడు భార్య యిచ్చిన ముక్కిపోయిన అటుకులు కొంచెంతన జీర్ణ వస్త్రం కొంగున ముడి కట్టుకొని మరీ వెళ్ళాడు. ఎంతో శ్రమపడి ద్వారక చేరుకున్నాడు. ద్వారపాలకులు తన్ను రాజభవనంలోనికి, పోనిస్తారా? తాను శ్రీకృష్ణుని మిత్రుడనంటే నమ్ముతారా? అనే అతని సందేహం. ఎలాగో శ్రీకృష్ణుని దర్శనం అతనికి లభించింది. శ్రీకృష్ణుడు కుచేలుణ్ణి తన ప్రక్క కూర్చొ పెట్టుకొని ఎంతో గౌరవించాడు. 'వచ్చిన పని యేమిటి?" అని ప్రశ్నించాడు. కుచేలుడు తాను వచ్చిన పని మరచిపోయి "బాల్య మిత్రుడవైన నిన్ను చూచి పోదామని వచ్చాను" అని మాత్రమే అన్నాడు. అతని హృదయంలో భగవద్దర్శనాభిలాషకు తప్ప మరొక కోరికకు చోటు లేకపోయింది. అతని అచంచల భక్తి శ్రీకృష్ణుణ్ణి ముగ్ధుణ్ణి చేసింది. అతడు నవ్వుతూ "నాకేమి కానుక తెచ్చావు?" అని అడిగాడు. ఏమి చెప్పలేక కుచేలుడు తలవంచుకున్నాడు. శ్రీకృష్ణుడే అతని బట్ట చివరి ముడి విప్పి, ముక్కిపోయిన అటుకులను కొంచెం తీసుకుని నోట్లో వేసుకున్నాడు. తిరిగి ఇంటికి వస్తున్న కుచేలుడికి 'తానేమి అడగలేనందున తన మిత్రుడు ఏమి ఇవ్వలేదని అనుకున్నాడు. భక్తితో – అతని అనుగ్రహమే పదివేలనుకున్నాడు.

కుచేలుని అచంచల భక్తి – భగవద్దర్శన మాత్రాన అతణ్ణి గొప్ప శ్రీమంతుణ్ణి చేసింది.

– బులుసు వేంకట రమణయ్య

# శుశ్రుత నర్సింగ్ హోమ్

ఎందరికో చల్లని నీడనిచ్చే చెట్టు వరగిపోతున్నట్లు, ఎందరికో త్రాగటానికి నీరిచ్చే తటాకం ఎండ పోతున్నట్లు అనిపించింది.

"రవీ! నామాట విను! భోంచేసి కాసేపు విశ్రాంతి తీసుకో! ఆమె విషయమై నువ్వేమి దిగులు పడవద్దు. ఆమె పరిపూర్ణ ఆరోగ్య వంతురాలవుతుంది" గడ్డం పుచ్చుకుని అనునయంగా చెబుతున్న మంజు మాటలు అతనికో ధైర్యం కలిగించాయి.

డైనింగ్ టేబిల్ ముందు కూర్చుంటే అతనికి అమ్మమ్మ గుర్తుకు రాసాగింది. లేచి వెళ్ళబోయాడు.

"రవీ! చిన్న పిల్లాడిలా ప్రవర్తించకు! ఇప్పుడు నువ్వు యీయింటి బాధ్యతలు నెత్తిన వేసుకుని ఇన్నాళ్ళు నిన్ను పెంచి పెద్ద చేసిన మీ అమ్మమ్మ ఋణం తీర్చుకోవాలసిన సమయం ఆసన్నమయింది! నీ శరీరారోగ్యం కాపాడుకుని ఆమెకు కావలసిన వైద్యం చేస్తూ త్వరలో ఆమెకు స్వస్థత కలిగేలా చేయాలి గాని ఇలా దిగులుగా వుంటే ఎలా?" అంది మంజు.

ఆమె మళ్ళీ ఏమంటుందో ననే భయంతో రెండు ముద్దలు అన్నంతిని తన గదిలోకి వెళ్ళాడు రవి.

సావిత్రమ్మ గారికి పాలు తాగించి వచ్చి రవి గదిలో కూర్చుంది మంజు.

మంచం మీద వెల్లికిలా పడుకుని వున్నాడు రవి! అతని కండ్ల నుండి అదేపనిగా నీళ్ళు వస్తున్నాయి.

మంజు వచ్చి అతని దగ్గర మంచం మీద కూర్చుంటూ" ఛ! ఏమిటిది! మరీ చిన్నపిల్లవాడివయి పోతున్నావు" అంది.

ఆమె వడిలో తల పెట్టుకుని వెక్కి వెక్కి ఏడువసాగాడతను. అతని వీపు, తల నిమురుతూ మాట్లాడకుండా కూర్చుంది మంజు. కొంచెం సేపు అలా ఏడ్చితే అతను మామూలు మనిషి అవుతాడని అనిపించిందామెకు.

సావిత్రమ్మ గారి కెలావుందో నని చూద్దామని వచ్చి, రవిని పలుకరించటానికి అతని గదిలోనికి రాబోయిన ఇందు వాకిట్లోనే ఆగిపోయింది! మంజు అక్కవడిలో తలపెట్టుకుని రవి ఏడుస్తుండడం, అక్క అతని వీపు సవరిస్తూ అనునయిస్తుండడం చూసాక ఆమెకు ఏదో షాక్ తగిలినట్లు నిర్ఘాంత పోయింది.

శబ్దంకాకుండా తలుపు దగ్గరకు వేసి వెళ్ళిపోయింది ఇందు. ఇన్నాళ్ళుగా ఎవరి మీదా లగ్నంగాని తన మనసు డాక్టరు రవి పట్ల మోజు పడింది. ఒక మంచి రచయితగా అతను తనకు అన్ని విధాలా అభిలష నీయుడుగా కనపడ్డాడు! కాని ఇందాక అక్క, రవి అలా వుండడం చూచిన దగ్గర నుండి ఇందు మనసు సంకోచంతో వ్యాకులిత మైంది. వాళ్ళిద్దరూ యం బి బి యస్ లో క్లాస్ మేట్సు. చిరకాలంగా స్నేహితులు. సన్నిహితులు. మంజు అక్క రవికి అన్ని విధాలా సరి అయిన జోడీ! ఇలా అనుకుంటూ బరువెక్కిన గుండెతో నర్సింగ్‌హోమ్‌కు వెళ్ళిపోయింది ఇందు.

(ఇంకా ఉంది)

# ఉన్నతుడు

— సారె రామమోహనరావు

వెంకటేశం మాష్టారంటే పిల్లలకు చాలా హడల్! వాళ్ళు పాఠాలు సరిగా చదవకపోతే ఆయన చేతిలోని చింతబరికె వాళ్ళ వీపుమీద నాట్యం చేస్తుంది. వాళ్ళు స్కూలుకి రోజూ క్రమం తప్పకుండా రాకపోతే వాళ్ళకు గోడ కుర్చీ తప్పదు. అందుకే పిల్లలంతా క్రమం తప్పకుండా స్కూలుకి వస్తారు. చక్కగా పాఠాలు నేర్చుకుంటారు.

వెంకటేశం మాష్టారి సహోద్యోగులకు ఆయనంటే పట్టలేని అభిమానం. స్కూల్లో వాళ్ళు పిల్లలకు సరిగా పాఠాలు చెప్పకుండా హస్కు కొడితే వెంకటేశం మాష్టారు 'మీరు పిల్లలకు చక్కగా చదువు చెప్పి వాళ్ళని భావి పౌరులుగా తీర్చి దిద్దడానికి కృషి చెయ్యాలి. అంతేకాని ఇలా హస్కు కొడుతూ కూర్చోవడం కాదు. మనం జీతం తీసుకుంటున్నామంటే ఆ జీతానికి తగ్గపని చెయ్యాలి. మనం కూలివాడికి పది రూపాయలిచ్చామంటే ఆ పది రూపాయలకు సరిపడేపని చెయించుకోవడం లేదూ? వాడు పని సరిగా చెయకపోతే ఆ పది ఇస్తామా? మన జీతం మన కొస్తోంది. మనల్నడిగే వాళ్ళెవరూ లేరని మనం బాధ్యతారహితంగా ప్రవర్తించ కూడదు. ఉపాధ్యాయుడు అంటే ప్రధాన మంత్రి కన్న గొప్పవాడు. అతడు సరిగా చదువు చెప్పబట్టే ఆ వ్యక్తి ప్రధాన మంత్రి అయారు. లేకపోతే అవగలరా? మీరే ఆలోచించండి. మీ బాధ్యతని గుర్తెరిగి ప్రవర్తించండి' అని సున్నితంగా మందలించేవారు. అందుచేత ఆయన సాటి ఉద్యోగులు కూడ పిల్లలకు సక్రమంగా పాఠాలు చెప్పడానికి ప్రయత్నిస్తుంటారు.

స్కూలు పిల్లల తల్లిదండ్రులకు కూడ ఆయనంటే అభిమానం. 'మాష్టారూ! మా వాడికి ప్రైవేటు చెప్పకూడదూ? మీరడిగినంత ఇస్తాం' అని పిల్లల తల్లిదండ్రులు ఆయన్ని ఎన్నోసార్లడిగారు.

ఆయన నవ్వేవారు.




మీ పిల్లలకు చెప్పాల్సిందంతా స్కూల్లోనే చెబుతున్నాను. ఇక ప్రైవేటు చెప్పడానికి వేరే ఏముంటుంది? అని వాళ్ళ కోరికను సున్నితంగా తిరస్కరించేవారు.

విద్యార్థులకు ప్రైవేట్లు చెప్పడం ప్రారంభిస్తే డబ్బు సంపాదించాలని స్కూల్లో సరిగా పాఠాలు చెప్పకుండా ప్రైవేట్లు చెబుతున్నాడనే నిందవస్తుంది. అందుకే ఆయన ఎప్పుడూ ఎవరికి ప్రైవేట్లు చెప్పరు.

వెంకటేశం మాష్టారి గురించి ఒక్క మాటలో చెప్పాలంటే—

పిన్నలకు,
పెద్దలకు,
ఆయనంటే భయం
ఆయనంటే భక్తి

* * * *

"ఏరా విశ్వం! రాత్రి బాగా చదివావా?" నిన్నటి రోజున పని మీద పొరుగూర్కు వెళ్ళి అప్పుడే వచ్చిన వెంకటేశం మాష్టారు కొడుకుని ప్రశ్నించారు.

"బాగానే చదివాను నాన్నా!" విశ్వం వినయంగా సమాధాన మిచ్చాడు.

ఆ రోజే టెన్త్ క్లాస్ పరీక్షలు ప్రారంభం.

వచ్చిన ప్రశ్నలు ముందు రాయి. రాని ప్రశ్నలు నెమ్మదిగా ఆలోచించి రాయి చెప్పారు వెంకటేశం మాష్టారు.

'అలాగే నాన్నా!' అని విశ్వం పరీక్ష రాయడానికి బయలు దేరాడు.

కొంచెంసేపు పోయాక వెంకటేశం మాష్టారు కూడ భార్యతో తలుపు వేసుకోమని చెప్పి పరీక్ష హాలుకు

బయలు దేరారు

* * * *

బెల్లు మ్రోగింది

వెంకటేశం మాష్టారు విద్యార్థులకు తెల్ల కాగితాలు, ప్రశ్నాపత్రాలు పంచి పెట్టారు

విద్యార్థులు పరీక్ష రాయడం ప్రారంభించారు

వెంకటేశం మాష్టారు అందరినీ జాగ్రత్తగా పరిశీలిస్తున్నారు

ప్రశ్నాపత్రం చాలా కఠినంగా వుంది

చాలా మంది విద్యార్థులు కూడా స్లిప్పులు తెచ్చుకున్నారు కాని, వెంకటేశం మాష్టారు వాళ్ల రూముకు ఇన్విజిలేటర్‌గా వచ్చేసరికి వాళ్ళకు భయం పట్టుకుంది స్లిప్పు కొడుతూండగా దొరికిన విద్యార్థిని వెంటనే డిబార్ చేయిస్తాడాయన లోగడ కొంత మంది విద్యార్థులకు అలాగే జరిగింది అందుకే వాళ్ళకు స్లిప్పులు కొట్టడానికి భయంగా వుంది ప్రశ్నలు వచ్చినా రాకపోయినా స్వంతంగా రాయడానికి ప్రయత్నిస్తున్నారు

అసలు ప్రతి విద్యార్థి తెలివైన వాడే! పరీక్షల సమయం వచ్చేసరికి 'ఆ ప్రశ్న రావొచ్చు, ఈ ప్రశ్న రావొచ్చు అని ఒకరి నొకరు తర్జన భర్జన చేసుకుని తికమకపడి వచ్చిన ప్రశ్నలనే మరచిపోతారు అందుకే విద్యార్థులు స్లిప్పులు కొట్టడానికి ప్రయత్నిస్తారు

వెంకటేశం మాష్టారి కళ్ళు ఎక్స్‌రే కళ్ళు ఎలాంటి విద్యార్థి అయినా సరే స్లిప్పులు ఎంత గుంభనంగా కొట్టినా సరే ఆయన ఈజీగా పట్టుకోగలరు

అయినా –

ఓ విద్యార్థి ధైర్యం చేసి జేబులోంచి స్లిప్పు తీశాడు ఆన్సర్ పేపర్ కిందపెట్టి స్లిప్పు రాస్తున్నాడు

అది వెంకటేశం మాష్టారి కంట పడనే పడింది

గబగబా ఆ విద్యార్థిని సమీపించారు. ఆ విద్యార్థి చేతిలోంచి స్లిప్పు ఆన్సరు పేపరు లాక్కున్నారు. ఆన్సర్ పేపర్‌కు స్లిప్పు తగిలించి 'కాపీడ్" అని రాశారు ఆ తరువాత "ఇక నువ్వు వెళ్ళవచ్చు" అని చెప్పారు

ఆ విద్యార్థి మారు మాట్లాడకుండా బయటకు వెళ్ళిపోయాడు.

కాపీ కొట్టిన ఆ విద్యార్థిని పట్టుకుని తన వృత్తి ధర్మాన్ని నిర్వర్తించినందుకు ఆయన కెంతో తృప్తి కలిగింది. గర్వంతో ఛాతీ వుప్పొంగింది

పరీక్ష ముగిసింది

వెంకటేశం మాష్టారు ఇంటి ముఖం పట్టారు

దూరంగా ఆయన ఇంటి ముందు పెద్ద గుంపు కనిపించింది.

ఏమిటా అనుకుని గబగబా గుంపుని సమీపించారు

గంపు చీల్చి లోనికి చూశారు

ఎదురుగా కొడుకు విశ్వం శవం. పక్కనే ఖాళీగా వున్న నల్లుల మందు సీసా! భార్య కొడుకు శవం మీద పడి హృదయ విదారకంగా విలపిస్తోంది

దుఃఖంతో ఆయన హృదయం చితికి కన్నీరు కళ్ళ నుండి బొటబొటా కారింది

"నాయనా! విశ్వం! ఎంత పని చేశావు! నా వృత్తి ధర్మాన్ని నేను నిర్వహించాను. అందుకే నువ్వు స్లిప్పు కొడుతూంటే కన్న కొడుకువని కూడ ఆలోచించకుండ పట్టుకున్నాను నా కొడుకువైవుండి కూడా నువ్వు నన్నర్థం చేసుకోలేకపోయావు" తన ఒక్కగా నొక్క కొడుకు శవం మీద కుప్పలా కూలిపోయారు పున్నతుడు □





# నాకు నచ్చిన నా కార్టూన్

నేను వేసిన కార్టూన్లలో నాకు నచ్చినది ఏదో వ్రాయమని ఆంధ్ర సచిత్ర వార పత్రిక సంపాదకులు కోరినపుడు నిజంగా క్లిష్ట పరిస్థితి ఎదురైనట్లు అనిపించింది ఎందుకంటే –

'కాదేదీ కార్టూన్ల కనర్హం' అన్నట్లు అప్పడాల కర్ర నుండి అమెరికాదేశం వరకూ నే వేసిన వందల కొద్దీ కార్టూన్లలో నాకు నచ్చినది ఏది .? ఏది.. ?? అని ఆలోచించగా ఏదీ తోచలేదు – అయితే నే కార్టూన్స్ వేసే తొలి రోజుల్లో (తేదీ సంవత్సరం గుర్తు లేదు) ఆంధ్రప్రభ వీక్లీలో ప్రచురించబడి ఎందరో పెద్దల, మిత్రుల ప్రశంసలు పొందిన – మీకు బిడ్జి లేక పోయినా ఇబ్బంది లేదు కదోయ్ అంటూ బుజాల మీద కెక్కి హాయిగా తన అవసరం తీర్చుకుంటున్న ఈ రాజకీయ నాయకుని కార్టూన్ నా మనస్సులో మెదిలింది నిజానికి మన నాయకుల్లో అప్పటికీ ఇప్పటికీ ఏ మార్పులేదు– అందుకే ఈ కార్టూన్ ఎప్పటికీ నూతనంగా వుంటుంది

అంచేత నే వేసిన కార్టూన్స్‌లో నాకు నచ్చిన కార్టూన్ ఇది!

–కుమారి రాగతి పండరి



# రైతు సోదరులు, చేతి పని వృత్తుల వారు, రోజు వారి కూలీలు...

## సురక్షితమైన, సుఖవంతమైన భావి ప్రణాళిక నేడే రూపొందించుకోండి.



రజకులు

## జాతీయ పొదుపు సంస్థవారి 10 సం॥ల సాంఘిక భద్రతా సర్టిఫికెట్లు కొనండి.

- సం॥నికి 11.5 శాతం వడ్డీ.
- 10 సం॥ల పాటు ఉచిత భీమా సౌకర్యం.
- సులభంగా లభ్యం.
- 10 సం॥లలో మీ ఆదా మూడింతలు.



రైతులు



చేపలు పట్టువారు (బెస్తవారు).



చర్మకారులు



రాళ్ళు కొట్టువారు (చేతిపనివారు).

నిర్ణీత ఆదాయం లేని మీకోసం రూపొందించబడ్డ జాతీయ పొదుపు సంస్థవారి 10 సం.ల సాంఘిక భద్రతా సర్టిఫికెట్లు. వీటితో మీ కుటుంబానికి సురక్షితమైన, సుఖవంతమైన భవిష్యత్తు. మీ ఆదా మొత్తం 10 సం.లలో మూడింతలు అవడమే కాకుండా ఉచిత భీమా సౌకర్యం కూడా లభిస్తుంది.

ఈ సర్టిఫికెట్లు కొనడం ఎంతో తేలిక. మిగతా భీమా పథకాల్లో లా కాకుండా డాక్టర్ సర్టిఫికెట్‌తో నిమిత్తం లేదు. 18 సం. నుండి 45 సం.ల వయస్సు గలవారు ఏ పోస్టాఫీసులోనైనా డబ్బు చెల్లించి వెంటనే ఈ సర్టిఫికెట్లు పొందవచ్చు. ఇవి రూ.500/- మరియు రూ. 1000/-ల మూల్యాలలో దొరకుతాయి.

మిగతా వివరాలకై :—

మీ దగ్గర్లో నున్న ఏజెంటును కాని పోస్టాఫీసులో కాని సంప్రదించండి. లేదా మీ జిల్లా కలెక్టరు కార్యాలయములోని స్మాల్ సేవింగ్స్ తహసీల్దారుని గాని, భారత ప్రభుత్వ జిల్లా సేవింగ్స్ అధికారిని గాని ప్రాంతీయ డెప్యూటీ డైరక్టరు (స్మాల్ సేవింగ్స్) గారిని గాని సంప్రదించండి.

జారీ చేసినవారు :—

కమిషనర్, స్మాల్ సేవింగ్స్,
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము,
హిమాయత్‌నగర్, హైదరాబాదు - 500 029.

అధిక వడ్డీతో పాటు
ఉచిత భీమా సౌకర్యం
కల్పించే సంస్థ
దేశంలో ఇదొక్కటే.



## జాతీయ పొదుపు సంస్థ

మీ భద్రతే మా లక్ష్యం.

TARA/CSS/1/85-86

## సీరియల్:

# జిగి–బిగి

## ఎమ్. హరా

(గత సంచిక తరువాయి)

24

"ఆ కనపడే డబ్బా రేకుల వరండా యిల్లే కుటుంబానిది' అంది అమ్మడు తన చేతిలో వున్న కుటుంబం యింటి ఎడ్రస్ చూస్తూ.

"మైన్ గేటు దగ్గరున్న ఆ లంబిణి ఎవరు? సౌభాగ్యం సందేహం.

"ఆయన రెండో కూతురో పదో కూతురో సరిగ్గా చెప్పలేం ఆయనకి పన్నెండుమంది ఆడ సంతానమని మీ బాబయ్య చెప్పాడు" అంటూ నడవసాగింది అమ్మడు.

ఉద్యోగాల వేటకై వచ్చిన నలుగురు ప్రేమికులు కుటుంబం యింటి గేటు ముందు గుమ్మిగూడారు. అంతవరకు ఏదో నవల చదువుతూ యింటి ఆవరణలో పచార్లు చేస్తున్న లంబిణి ప్రశ్నార్థకంగా వాళ్ళ వంక చూస్తూ అంది–

ఎవరు కావాలి'

'కుటుంబరావుగారిని కలవాలి' గేటు అవతల సమాధానం.

అపాయింట్‌మెంట్ తీసుకున్నారా' గేటు యివతల ప్రశ్న.

'లేదు

'అయితే ఆఫీసులో కలవండి

'లేదు యిప్పుడే కలవాలి" అంటూ దౌర్జన్యంగా మైన్ గేటు తెరిచింది అమ్మడు. అందరూ బిలబిలమంటూ ఆ యింటి ఆవరణలోకి ప్రవేశించారు.

'ఏమిటి దౌర్జన్యం కొంపదీసి మీరు ఎ. స. బి దెయ్యాలు కారు కదా? నో నో. ఇన్‌కమ్‌టాక్స్ భూతాల్లా వున్నారు. దెయ్యాలూ, భూతాలు రాగానే డేంజర్ కేక వేయమన్నాడు మా నాన్న యింతకీ మీరెవరు?" అంటూ కలవరపడుతుందా పిల్ల.

భయపడకు పాపా' మేం వాషింగ్ పౌడర్ ప్రచారకులం. భయపడకు పాపా అంటూ అభయమిచ్చాడు అబ్బాయి.

నేనేం పాపని కాదు. ఈ జాకెట్, పరికిణీ విప్పేసి చీరె కట్టుకుంటే యిద్దరు పిల్లల తల్లిలా వుంటాను. మీకింకా పెళ్ళి కాకపోతే మీ భార్యలా వుంటాను పెళ్ళైతే ప్రేయసిలా వుంటాను" అంటూ గురి చూసి అబ్బాయి వంక చూస్తూ గుక్క తిప్పుకోలేదు లంబిణి.

ఆ పిల్ల అవాకుల చవాకులకి నిజంగా భయపడిన అమ్మడు, తన వెనక్కి అబ్బాయిని నెట్టేసి గట్టిగా అంది "మేం అర్జంటుగా మీ నాన్నగారితో బిజినెస్ చేయాలి. మమ్మల్ని వెళ్ళనీ'

"లోపల బిజినెస్ టాక్స్ జరుగుతున్నాయి. అందుకనే నేనిక్కడ కాపలా గేటుకి అడ్డంగా మీరంతా గుమికూడితే ఎలా? రోడ్డు మీద జనానికి నేను కట్టుకున్న పరికిణీ, జాకెట్ కనబడదు. అందా పిల్ల వగరుగా వగలు కురిపిస్తూ.

"నువ్విలా అయినవారికి, కాని వారికి నీ కొత్త జాకెట్ చూపిస్తుంటే, దారిన పోయే దొంగ నీ జాకెట్‌పై మోజుపడి నిన్ను అద్దె సైకిలు మీద ఎక్కించుకుని పారిపోతాడు' అంటూ అతి తెలివితేటలు చూపిస్తూ ఆ పిల్ల జాకెట్‌ని చూడసాగాడు చిరంజీవి.

"అంత అదృష్టం కూడానా. మీరు చెప్పినట్లే మా పెద్దక్కయ్య స్కూటర్ మీద పారిపోయింది. ఒక్క అమ్మాయి తగ్గినా తగ్గినట్లే. పెళ్ళి ఖర్చులు మిగిలాయని మా నాన్న ఆనందపడుతూ, ఒకే ఒక రాత్రి మాత్రం హాయిగా నిద్రపోయారు. మర్నాడు మా పెద్ద బావా, అక్కయ్య వచ్చారు. స్కూటర్‌కి అద్దె కట్టాలి మావా అని మా బావ డబ్బులు అడిగేసరికి మా నాన్న ముఖం నల్లబడింది. మీరిప్పుడు అద్దె సైకిల్ తెస్తే మా నాన్న చేత కిరాయి యిప్పించడానికి రెడీగా వున్నాను. యికమీదే ఆలిశ్యం' అంటూ తొందర చేసి చకచకానవ్వేసిందా పిల్ల.

లంబిణి బారి నుంచి చిరంజీవిని తప్పించి దాచలేక సతమతమవుతున్న సౌభాగ్యం చురుగ్గా ప్రశ్నించింది.

ఏం చదువుతున్నావమ్మా"

'ప్రణయ ప్రళయం"

నీలాంటి చిన్నపిల్లలు యింత కఠినమైన నవలలు చదవకూడదు బుజ్జీ' అంటూ ఆ పిల్లకి హితవుగా హితబోధ చేయసాగింది అమ్మడు.

సార్థక నామధేయురాలు లంబిణి. ఆమె ప్రేమించడానికి కనుచూపు మేరలో మొగ పురుగు ఒక్క క్షణం కూడా కుదురుగా నిల్చోదు. కారణం ఆమె రూపం.

యికపోతే ఎంత ధరకైనా సరే ఆ పిల్లకే కాదు, ఆ పిల్ల అక్కల చెల్లెళ్ళకి కూడా మొగుళ్ళని కొనడానికి సిద్ధంగా ఉన్నాడు కుటుంబం. అమ్మకానికి సిద్ధంగా వున్న డబ్బుకి గడ్డి తినే పెళ్ళికొడుకులు సైతం, ఆమెని పెళ్ళాడడానికి వెనకాడుతున్నారు. కారణం ఆమె రూపం, గుణం నిప్పులాంటిది కాదు. నీళ్ళతో ఆర్పిన నల్లటి బొగ్గులాంటిది.

కేవలం కాలక్షేపం కోసం స్కూల్‌కి వెళ్ళే ఆ పిల్ల నవలలు చదవడంలో దిట్ట. దంపతులు లేక ప్రేమికులు అనే సాంఘిక సంబంధం అనిశ్చితమైనదని ఆమె ఓ నవల్లో చదివింది. అందుకే ఈ కుర్రాళ్ళ వెంట పడుతున్నది.

యిది ఆమె నేరం కాదు. తప్పుకాదు. ఏ వయస్సుకా ముచ్చటన్నారు. తమ ముచ్చట ప్రతీ రోజూ తీర్చుకొనే తల్లిదండ్రులు, పిల్లల మంచి చెడ్డలూ, చూడకపోవడం సాంఘిక నేరం.

తమ ఆడపిల్లల అందం, చదువూ, గుణం అంచనా వెయకుండా, డబ్బు

---

జరిగిన కథ–9: ఎసియర్ క్లర్క్స్ పరీక్ష రాయడానికి వెళుతున్న అమ్మాయి, అబ్బాయికి పరిచయం అవుతుంది. ప్రజాసేవ కంపెనీ నడిపే బిజ్జావార ఉభయానందం తన చినతల్లి మనుమరాలు సౌభాగ్యవతిని చేరతీసాడు. సౌభాగ్యవతికి పెళ్ళి చేసి ఆమె వరాన్ని వశ్యం చేసుకోవాలని ఉభయం కోరిక. సూర్యనారాయణ మనుమరాలు అమ్మాయి సౌభాగ్యం. చిరంజీవి ప్రేమించుకున్నారు అమ్మాయి అబ్బాయి ప్రేమించుకున్నారు. సౌభాగ్యవతి పేరుతో అబ్బాయి రూముకి వెళ్ళిన అమ్మాయి అతనికి ఉభయానందం ప్లాను వివరించింది. అంతా విన్న అబ్బాయి ఇదంతా తన తండ్రి ఆడుతున్న నాటకమేనని తన కథంతా చెప్పసాగాడు. అబ్బాయి తండ్రి ప్రజాపతి దగ్గరకి వెళ్ళి అబ్బాయి తన కొడుకు సౌభాగ్యవతిని ప్రేమిస్తున్నాడని చెప్పాడు ఉభయం. ఉభయం పెద్ద ఎత్తులో వ్యూహం పన్నుతున్నాడని పసిగట్టిన ప్రజాపతి తను వచ్చి అబ్బాయి ప్రేమను పరీక్ష చేసి పెళ్ళి చేస్తానని చెప్పాడు. అబ్బాయి, అమ్మాయి చిరంజీవి, సౌభాగ్యవతి ఏదో ఒకసాకుతో హైదరాబాద్ వెళ్ళిపోవాలని ప్లాను వేస్తారు. ప్రజాపతి కొడుకు దగ్గరకి వస్తాడు. ఆయన అమ్మాయినే సౌభాగ్యవతిగా భావిస్తాడు. నాటకం ప్రారంభమవుతుంది. మాటలతో బురిడీ కొట్టించి ఉభయం ఆస్తిని తన పేర రాయించుకుంటాడు అబ్బాయి. రెండు ప్రేమ జంటలు హైదరాబాద్ చేరాయి. తన పేర రాయించుకున్న ఆస్తిని అబ్బాయి సత్రకాయకి అమ్మేసాడు. ఉభయం బజారుపాలయ్యాడు. ఉభయంతో చెలగాటకు వచ్చిన ప్రజాపతి, సాధ్వి అతని దీనావస్థ చూసి పాలాయన వాపం స్వీకరిస్తారు

పారేస్తే చాలు డాక్టర్లు, ఇంజనీర్లు, ఆఫీసర్లు, యాక్టర్లు, క్రికెట్ ప్లేయర్లు అల్లుళ్ళుగా దొరుకుతారనే దురభిప్రాయం గల తల్లిదండ్రుల పిల్లలు ఇలానే మారుతారు పెరుగుతారు.

"నేనేం చిన్న బుజ్జిని కాదు కుటుంబనియంత్రణ అమలుపరిచే వయస్సు వచ్చింది నలుగురు అక్కలకి యింకా పెళ్ళిళ్ళు కాలేదని, నన్ను చిన్న పిల్లలా చేయడానికి నాకి పరికిణీ, జాకెట్ చుట్టింది మా అమ్మ. అయినా నాకన్నా చిన్నపిల్లలు సినిమాల్లో ప్రేమించేసి, పెళ్ళిళ్ళి కనేసి, విరివిగా త్యాగాలు చేసేస్తున్నారు. మీరు సై అంటే చాలు చూపిస్తాను' అంటూ సరసంగానే చిందులు వేసిందా పిల్ల దూరంగా వినపడుతున్న సినిమా పాట వింటూ.

ఆమెపై చెయ్యి చేసుకోడానికి కొంగు బిగించింది అమ్మడు. నోరు పారేసుకోడానికి గొంతు సవరించుకుంది సౌభాగ్యవతి.

అదే సమయంలో ఆ యింట్లోంచి వస్తున్న యిద్దరు ఘరానా వ్యక్తులు మెయిన్ గేటు దగ్గర గుంపుని చూసి దొడ్డి గుమ్మంకేసి పరిగెత్తారు

"ఏమండోయ్ . పెద్దమనుషులు .. రాజమార్గంలోంచి వెళ్ళండి. ఈ గుంపు మనదే సగోత్రికులే" అంటూ అరిచింది లంఖిణి.

చచ్చి చెడి ఎలాగైతేనేం చెట్టా పట్టాలేసుకుని కుటుంబరావు గదిలోకి ప్రవేశించిన నలుగురు ప్రేమికులు నమస్కార బాణాలు వదిలారు.

"నాయకార్పణం' అంటూ దొంగ చూపులు చూశాడు కుటుంబం. ఒక భారీ రాజకీయ నాయకుడి అండతో అవినీతి పనులు చేయడంలో ఆరితేరిన కుటుంబం తనకి లభించే ప్రతిది నాయకుడికే అర్పిస్తాడు

ఉభయం యిచ్చిన రికమండేషన్ లెటర్‌ని అతనికిచ్చింది అమ్మడు అతనా వుత్తరం చదివాడు తల పంకించాడు ఆడవారి హాండ్ బ్యాగ్‌లూ, మగవారి జేబులు తడిమినట్లు చూశాడు

"దీని పేరు సౌభాగ్యం బి కాం. టైపు చేయగలదు దాని పక్కనున్నవారు మా అన్నయ్య చిరంజీవి. ఎం ఏ తెలుగు. యిక నా పక్క నిల్చున్నది ఎవరో కాదు అబ్బాయి ఎం ఏ మాత్స్ నా హిస్టరీ ఉభయంగారి జాబులో వుంది నాకేకాదు ఈ జనాభాకికూడా జాబ్‌లు కావాలి హోల్‌సెల్ రేటు చెప్పండి బేరం చెయకుండా మా తలలు తాకట్టు పెట్టి డబ్బు తెచ్చి యిస్తాం' అంటూ ఎటువంటి అరమరికలు లేకుండా ఎవరో తరుముకు వస్తున్నట్లు గబగబా అనేసి గాఢంగా వూపిరి పీల్చింది అమ్మడు

ఆమె మాటలు శ్రద్ధగా ఆలకిస్తున్న కుటుంబం ముఖంపై రంగులు అర్థవంతంగా మారుతున్నాయి.

ఉభయం రికమండేషన్ కాదనే తాహతు లేక నీకు మేలు చేయాలనుకున్నాను, నువ్వేమో తల తాకట్టు పెట్టి పైకం తెస్తానని నిలుగుతున్నావు మెదడు లేక పోయినా ఫరవాలేదు ఏదో విధంగా సర్దుకోవచ్చు ఆకారానికి తలకూడా లేనివారికి ఉద్యోగాలు సృష్టించడానికి నేనేం క్షుద్ర మాంత్రికుడిని కాదు పెడసరంగానే పెగవి విరిచాడు

'ఏదో మాట వరసకి అంది అమ్మడు యింతకీ తమ రేటు చెప్పారుగాదు" మధ్యలో కలుగజేసుకున్నాడు అబ్బాయి

"లంచాలు బాగా మెక్కుతూ బాహాటంగా నీతిబాహ్యంగా బ్రతకడానికి మీకు సిగ్గూ ఎగ్గూ లేదా? బుద్ధి జ్ఞానం లేదా?" అంటూ కూత పెడుతూ కాలు దువ్వి కుటుంబంతో కబాడి ఆటకి సిద్ధమైనాడు చిరంజీవి

అతని కవ్వింపు చేష్టలకి చెక్కు చెదరలేదు కటుంబం సై అనలేదు తలని వొంచలేదు చిన్మయానందంగా చిరునవ్వు చిందించి అన్నాడు

"స్వార్థం, అవినీతి, అన్యాయం, అసత్యాలతో ఈ పొట్టని పెంచినా, లేక నిస్వార్థం. నీతి. న్యాయం సత్యాలతో ఈ పొట్టని వస్తులుంచినా. ఎప్పుడో ఒకప్పుడు బూడిదవుతుంది కాయం. ఈ కాయంలో ఓ జీవుడున్నాడు. వాడే పరమాత్మ వాడిని హింసించకూడదు జీవహింస మహాపాపం యిదే నా వేదాంతం. నాకోసం, నా పిల్లలకోసం లంచాలు తీసుకుంటున్నాను మీ పెద్దలు అన్యాయ మార్గం అనుసరించలేదు. కాబట్టే నేడు మీరిలా బజారున పడ్డారు నా పిల్లలకి కర్మ పట్టకూడదని బ్లాక్‌మనీ కూడబెడుతున్నాను. నాకు ఆడపిల్లలు పన్నెండుమంది. మా పిల్లలకి పెద్దింటి సంబంధాలు చెయ్యాలని పాచికలు వేస్తూనే వున్నాను. మీకు నిజంగా నన్ను సంస్కరించాలని బుద్ధి జ్ఞానం వుంటే మా పిల్లల్లో మీకు నచ్చిన వారిని మనువాడండి మీ ఇద్దరికీ ఘనంగా ఉద్యోగాలు యిప్పిస్తాను యిక లంచాలు ముట్టను మీరు సై అంటే చాలు యిద్దరు కన్యల దానఫలం దక్కించుకుంటాను మీరు చెప్పినట్లు మారుతాను

కయ్యానికి కాలుదువ్వుతూ పేరంటానికి వచ్చిన వదరుబోతు నోటిలో తీపి వాయినం కుమ్మరించి, వియ్యానికి కాళ్ళు పట్టుకున్న విధంగా వున్నాడు కుటుంబం

ఇప్పుడీ మూర్ఖుడితో వాదనకి దిగి, ఈ అయోగ్యుడి ఆడపిల్లల బారి నుంచి బయటపడటం కష్టమనే ఏకాభిప్రాయానికి వచ్చేశారు నలుగురు ప్రేమికులు కుటుంబం కూడబెట్టిన అక్రమ సంపాదనకి ఎసరు పెట్టడానికది సమయంకాదని తీర్మానించుకున్నారు.

'మా అమ్మాయిల్ని పెళ్ళాడితే మీకు 'ఉద్యోగాలు యిస్తాను' అంటూ అరిగిపోయిన గ్రామఫోన్ రికార్డులా వాగుతూనే వున్నాడు కటుంబం

యిక యిది పనికాదని మౌనంగా తమ కాళ్ళకి బుద్ధి చెప్పారు నలుగురు ప్రేమికులు వారు వీధి గుమ్మం దాటారు

అదే టైంలో ఆ యింటి ఆవరణలో ఒక స్కూటర్ ఆగింది స్కూటర్ దిగిన బడుద్దాయి చూపులు అమ్మడి ముఖంపై వ్రాలాయి. అతని చేతికున్న మనిషి



# ఒక్కటే

ఎంత పెద్ద వృత్తమైన కేంద్రమొక్క బిందువే
ఎంత గొప్ప వంశమైన మూలమొక్క పురుషుడే
ఎంత మేలి యోగమైన అంత్యమొక్క మరణమే
ఎంత పనికి మనుజుడైన గోయి ఆరు అడుగులే

ఎంత పెద్ద వస్తువైన గరిమనాభి ఒక్కటే
ఎంత పెద్ద చెట్టు ఐన తల్లి వేరు ఒక్కటే
ఎంత పెద్ద దేశమైన రాజధాని ఒక్కటే
ఎంత పెద్ద కావ్యమైన అంతరాత్మ ఒక్కటే

ఎంత పెద్ద బాటయైన ఏపరిపాద మొక్కటే
ఎంత పెద్ద పాటయైన పల్లవున్న దొక్కటే
ఎంత పెద్ద జాతియైన బంధముక్క సమతయే
ఎంత పెద్ద మతమ్మైన సారమొక్క మమతయే

—కనమలూరు వెంకట శివయ్య

# జిగిబిగి

కాటు మచ్చలు స్పష్టంగా చూశాడు అబ్బాయి. అమ్మడిని అల్లరిపెట్టిన బడుద్ధాయి యితడేనని పోల్చుకుంది సౌభాగ్యం.

"మమ్మల్ని సినిమాకి తీసుకెళ్తానని మభ్యపెట్టి యిప్పటివరకు ఎక్కడికి చెక్కేశావ్ పెద్ద బావా సినిమా ఖర్చులు మా నాన్న దగ్గర రాల్చుకుని, నిండు కోపంతో నీకోసం ఎదురు చూస్తున్నది మా పెద్ద అక్కయ్య. లోపలికి వెళ్ళండి బడుద్ధాయి బావగారు . అంతా మీకే తెలుస్తుంది" అంటూ వెకిలిగా నవ్వింది లంభిణి

మరదలు మాటలు విన్పించనట్లు, ఆబగా అమ్మడిని చూసి చూసి అలిసిపోయి మీరా అంటూ బద్ధకంగా ఆశ్చర్యపోయాడు బడుద్ధాయి

"మేమె బడుద్ధాయ్" అంటూ కసిరినట్లు చూసి ముందుకు సాగింది అమ్మడు అండ్ కో

లంభిణి కనుబొమలు ముడివడినాయి. బడుద్ధాయి కళ్ళు పగతో భగ్గుమన్నాయి అప్పటికప్పుడే అమి తుమి తేల్చుకోవాలనుకున్నాడు. మావగారి యింటి ముందు తన వికార విశ్వరూపం బహిరంగపరచడానికి భీతిల్లాడు లంభిణి బుజంపై చెయి వేసి యింట్లోకి వెళ్ళాడు తన వునికి భద్రతకోసం అమ్మడు అండ్ కో గురించి వో కట్టు కథ అల్లాడు పెద్ద పీట మీద తీరిగ్గా కూర్చుని ఎంతైనా ఇల్లరికపుటల్లుడు మరి!

రోడ్డు మీద నడుస్తున్నారు నలుగురు ప్రేమికులు అబ్బాయి హఠాత్తుగా అన్నాడు

'మన పెద్దలకి తోడుగా ఈ బడుద్ధాయి కుటుంబానికి కూడా బుద్ధి చెప్పాలి '

"ఓ కే. అలాగే మన ధ్యేయం పెద్దలకి బుద్ధి చెప్పడమే గాదు. మన బ్రతుకుతెరువు కూడా చూసుకోవాలి అంది అమ్మడు.

చిరంజీవి పేపర్లు కొన్నాడు అందరూ కలిసి వాంటెడ్ కాలమ్స్ చూడసాగారు

25

తిథులు మారుతున్నాయి సప్తగ్రహాలు నిలకడగా వుండలేక తమ స్థానాలు మార్చుకుంటున్నాయి ఉద్యోగాల వేటలో వొక్క అడుగు కూడా ముందుకెళ్ళలేకపోయారు నలుగురు ప్రేమికులు తిథులు తలరాతలు మార్చలేవు గదా!

ప్రజాసేవ చేసే సిటి బస్సులకి యథాశక్తి ఆర్థిక సహాయం చేసి, ఆ రోజంతా తిరిగి తిరిగి రిజర్వ్ బాంక్ బస్ స్టాపులో కలిశారు చిరంజీవి సౌభాగ్యవతి

సనత్‌నగర్ నుంచి వస్తున్న బస్‌లోంచి దిగిన అతనూ, చార్మినార్ వెళ్ళే బస్‌లోంచి దిగిన ఆమె అతి విచారంగా వున్నారు ఇద్దరూ మౌనంగా రోడ్డుపై నడుస్తున్నారు తమ తమ ఉద్యోగ ప్రయత్న అనుభవాలు ఎరుకపరచడానికి వెనకాడుతున్నారు

రవీంద్రభారతి కనబడగానే అంది సౌభాగ్యం 'ఏదో నాటక ప్రోగ్రాం వుందనుకుంటాను ... వెళ్దామా'

అతను వాల్‌పోస్టర్ల వంక చూస్తూ "యదార్థ జీవితాలు – అనే నాటకం .. టికెట్ కొన్న తెలుగు ప్రేక్షకుల కోసం ప్రత్యేకంగా ప్రదర్శించబడుతోంది బహుశా నాటకం ప్రారంభించి వుంటారు టికెట్ లేకుండా అనుమతిస్తే లోపలికి వెళ్దాం లేదా కాంటీన్‌లో టీ చప్పరించి కాసేపు కబుర్లతో కాలక్షేపం చేద్దాం" అంటూ థియేటర్ మెట్లు ఎక్కసాగాడు

రవీంద్రభారతిలోకి వచ్చారు యిద్దరూ అప్పటికింకా నాటకం శ్రీరామ పెట్టలేదు జనం మాత్రం హడావిడిగా తిరుగుతున్నారు

దర్జాగా సోఫాల్లో కూర్చుని టీ తాగుతూ మాసిపోయిన తమ ఆశలు శుభ్రపరుచుకుంటూ కళ్ళతో ప్రేమించుకుంటున్నారు చిరంజీవి సౌభాగ్యవతి.

వాళ్ళకి అతి చేరువలో కూర్చున్న యిద్దరమ్మలక్కలు మాటలతో పేరంటం చేసుకుంటున్నారు

'నిన్న సాయంకాలమే ఫోన్ వచ్చింది వదినా నా పలుకుబడి ఉపయోగిస్తానంటే ససేమిరా వద్దన్నది శ్రీమతి సాధ్వి మనం బాగు చేయలేనంతగా చెడిపోయింది" అంది ఎర్ర పట్టు చీర

'చెడిపోక ఏం చేస్తుంది వదినా భర్త జైలుకెళ్ళాడు ఎడ్రెస్ లేని అమ్మాయి కొడుకుని లేవదీసుకుపోయింది. అయినా కష్టాలనేవి అందరికీ వస్తూనే వుంటాయి అంతదాకా ఎందుకు నా సంగతే తీసికో వదినా అవినీతి ఆరోపణలతో మా వారి ఉద్యోగం వూడింది మిన్ను విరిగి మీద పడిందని నేనేమైనా కృంగిపోయానా? ఉద్యోగం పోతే పోయింది వ్యాపారం చేయడానికి సరిపోయే బ్లాక్ మనీ సంపాదించారని మా వారిని పొగిడాను. ప్రేమలో పడి నెల తప్పిన మా ఆఖరు అమ్మాయి గొంతు పిసగలేదు. ఆ దౌర్భాగ్యుడి వత్తాసు చెప్పమని వత్తిడి చెయలేదు డాక్టరుగారి రెండు కళ్ళకి మాత్రమే తెలిసేటట్లుగా మా అమ్మాయి కడుపు తీయించాను నిక్షేపంగా మన కులపువాడికే యిచ్చి పెళ్ళి చేయించాను." అంది ఆకు పచ్చ చీర

'నీకుండే గుండె ధైర్యం నిబ్బరం అందరికీ వుండటం అరుదు వదినా'

"కష్టాలనేవి వచ్చినప్పుడు కాళ్ళూ చేతులు కూడదీసుకుని తక్షణ కర్తవ్యం ఆలోచించాలి గాని బెంబేలు పడకూడదు మంచో చెడో అలవాటుపడిన పాత బాటనే సాగాలి. రూట్ మార్చకూడదు. మనందరం అవలంభిస్తున్న మార్గానికి వ్యతిరేకంగా వెళ్ళింది సాధ్వి. నిజాయితీగా నిక్కచ్చిగా స్త్రీ సేవ ప్రారంభించి నిందలపాలైంది "

"పాతికమంది అనాథలని ఆదుకోబోయి తానే పెద్ద అనాథగా మారింది.

ఎరుపూ, ఆకుపచ్చ చీరల సంభాషణ ఆసక్తిగా వింటున్న సౌభాగ్యం కుదురుగా కూర్చోలేకపోయింది అసలు విషయం తెలుసుకోవాలనే ఆరాటంతో వాళ్ళిద్దరి మధ్యా తలని యిరికించి అంది

'ఆంటీ ఈ శారీ ఎక్కడ కొన్నారు. అబ్బా, కళ్ళు మండేంత మంటలాంటి ఎరుపు మూరెడు పొడుగున బూడిద కలర్ పట్టు అంచు. బుజ్జి బుజ్జి గజ్జి కుక్క పిల్లలా అక్కడక్కడ చెమ్కి పూలు. సినిమాలో కాంచనమాల యిటువంటి చీరె కట్టగా నా బారసాలనాడు చూశాను అప్పటినుంచి యిటువంటి చీరెని

కట్టుకోవాలని తెగ యిదైపోతున్నాను. అంకుల్ ఏ మ్యూజియంలో కొన్నారీ చీరెని"

ఆమె మాటలకి ఉబ్బిపోయిన రెడ్ శారీ ఛాతి పెరిగింది. జాకెట్ పిగలకుండా పమిట చాటున హుక్స్ వూడదీసి డాంబికంగా అంది ఎఱ్ర చీరె.

"నేను ముచ్చటపడితే మీ అంకుల్ మూడు వేలు తగలేసి కాశీలో ఈ శారిని కొన్నారు. తిరుగు ప్రయాణానికి పైకం చాలక నన్ను కాశీలో వదిలేసి వచ్చేశారు మీ అంకుల్. నన్ని అందమైన శారీలో చూడడానికి జనం విరగబడి డబ్బులిచ్చి మరీ మరీ చూశారు. ఈ చీర పుణ్యమాని అలా డబ్బు పోగు చేసి యిలా హైదరాబాద్ వచ్చేశాను"

"అందమనేది బట్టల్లో వుండదు వదినా. నేను పుట్టినప్పుడు ఎంతో అందంగా వుండేదాన్నని యిప్పటికీ మా ఫామిలీ డాక్టర్ అంటూ వుంటాడు. మనిషి అందాన్ని మరుగుపరిచేవి బట్టలని వేమన పద్యం చదువుతాడు మా డాక్టర్"

ఆకుపచ్చ చీరె ధోరణికి అడ్డు వస్తూ అంది సౌభాగ్యవతి.

"శ్రీమతి సాధ్విగారు అనాధ శరణాలయాన్ని మూసేసారా"

"అనాధ శరణాలయమే కాదు. ఆవిడని కూడా మూసేసారు పోలీసులు. ఇన్‌కంటాక్స్ అధికారులు సాధ్వి యింటిపై దాడి చేశారు. బ్లాక్ మనీ వెలుగు చూసింది" చేతులు త్రిప్పుతూ చెప్పసాగింది రెడ్ శారీ.

"ఆవిడకు పలుకుబడీ గట్రా పుష్కలంగా వున్నాయి గదా. యింత అర్ధాంతరంగా రైడింగ్ ఎలా జరిగింది? పోలీసులెందుకు అరెస్టు చేశారు" సౌభాగ్యం సందేహం.

"ఈ మధ్య పతివ్రత ఫోజు పెట్టి స్త్రీ సేవ చేస్తున్నది. పాతికమంది అనాధల మంచీ చెడ్డా చూస్తున్నది. మొన్న గెస్ట్‌హౌస్‌లో బస చేసిన వి. ఐ. పీలు శ్రీమతి సాధ్వికి ఫోన్ చేసి, తమ కాలక్షేపం కోసం అయిదారుగురు అనాధలని పంపమన్నారు. వాళ్ళు అడగడం, ఆమె పంపించడం అనాదిగా వస్తున్న ఆచారం. ఈసారి సాధ్వి వారికి ఎదురు తిరిగింది. అనాధలని గెస్ట్‌హౌస్‌కి తోలడానికి అంగీకరించలేదు. వాళ్ళు రెచ్చిపోయి తూలుతూ అనాధ శరణాలయానికే వచ్చారు. సాధ్వి పోలీసులకి ఫోన్ చేసింది"

"అపరాధులని వదిలేసి సాధ్వి నెందుకు అరెస్ట్ చేశారు"

"ఏటికి ఎదురీదింది సాధ్వి. అందుకే అధికార దర్పానికి బలైంది. యింతకీ మీరెవరు?" కళ్ళు చికిలించింది ఎఱ్ర చీర.

ఆవిడ మాటలు పట్టించుకోకుండా "సారి ... యిలా జరుగుతుందని మనం సరదాక్కూడా అనుకోలేదు" అంటూ చిరంజీవి చేతిని సానుభూతిగా నొక్కింది సౌభాగ్యం

"అంతా నా చేత వాగించారు. యింతకీ మీరెవరో చెప్పారు కాదు" మరొక్కసారి సైరన్‌లా కూసింది రెడ్ శారీ.

"ప్రేక్షకులం. నాటకం ప్రారంభించినట్టున్నారు. యిక వెళ్తాం" అంటూ లేచాడు చిరంజీవి.

"మేం ఇక్కడ వుంటే అక్కడ స్టేజీ ఎక్కేది ఎవరు?" ఎబ్బెట్టుగా నవ్వింది గ్రీన్ శారీ.

"మీరు యాక్టర్లా ... నటులా" వాంతి చేసుకున్నంత పని చేసింది సౌభాగ్యం.

"అవును. అనుమానంగా వుందా? అయితే వినండి. నాటకం అతి చేరువలో వుండాలని మా డైరెక్టరు గారు నూతన పంథాలో నాటకం వేయిస్తున్నాడు. ఈ నాటకంలో యాక్టర్లు వుండరు. నిజ జీవితంలోని వ్యక్తులే యాక్టర్లు. లెక్చరర్ పోర్షన్ లెక్చరర్‌కే యిచ్చాడు. డాక్టర్ పోర్షన్ డాక్టర్‌కే. దొంగ వేషం దొంగే వేస్తున్నాడు. యిక పోలీసు పోలీసే. నేను నారీ మండలి వైస్ ప్రసిడెంట్‌ని. నాటకంలో అదే వేషం వేస్తున్నాను. యిక మా వదిన కోమలులు క్లబ్‌కి పార్ట్ టైం శెకరెట్రీ. ఆ వేషమే వేస్తున్నది –" అంది గడగడా గబగబా ఎఱ్ర చీర.

"యిలా ... యిలా ... అందరికీ వేషాలిచ్చి నాటకం టికెట్టు అమ్మడానికి బస్ కండక్టర్‌ని నియమించాడు మా డైరెక్టర్. కండక్టర్ తన మామూలు ధోరణిలో చిల్లర బాకీ వున్న వారికి, చిల్లర ఇవ్వకుండా టికెట్ వెనకాల రాసి సంతకం చేసి యిచ్చాడు. చిల్లర నోట్లకై ప్రేక్షకులు గోల చేస్తూంటే కనుమరుగైనాడు









యమ్. యమ్. ఏ.– ఏలూరు

నాకు ముక్కు పెద్దగా వుంటుంది. దీనివలన నేను సరిగా తిరగలేక పోతున్నాను దీనికి ట్రీట్‌మెంట్ ఎక్కడ యిస్తారు?

- ప్లాస్టిక్ సర్జరీవల్ల ఈ వికారాన్ని వైద్యులు తొలగించ గలరు. అమెరికా వంటి అభివృద్ధి చెందిన దేశాలలో ఈ చికిత్స విరివిగా చెయ్యబడు తున్నది. దీనిని కాస్మెటిక్ సర్జరీ అని అంటారు మన దేశంలో పెద్ద పెద్ద పట్టణాలలో ఉన్న ప్లాస్టిక్ సర్జన్లను సంప్రతించి చూడండి.

పి. కె.– విజయవాడ

హృద్రోగ నిపుణులు నాకు పరీక్ష చేసి కొరోనరి హార్ట్ డిసీజ్ వున్నదని చెప్పినారు అంటే ఏమిటి? మందులతో తగ్గుతుందా?

- హృదయం అన్ని వేళలా రక్తంతో సంబంధ పడి ఉన్నా, దాని కండరాలకి వేరే రక్త సరఫరా అవసరం ఇలా హృదయ కండరాలకి రక్తాన్ని తీసుకు వెళ్ళే రక్త నాళాలను కొరోనరి ఆర్టరిలని అంటారు. వీటిలో అవరోధం ఏర్పడినప్పుడు హార్ట్ అటాక్ వస్తుంది ఇలా అవరోధం ఏర్పడటానికి, శరీరంలో అధికంగా కొలెస్టరాల్ ఉండటం దోహదం చేస్తుంది. అధిక రక్తపు పోటు, మధుమేహం, పొగపీల్చటం, మధుపానం మొదలయినవన్నీ ఈ రోగానికి దోహదకారులే!

హార్ట్ అటాక్ వచ్చినవారు వైద్యుల పర్యవేక్షణలో చికిత్స పొందాలి ఈ రోగం రాగల అవకాశాలు ఉన్నవారు అప్పుడప్పుడూ వైద్య పరీక్ష చేయించుకోవాలి అహార నియమాలు పాటించటం, శరీర వ్యాయామం చాలా అవసరం.

ఎన్. ఎస్.– విజయనగరం

నా తలలో విపరీతంగా పేలు, ఈపుళ్ళు వున్నాయి వాటివలన తలంతా భరించలేనంత దురదగా వుంది. అక్కడక్కడ తలలో పేను కొరుకుడు పుళ్ళు వున్నాయి. పేలు, ఈపుళ్ళు పోవాలంటే ఏ మందులు వాడాలి?

- బెంజైల్ బెంజొయేట్ 20 శాతం మందుగాని, గామా బెంజీన్ హెక్సాక్లోరైడ్ గాని పై పూతగా వాడవలసి ఉంటుంది. అయితే దీనిని క్రమబద్ధంగా పూయవలసి ఉంటుంది.

తలకి బాగా స్నానం చేసి, తడి ఆరిన తర్వాత అన్ని వెంట్రుకలకీ కుదుళ్ళ నుంచి చివరదాకా అంటేటట్లుగా పై మందులను పూసి 12 గం.లు నాన నివ్వాలి. తర్వాత మళ్ళీ తలారా స్నానం చెయ్యాలి అలా వరుసగా మూడు రోజులు చెయ్యటం అవసరం. ఇంట్లోని ప్రతివారూ ఒకేసారిగా ఈ మందు వాడాలి.దువ్వెనలు వేరుగా ఉంచాలి తలగడ గలీబులు, దుప్పట్లు మొదలయిన వాటిని నీళ్ళలో ఉడికించి వాడితే తిరిగి పేలు వచ్చే అవకాశం ఉండదు. □

# జిగిబిగి

కండక్టర్. తమ బాకీలు తీర్చకుండా నాటకం వేయడానికి వీలుపడదని పట్టుబట్టారు ప్రేక్షకులు చేబదులు కోసం సిటీలోకి వెళ్ళాడు మా డైరెక్టర్. యదార్థ జీవితాలు... నాటకం చూపించబోయి .." అంటూ ఆకుపచ్చ చీర యింకా వాగుతూనే వుంది.

26

ఆ నాటక ఘోష వినలేక అసౌకర్యంగా అక్కడ నుంచి కదిలాడు చిరంజీవి. అతన్ని అనుసరించింది సౌభాగ్యవతి. యిద్దరూ రోడ్డు మీదికి వచ్చారు. నెమ్మదిగా నడుస్తున్నారు.

"సారీ ... చిరంజీవీ .. మీ మమ్మీ మన మాట మన్నించి మంచిగా బ్రతకాలనుకుంది. అనాథలని నిజాయితీగా ఆదరించింది. ఫలితం – "ప్చ్ . " అంటూ గాఢంగా నిట్టూర్చింది సౌభాగ్యవతి.

"భాగ్యం . . ఈ లోకం పోకడే కడు విచిత్రం. ఈ ప్రపంచంలో నీతిగా బ్రతకడం చాలా కష్టం. మా మమ్మీ పాపం పండింది. అందుకే అరెస్టు అలా తోసుకు వచ్చింది. ఈ మాత్రం ప్రాయశ్చిత్తం జరిగితేగాని మా అమ్మ మనస్ఫూర్తిగా పశ్చాత్తాప పడడానికి వీలు కుదరదు" అన్నాడు నిర్లిప్తంగా చిరంజీవి

అతను ఎంత నిగ్రహించినా తల్లి జ్ఞాపకాల రాకపోకల అలజడితో అతని ముఖంపై రంగులు మారుతున్నాయి ఆ మార్పుని అరికట్టాలని స్వల్పకాలిక మందహాసంతో అంది సౌభాగ్యవతి.

"నేనీ రోజు వెళ్ళిన ఆఫీసులో చిన్న తమాషా జరిగింది. టైపిస్ట్ పోస్టు ఖాళీగా వున్న ఆఫీసులో టైపుమిషన్ లేదు. టైప్‌రైటర్ తెచ్చుకొంటే జాబ్ యిస్తానన్నాడు ఆఫీసర్. అదే వుంటే మిమ్మల్ని యిలా దేవురించే ఖర్మ నాకేం పట్టింది? మిషన్ వుంటే ఏ చెట్టు క్రిందో కూర్చుని జాబ్ వర్క్ చేసేదాన్నని ఆఫీసర్‌ని దబాయించాను. అందుకాయన ఏమన్నాడో తెలుసా? మిషనే వుంటే బొట్టిట్టి నీకీ వుద్యోగమెందుకిస్తాను? మా బావమరిదికిచ్చే వాడినంటూ విరుచుకుపడ్డాడు. ఆ తరువాత ఏమయిందో తెలుసా?"

"తెలుసు. మీ రిద్దరూ వాగ్వివాదం పడుతూంటే టైపిస్టు పోస్టు శాంక్షన్ అయిపోయిందనే దుర్వార్తని మోసుకు వచ్చాడు మేనేజర్. రెండు సంవత్సరాల క్రితం ఆర్డర్ చేసిన టైప్ మిషన్ నేడు వచ్చిందనే సంతోష వార్తని తెచ్చాడు గుమాస్తా. యిప్పుడు మిషన్ వుంది పోస్టు లేదని తన రెండు చేతులు తన తలపైనే పెట్టుకున్నాడు ఆఫీసర్. అప్పుడు నువ్వేమో భళ్ళు భళ్ళున నవ్వేసి యించక్కా ఆఫీసు నుంచి బయటపడ్డావ్" అంటూ ఎటువంటి బకాయిలు లేకుండా తన బాధ నుంచి విముక్తి పొందిన చిరంజీవి చివాల్న నవ్వేశాడు.

"వెరీ గుడ్ .. జరిగింది జరిగినట్లు చెప్పావు. యింతకీ నువ్వెళ్ళిన పనేమయింది" ఆమె సంభాషణ పొడిగించింది.

"యనభై వేల అప్పుతో పాత బిల్డింగ్ కొంది కాలేజీ మేనేజ్‌మెంట్. బిల్డింగ్ ఫండ్ క్రింద, పాత భవనం ఖరీదులో పది పర్సెంట్, పది నెలల్లో సర్దితే తాత్కాలిక తెలుగు లెక్చరర్‌గా అపాయింట్ చేస్తానన్నాడు కరస్పాండెంట్. పది నెలలు నిండిన తరువాత పర్మినెంట్ చేస్తానన్నాడు"

"జీతం ఎంతిస్తాడుట"

"నువ్వు చెప్పు చూద్దాం"

"మొదటి పది నెలలు ఇరవైపైసలు తక్కువ ఎనిమిది వందలు."

"వెరీ గుడ్ ... ఆ తరువాత"

"పాత బిల్డింగ్ రిపేరు ఖర్చులు పోను ప్రతీ నెల నాలుగు వందలిస్తాడు"

"కరక్టుగా చెప్పావు. అందుకే నాలుగూ దులిపి యిలా చక్కా వచ్చేశాను"

నిరుద్యోగ శాపగ్రస్తులైన వాళ్ళిద్దరూ నిజంగానే నవ్వుకుంటూ, కబుర్లు చెప్పుకుంటూ ఇంటికి చేరారు.

(ఇంకా ఉంది)


ధరలు
ధరలు ఎండలు మండిపోతున్నాయి బాబోయ్....
మధుర రాజా


ధరలు పెరిగిపోయాయని నామీద ఎగురుతావెందుకూ? ఓటు వేసింది.. నువ్వేగా.....


రైలు ఛార్జీలు పెరిగాయి... బస్సు ఛార్జీలు పెరిగాయి పాలధర పెరిగింది... గ్యాస్ పెరిగింది... కూరగాయల ధర....
నే వెళ్తున్నా! పిల్లలు జాగర్త! వచ్చే జన్మలో కలుద్దాం!


ధరలు పెరిగాయని.. రిక్షావాడు ఎక్కువ అడుగుతున్నాడు.. ఇంటివాడు అద్దె పెంచాడు – జీతం పెంచమని అడిగితే... ఉద్యోగం మానేయమన్నాడు.. మా బాస్...
పట్టభద్రులకు ఉద్యోగాలు కావాలి!


ఓ పది పైసలు ధర్మం చెయ్యి తల్లీ....
ఇవ్వాలేనయ్యా! బస్సుకి.. చిల్లర కావాలి
MADHU-RAJA

## శేఖరం చెప్పిన కథ :—

గవర్నమెంటు ఆసుపత్రి గేటులో నుంచి... చేతులకు బేడీలు వేసి నన్ను తీసుకు వస్తున్నారు... పోలీసులు!

జనం వెనుక పరిగెత్తుకుంటూ వస్తూ...వింతగా చూస్తున్నారు నన్ను....

ఏం చేశాడుట?...

భార్యకి విషం యిచ్చాడుట....

చూట్టానికి...బుద్ధిమంతుడిలా కనిపిస్తున్నాడు...

నా బొంద...లోపలికి వెళ్ళి ఆ పెళ్ళాన్ని చూడు... బంగారు బొమ్మలా వుంది! అలాంటి దాన్ని విషం యిచ్చి చంపబోయాడట...

చచ్చిపోయిందా?

లేదు! ఇంకా తెలివి రాలేదు! డాక్టర్లు నమ్మకం లేదంటున్నారుట....

దొంగ సచ్చినోడు! వీడి చేతులు పడిపోనూ....

ఓ ముసలమ్మ తోసుకుంటూ ముందుకు వచ్చి... నన్ను తిట్టింది!

ఇలా రోడ్డు మీద ఎంతసేపు నిలబెడతారు?.. నన్ను త్వరగా తీసుకు పొండి... అన్నాను.

వ్యాన్ రావాలి!...యేం.. దొరగారు ఎండకి కందిపోతారా?...

పోలీసువాడు...చాలా అమర్యాదగా... ఎంతో వెటకారంగా అన్నాడు....

ఇదేం పోయే కాలవమ్మా...ఈ మధ్య అన్నీ యిలాంటి కేసులే!

కట్నం సగమే యిచ్చారట! మిగతా సగం... ఇవ్వలేదని... విషం పెట్టి...గదిలో పెట్టి పారిపోయాడంట....

ఛీ...ఎదవబతుకు...

తీక్షణంగా కాస్తున్న ఎండ కంటే....కంపరంగా వుంది...నాకు! వాళ్ళ మాటలు... గునపాల్లాగా... గుండెల్లో గుచ్చుకుంటున్నాయి....

కోరికోరి పెళ్ళి చేసుకొన్న భార్యని... నేను చంపుకుంటానా?

నా రాధ...బతుకుతుందో...లేదో అని...నేను బాధపడతూ వుంటే... వీళ్ళు యీ-మాటలతో నన్ను నిలువునా.... దహనం చేస్తున్నారు.....

సార్...కానిస్టేబుల్‌గారూ...నా జేబులో పర్సు వుంది... అందులో క్యాష్ వుంది... ఏదయినా టాక్సీలో తీసుకు పొండి నన్ను! నేను ఇక్కడ నిలబడలేక పోతున్నాను! మీ వ్యాన్ వచ్చే లోపల... నేను చచ్చిపోయేలా వున్నాను...అన్నాను—

పర్సు...క్యాష్ అనగానే...పోలీసు ముఖం వికసించింది...

ఏయ్...పోండి...దూరంగా పోండి! ఏం చూస్తారిక్కడ? వెళ్ళండి.....

అని జనాన్ని అదిలించాడు.

ఆటో...ఆగు! ఇలారా...అని ఓ ఆటోని పిలిచి... నన్ను ఆటో ఎక్కించాడు! అటూ...యిటూ యిద్దరు పోలీసులు కూర్చున్నారు...తిన్నగా స్టేషన్‌కు తీసుకు వచ్చారు— దారిలోనే...నా పర్సు తీసుకున్నారు.

పర్సు మా దగ్గరే వుంచుతాం! హెడ్ చూశాడంటే...మొత్తం దొబ్బుతాడు! మీరేం కంగారు పడకండి!.....అన్నారు.

పోలీసు స్టేషన్‌లోకి వెళ్ళాకా.... గురూగారూ! రూల్స్ ప్రకారం మిమ్మల్ని లాకప్‌లో వుంచాలి! లేకపోతే.... మా ఉద్యోగాలు పోతాయి....

అని— నన్ను లాకప్‌కి తోశారు.

కాఫీ...టీ...ఏవయినా తాగుతారా? అని అడిగారు.

వద్దు...అన్నాను.

లాకప్‌లో...కటకటాల వెనుక నిలబడిన నాకు... ఆగకుండా ఏడుపు వచ్చేసింది!

భగవంతుడా! నేను ఏం పాపం చేశాను? ఎందుకు వేశావీ శిక్ష? ఈ జైల్లో...ఈ మురికి కంపులో నిలవలేక పోతున్నాను!...ఇలాంటి...దుస్థితి వస్తుందని....ఏ రోజూ అనుకోలేదు!.... నేను ఏమైపోయినా ఫర్వాలేదు...నా రాధని కాపాడు స్వామి!.... నా రాధ ఎందుకిలా చేసిందో... కనుక్కోవాలి!....

అని...మనసారా ఆ దేవుణ్ని ప్రార్థించాను.....

ఏడుకొండలవాడా!... నువ్వు నా రాధని కాపాడితే... నేను కాలి నడకన నీ కొండ యెక్కి... నా బోనసు డబ్బులు మొత్తం నీ హుండీలో వేస్తాను!!....అని మొక్కుకున్నాను—

అయ్యా! కానిస్టేబుల్‌గారూ!...మళ్ళీ ఒక్కసారి ..ఆసుపత్రికి ఫోన్ చేసి.. నా రాధకి తెలివి వచ్చిందేమో కనుక్కోండి...అని బ్రతిమాలేను.

ఇప్పుడే కదండీ... కనుక్కున్నాం!...అని కాస్త చిరాకు పడ్డాడు... నా నెల జీతంతో సహా నా పర్సు జేబులో పెట్టుకున్న కానిస్టేబులు....

నేనొక్కసారి ఆసుపత్రికి వెళ్ళి ...నా రాధని చూసి రమ్మంటారా.....

అరిబాబోయ్!...మా ఉద్యోగాలు పోతాయి!... మీ కేసు... చిన్న కేసు కాదు! .. ఖూనీ కేసు! మర్డర్ కేసులో ముద్దాయిని.... విడిచి పెట్టడమా?...

అంటూ కంగారు పడిపోయాడు కానిస్టేబులు—

నేను నిలబడలేక ...అలాగే ... ఆ ..కటకటాలను అంటిపెట్టుకొని కూలబడ్డాను....

రాధని చంపానని... మీరు కూడా నన్ను అనుమానిస్తున్నారా? .. నెలకి పన్నెండు వందలు జీతం తెచ్చుకుంటూ.... అందాల రాశిని ...కోరి కోరి పెళ్ళి చేసుకున్నాన్నేను!... చిలకా గోరింకల్లాగా కాపురం చేస్తున్నాం మేము!

నా రాధని నే నెందుకు చంపాలి? నా రాధని నేను చంపితే ...నాకు వచ్చే లాభం ఏమిటి?....

కట్నం అంటే.. ఆశ లేదనను! కానీ...రాధని చూశాకా ...నేను మొట్టమొదటి సారిగా చెప్పిన మాట....

కట్నం అక్కర్లేదు! .. ఆ అమ్మాయిని తప్ప మరెవరినీ పెళ్ళి చేసుకోను ...అన్నాను.

రాధని పెళ్ళి చేసుకున్న కొద్ది రోజుల్లోనే నాకు ప్రమోషన్ వచ్చింది!....

రాధని విడిచి వుండలేక ... క్యాంపులో వుండి ... స్వంత డబ్బులతో వచ్చి ... తిరిగి వెళ్ళేవాణ్ని ...

అలాంటి నా రాధని నేను ఎందుకు చంపుకుంటాను?....

నేను వూరునుంచి రాగానే ... ఆసుపత్రిలో రాధ ... ప్రాణాపాయస్థితిలో వుందని విని ... కంగారుగా ఆసుపత్రికి వచ్చాను!

ఆసుపత్రిలో ... నన్ను పోలీసులు అరెస్టు చేశారు ...

భార్యని హత్య చెయ్యడానికి ప్రయత్నించానని నా మీద కేసు బనాయిస్తున్నారు!

నిజం! నాకేం తెలియదు!!

నిన్న రాత్రి ... రాధ డల్లుగా వుంది! ...

ఏం ... డల్లుగా వున్నావ్? ఒంట్లో బాగో లేదా అని అడిగాను! తల నెప్పిగా వుంది అని చెప్పింది. తను వద్దు అంటున్నా ... అమృతాంజనం తెచ్చి నుదుటికి రాశాను ...

— రాధ కళ్ళలో నీళ్ళు చూసి ... ఏమిటి ... ఏడుస్తున్నావా? అని అడిగాను ...

— లేదు! అమృతాంజనం రాశారు కదా ... అంది.

రెండు చేతులూ వీపు మీద వేసి ... గాఢంగా హృదయానికి హత్తుకుంది నన్ను ...

— ఏమిటి ... తలనొప్పికే కంగారుపడుతున్నావ్? ... పోనీ ... డాక్టర్‌ని పిలవనా అని అడిగాను.

వద్దు — కాస్సేపు ... నా దగ్గరే వుండండి ... అంది!

ఉదయం నేను లేచేసరికి రాధ కనిపించలేదు! కాస్సేపు ... కంగారుపడ్డాను ...

రాధా ... రాధా ... అని పిలిచాను!

కాఫీ కప్పుతో ... వంటింట్లోంచి వచ్చింది రాధ ...

వంట్లో ఎలా వుంది? ... అని అడిగాను! ...

బాగుంది! ... అంది —

మరింకా డల్లుగానే ఉన్నావ్? కాస్త ... నవ్వకూడదా?.... అన్నాను.

కాఫీ కప్పు పక్కన పెట్టి ... రాధ చెయ్యి పుచ్చుకొని దగ్గరగా లాక్కున్నాను ... కితకితలు పెట్టాను! ... రాధకి ముట్టుకుంటే చాలు ... కితకితలు ఎక్కువ! పగలబడి నవ్వింది! ...

—ఇవాళ క్యాంపుకు వెళ్ళాలన్నారు!...మానేశారా? ... అని గుర్తు చేసింది—

— బాబోయ్! చాలా ముఖ్యమయిన పని! ... కాకపోతే ... పక్క వూరికే! అరగంట ప్రయాణం! సాయంత్రం నాలుగు గంటలకే తిరిగి వచ్చేస్తాను! ... సరదాగా ఏదయినా సినిమాకి వెళ్దాం ... అన్నాను.

సినిమాకు వద్దు ... అంది.

– అదేమిటీ చాలా సంచలనాత్మకమయిన మాట! .. నువ్వు సినిమాకి వద్దు . అంటే . ఇంకేమయినా వుందా? .. దేశంలో మహిళా చిత్రాలన్నీ ఏం కావాలి? అని జోక్ చేశాను!

తర్వాత – స్నానం చేసి టిఫిన్ తిని వెళ్ళిపోయాను'.

వూళ్ళో పని అయిపోగానే . నా ఫ్రెండు కారు కనిపిస్తే . మధ్యాహ్నం రెండు గంటలకే ఇంటికి వచ్చేశాను .

రాగానే . ఇదీ కబురు! కంగారుగా ఆసుపత్రికి వెళ్ళాను . ఆసుపత్రిలో నా రాధని సరిగా చూడకుండానే . నన్ను అరెస్టు చేసి తీసుకువచ్చి ఈ నరకంలో పడేశారు!!

రాత్రి ఎనిమిది గంటల వరకూ ఆ నరకంలోనే వుంచారు

దోమలు . కంపు ఇవేవీ సరిపోనట్టుగా . ఇద్దరు తాగుబోతుల్ని కూడా లోపలికి తోశారు!

రాత్రి ఎనిమిది గంటలకు ఫోన్ వచ్చింది ఆసుపత్రి నుంచి!

నన్ను వెంటనే వదిలిపెట్టమని!

నాకు ఆశ్చర్యం వేసింది!

– మీ భార్యకి తెలివి వచ్చింది మా పోలీసువాళ్ళు వాంగ్మూలం తీసుకున్నారు! మీరు నిర్దోషి అని తెలిసింది .. వెళ్ళిరండి అన్నాడు హెడ్ కానిస్టేబులు

'ఇదిగో మీ పర్సు అని నా పర్సు నాకు తిరిగి యిచ్చారు! అందులో అయిదు రూపాయల కాగితం మాత్రం వుంది .

పోతే పోయింది డబ్బు నా రాధ బతికింది! అదే పదివేలు . అనుకొని ఆసుపత్రికి పరిగెత్తాను

ఆసుపత్రిలో రాధని చూశాకా ఆమె కళ్ళలో ఆవేదన చూశాకా

– ఎందుకు చేశావ్ రాధా ఇంత పని? అని నేను అడగలేకపోయాను ..

– మీ ఆవిడ పొరపాటున ఎలుకల విషం తిన్నది! ఇంకేం ఫర్వాలేదు! రేపు ఉదయం ఇంటికి తీసుకువెళ్ళి రెండు రోజులు రెస్టు ఇవ్వండి! సరిపోతుంది!!

అన్నాడు డాక్టరు –

రాధ ఎలుకల విషం పొరపాటున తినడమా?

ఎలుకలకి విషం పెడతానంటేనే అయ్యో పాపం ... వద్దు అండీ అవే పోతాయి అనేది! . అలాంటి రాధకి . ఎలకల విషం ఎలా దొరికింది? ఎందుకు తినేసింది? నాకే అర్థం కాలేదు

ఇలాంటి పని మరెప్పుడూ చెయ్యను! నన్ను ఇంకేమీ అడగవద్దు!! అని ఏడిచింది!

– నాకు ప్రాణభిక్ష పెట్టి .. నాకు పునర్జన్మ యిచ్చింది .. నువ్వు రాధా! నిన్ను ఏమీ అడగను అనను!! .. అన్నాను.

వారం రోజులు వుద్యోగానికి సెలవు పెట్టేశాను!

రాధని మంచం దిగవద్దని .. గట్టిగా వార్నింగ్

# ఆడవాళ్లూ! జాగర్త!

గీతా సుబ్బారావ్



యిచ్చాను వినదని చెప్ప ఒట్టు వేశాను!

– మీరు అలా కష్టపడుతూ వుంటే ఇలా మంచం మీద పడుకొని నేను మీ చేత సేవలు చేయించుకోడానికి సిగ్గుగా వుంది! నాకు బోర్ కొడుతోంది అన్నది రాధ

నీకు బోర్ కొట్టకుండా ఈ పుస్తకాలు చదువుకో అని నాలుగు నవలలు తెచ్చి యిచ్చాను! అవి చదువుతూ అలాగే నిద్రపోయింది రాధ

నిద్రపోతున్న రాధని చూస్తూ ఎన్నో విధాల ఆలోచించాను రాధ ఎలుకల విషం ఎందుకు తిన్నదో అర్థం కాలేదు

–(★)–

## రాధ చెప్పిన కథ:–

నేనెందుకు ఎలుకల విషం తినవలసి వచ్చిందో మీకు చెప్తాను! కాని మా వారికి చెప్పవద్దు!!

నిజానికి నా అంత అదృష్టవంతురాలు మరొకరు వుండరని నేను అనుకొంటాను!

నేను చిన్నప్పట్నుంచీ మా అమ్మగారింట్లో కష్టపడుతూనే పెరిగాను! ఎందుకంటే మాది మధ్యతరగతి కుటుంబం! అదిగాక మేము నలుగురం అక్కా చెల్లెళ్ళం! మా ఇంట్లో మగవాడు ఆర్జించేవాడు. మా నాన్న ఒక్కడే!

మా అక్క ఇంట్లోనే ఆడవాళ్ళ బట్టలు కుట్టేది! ఆ కుట్టిన జాకెట్లకు గుండీలు కాజాలు కుట్టి అక్కని చిల్లర అడిగి సినిమాకి వెళ్ళిపోయేదాన్ని!

ఏమిటో ఏదయినా సినిమా విడుదలయిందంటే

## ఆడవాళ్ళు జాగర్త!

మొదటి రోజే చూడాలి! అంత పిచ్చి నాకు!!

మా చుట్టుపక్కల నా ఈడు ఆడపిల్లలు నలుగురు వుండేవాళ్ళు వాళ్ళతో కలిసి విడుదలయిన ప్రతి సినిమా చూసేదాన్ని!!

పెళ్ళి అయ్యాకా అసలు డబ్బులు వెతుక్కునే బాధ టిక్కెట్లు దొరకవేమో అనే బెంగ పోయాయి!

మా వారు మొదటి రోజు రెండో ఆటకి అడ్వాన్స్ బుకింగ్‌లో రెండు టిక్కెట్లు తెచ్చేవారు! ఇద్దరం హాయిగా సినిమా చూసి వచ్చే వాళ్ళం హోటల్లో భోజనం చేసేవాళ్ళం

మా వారికి సినిమాలంటే నచ్చవు! తెలుగు సినిమాలంటే బొత్తిగా నచ్చవు! పాపం నాకోసం ఆయన తెలుగు సినిమాలు చూసేవారు! ఆయన కోసం నేను ఇంగ్లీషు సినిమాలు చూసేదాన్ని!! అలాంటిది ఈ మధ్య మా వారికి ప్రమోషన్ వచ్చాకా సినిమాకి వెళ్ళడమే కుదరడంలేదు!!

నా కోసం నువ్వు సినిమాలు మానడం దేనికి? మన పక్క వాళ్ళతోనో ఇంటివాళ్ళతోనో కలిసి చూడవచ్చు కదా అని పదే పదే అన్నారు!

అప్పట్నుంచి అప్పుడప్పుడు మా పక్క వాళ్ళతో సినిమాకి వెళ్ళేదాన్ని! కాకపోతే వాళ్ళు మా అమ్మావాళ్ళ లాగా మధ్య తరగతి కుటుంబీకులు – అందుకని బెంచి క్లాసుకు వెళ్ళేవారు! వాళ్ళతో పాటు నేను కూడా బెంచి క్లాసుకే వెళ్తూ వుండేదాన్ని –

అది తెలిసి మా వారు ఓనాడు నన్ను




పిచ్చాట్లు పెట్టేరు! కావాలంటే వాళ్ళని నువ్వే తీసుకువెళ్ళు? మరో పది రూపాయలు ఎక్కువ అవుతాయి! అంతే కదా! అనేవారు!

నీకో అమ్మాయో అబ్బాయో పుడితే అప్పుడు మొదలెడుదువుగాని పొదుపు! అంతవరకూ హాయిగా ఖర్చు చేసుకో! అనేవారు–

• ఆ రోజు ఆ సినిమా వెళ్ళిపోతోంది అందుకని మా పక్క వాళ్ళతో కలసి మొదటి ఆటకి వెళ్ళాను!

టిక్కెట్లు దొరుకుతున్నాయి కదా బెంచికి వెళ్దాం అన్నారు మా పక్కింటి వాళ్ళు

– వద్దు మా ఆయన తిడతారు అని ఫైక్లాసు టిక్కెట్లు తీసుకున్నాను

ఆ రోజు నుంచి టిక్కెట్లు రేట్లు పెరిగాయట!

రూపాయి తగ్గింది– మా దగ్గర లేదు ఏం చెయ్యాలా అని ఆలోచిస్తూ వుండగా

థియేటర్ మేనేజర్ ఎవరో వచ్చి – పర్వాలేదమ్మా! మీరు వెళ్ళండి! సినిమా మొదలుపెడుతున్నారు!– అన్నారు

రూపాయి తగ్గింది , అన్నాను నేను సిగ్గు పడుతూ

– ఏం ఫర్వాలేదమ్మా! మీ వారు మాకు బాగా తెలుసు! అంటూ –

గేటు అబ్బాయిని పిలిచి మమ్మల్ని మేడ మీదికి పంపించారు!

– మీ వారికి బలే పేరు వుంది సుమా అంటూ మా పక్కవాళ్ళు ఎంతో మెచ్చుకున్నారు

మేము థియేటరులో కూర్చొని వుండగా ఓ అబ్బాయి వచ్చి నేను టిక్కెట్లకి యిచ్చిన డబ్బులు తిరిగి యిచ్చేశాడు –

– మా మేనేజరుగారు , ఇచ్చేయమన్నారమ్మా అన్నాడు వాడు–

ఫ్రీగా సినిమా చూడటం అదే మొదటిసారి! చాలా ఆనందం వేసింది నాకు

ఇంటికి వెళ్ళాక మా వారికి ఈ సంగతి చెప్పి మీకు ఇంత పేరు ఎలా వచ్చింది అని అడగాలనుకున్నాను

సినిమా ఇంటర్‌వెల్‌లో మా నలుగురికీ ఫ్రీగా కూల్‌డ్రింకులు కూడా పంపించాడు ఆ మేనేజరు

నేను వద్దు అన్నాను

మా పక్కింటావిడ తప్పు! అలా అనకూడదు! వాళ్ళు బాధపడతారు! తాగు అని బలవంతం చేసింది

కూల్‌డ్రింకు తాగిన తర్వాత ఈ సంగతి కూడా మావారికి చెప్పాలనుకున్నాను! కాస్సేపు అయ్యాకా కూల్‌డ్రింకులు యిచ్చిన అబ్బాయి నా దగ్గరకు వచ్చి 'అమ్మగారూ మీ వారి పేరు ఏమిటి ' అని అడిగాడు

'శేఖరంగారు' అన్నాను

'వారి దగ్గర్నుంచి మీకు ఫోన్ వచ్చింది '

అన్నాడు ఆ కుర్రాడు–

అయ్యో . వారు రాత్రి రావడం ఆలస్యం అయితే . మా మేడ మీది వాళ్ళకి ఫోన్ చేస్తానని చెప్పారు! మర్చిపోయాను! . పాపం వాళ్ళను కనుక్కొని .. ఇక్కడికి చేసి వుంటారు

సరే పద! పిన్నిగారు మా వారు ఫోన్ చేశారుట . వెళ్ళి వస్తాను అని చెప్పి మేడ దిగి వచ్చాను .

ఆ కుర్రాడు . నన్ను తిన్నగా మేనేజరు గదిలోకి తీసుకు వెళ్ళాడు.

అది ఏసి గది! . చాలా చల్లగా వుంది

ఫోన్ పక్కనే పెట్టి వుంది.

ఫోన్ తీసి హలో హలో .అన్నాను! ఎవరూ పలకలేదు..

కోపం వచ్చి పెట్టాశారో ఏమో!

అంతలో. ఆ లోపల గదిలో నుంచి టిక్కెట్లు దగ్గర కనిపించిన పెద్దమనిషి కనిపించాడు.

ఏమండి లైను కట్ అయింది అన్నాను

అయితే మళ్ళీ వస్తుంది! ఫోన్ పెట్టేసి కూర్చోండి మళ్ళీ మోగుతుంది

అని చెప్పేసి వెళ్ళిపోయాడు

నేను ఫోన్ పెట్టి కూర్చున్నాను అంతలో ట్యూబ్ లైటు ఆరిపోయి .ఎర్రబలుబు వెలిగింది..

నేను కంగారు పడ్డాను! బైటకు వెళ్ళబోయాను . తలుపు లాగి చూశాను! రాలేదు!!నాకు భయం వేసింది! .

అంతలో .. లోపల గదిలో నుంచి రెండు ఆకారాలు గదిలోకి వచ్చాయి!

ఎవరు. ఎవరు మీరు అని మరింత కంగారు పడ్డాను! .

తలుపు గట్టిగా కొట్టేను! ఆ రెండు ఆకారాలు దెయ్యాల్లాగా నవ్వేయి! సిగిరెట్ పొగ నా మీదకు వదులుత్తూ

తలుపు బాదకు! మా పని అవగానే అదే తెరుచుకుంటుంది .

ఛీ ఎవరు మీరు! అరుస్తాను! కేక లేస్తాను అన్నాను

నీ అరుపులూ కేకలూ బయటకు పోవు ! అంటూ ఒకడు నా చెయ్యి పట్టుకున్నాడు

నాగాజాలు అని అరిచాను

ఛీ అరవమాక . అన్నాడు వాడు .

థియేటర్లో పాట నాకు వినిపిస్తోంది కానీ నా మాట ఎవరికి వినపడటం లేదు

ఆ తర్వాత ఏం జరిగిందో నేను చెప్పలేను! ఒక ఆడదానిగా. . ఆ ఘోరం నేను ఎలా చెప్పను?

ఆ రెండు దున్నపోతులు . ఆ యిద్దరు రాక్షసులూ నా జీవితాన్ని నాశనం చేశాయి!

పైగా–

'బాత్ రూంలోకి వెళ్ళి ముఖం కడుక్కొని . ఎలా వచ్చావో అలా వెళ్ళు! మా సంగతి ఎవరికైనా చెప్పావో . నీ కాపురం నువ్వే కూల్చుకున్న దానివవుతావు! నీ మంగళసూత్రాలు నువ్వే తెంపుకుంటావా? నీ యిష్టం అన్నారు వాళ్ళు .

ఛీ వెధవ కంపు ఆ నరకం నుంచి ఎలాగో బయటపడ్డాను

సినిమా అపుడే విడిచి పెట్టారు మా పక్క వాళ్ళు నా కోసం ఎదురు చూస్తున్నారు

గబగబా వాళ్ళ దగ్గరికి పరిగెత్తాను

అబ్బ! చెత్త సినిమా ఈ సినిమా వంద రోజులు ఎలా ఆడిందో నాకు అర్థం గావడం లేదు అంది మా పక్కింటి వాళ్ళ పెద్ద అమ్మాయి

తలనొప్పి అన్నాను నేను!

తల పగిలిపోయింది నువ్వు అదృష్టవంతు రాలివి! మీ ఆయన ఫోన్ చేశాడు వెళ్ళిపోయావు ఆఖరి బోరు తప్పిపోయింది ! అంది మా

## ఇవేమన పద్యాలు




ఎద్దు మొద్దుకేల యిలశాస్త్ర వేదముల్
ముద్దరాలికేల ముసలి మగడు
చలిదితేని యింట సంసారమదియేల
విశ్వదాభిరామ వినురవేమ.

పక్కింటి పిన్నిగారు –

ఇంటికి వచ్చి అలాగె మంచం మీద పడ్డాను గుండె పగిలేలా ఏడ్చాను! భగవంతుడా! నీకు నేనేం అన్యాయం చెశాను? అసలు నువ్వున్నావా? అని దేవుణ్ని చెడామడా తిట్టిపోశాను –

అంతలో మేడ మీదివాళ్ళ అబ్బాయి వచ్చి మా వారు ఆలస్యంగా వస్తానని ఫోన్ చేసినట్టు చెప్పాడు –

అప్పుడు తెలిసింది వాళ్ళు సినిమాహాలులో ఆడినదంతా నాటకం అని!

ఎంత పని జరిగింది

## ఆడవాళ్ళు! జాగర్త!

ఆ దుర్మార్గులకు బుద్ధి చెప్పాలంటే మా వారికి చెప్పాలి! మా వారు పోలీసు రిపోర్టు ఇవ్వాలి! మేమిద్దరం . కోర్టుకు వెళ్ళాలి! డాక్టర్ పరీక్షలు మా బ్రతుకంతా బజారుపాలవుతుంది!

ఏ ఆడదయినా ఈ పరిస్థితిలో ఏం చేస్తుంది? చూస్తూ చూస్తూ తన భర్త గౌరవాన్ని బజారుపాలు చెయ్యగలదా? చెప్పండి! మీరే చెప్పండి"..

ఈ పరిస్థితిలో ఏం చెయ్యాలి? నేనేం చెయ్యాలి?

నిజం చెప్పి . బజారుపాలు కాలేక . అబద్ధం చెప్పి మా వారితో కాపురం చెయ్యలేక ఎలుకల విషం తిన్నాను

నేను పోతే మా వారు మరో పెళ్ళిచేసుకొని సుఖపడతారని అనుకున్నాను! కానీ వారిని అరెస్టు చేసి . ఇంత నింద వారి మీద వేస్తారనే ఆలోచన నాకు రాలేదు!

మా వారు నాకు విషం ఇచ్చి చంపబోయారా? ఎంత ఘోరంగా అన్నారండీ! ఏదో నేను బతికాను కాబట్టి ఎలుకలకు పెట్టినది పొరపాటున . తిన్నానని చెప్పాను కాబట్టి సరిపోయింది" లేకపోతే మా వారిని హంతకుడుగా శిక్షించేవారే కదా!

ఏం న్యాయమండీ ఇది! తనకి జరిగిన అన్యాయాన్ని చెప్పుకొనే స్వేచ్ఛలేని ఆడదానికి ఈ దేశంలో సమాన హక్కులు ఇస్తారా?

బ్రతుకు మీద విరక్తి పుట్టి ఆత్మహత్య చేసుకోడానికి హక్కులేదా ఈ దేశంలో?

ఆడదానికి ప్రాణం కంటే శీలం గొప్పది అంటారు మీరు! ఆ శీలం పోయింది ఫలానా వారి కారణంగా అని ఒక ఆడది చెప్పుకుంటే నమ్మరు! ఋజువులు పరీక్షలు కావాలి". ఎలా పోయిందో సినిమాలా చూపించాలి! ఇదేనా ఈ దేశంలో ఆడదానికి మీరు యిస్తున్న విలువ?

అందుకేనండీ ఆ రాక్షసులు అంత ధైర్యంగా నాకింత అన్యాయం చేశారు! పెళ్ళి అయిన ఆడది తన శీలం పోయిందని ఎవరికి చెప్పుకోలేదనే ధైర్యంతోనే ఆ కిరాతకులు ఈ అన్యాయం చేశారు! ఇలాంటి అన్యాయం ఎన్నాళ్ళుగా ఎంతమందికి జరుగుతోందో . మీకేం తెలుసు? నాకేం తెలుసు?

నా బ్రతుకు మీద నాకు తీపి లేకపోయినా నా భర్త కోసం నేను బ్రతుకుతాను! బ్రతకక ఏం చేస్తాను? చావడానికి కూడా స్వేచ్ఛలేని ఆడబ్రతుకు నాది!

ఈ కథంతా మా వారికి చెప్పి వారి మనసుని పాడుచెయ్యడం నాకిష్టంలేదు! అందుకే మీకు చెప్పుకున్నాను! మీరు ఆ రాక్షసులమీద కసి తీర్చుకుంటారని మీకు చెప్పలేదు! .

నాలాంటి ఆడవాళ్ళు అలాంటి వలలో చిక్కుకోకుండా జాగ్రత్తపడతారని నా కథంతా వాళ్ళకోసం మీకు చెప్పాను"

కాస్త ఓపిక వచ్చాక మా వారిని అడిగి ఈ వూరునుంచి బదిలీ చేసుకోమని అడుగుతాను! ఈ వూళ్ళో ఇక వుండలేను! .

అంతకంటే నేనేం చెయ్యగలను? మీరే చెప్పండి" □

# వారఫలం

## 9–8–1985 శుక్రవారం మొదలు 15–8–1985 గురువారం వరకు

★ **మేషం** ఆశయ పూర్తికి మీరు బాగా శ్రమించాలి ఒకవేళ అది వ్యాపారమయినా వ్యవహారమయినా మీరు వెనుకపడరాదు విశేషంగా శ్రమించవలసిన సమయం నూతనాంశాలు గ్రహించగులుగుతారు స్త్రీలకు స్థితియందు పెంపు. ఉద్యోగమందు పెంపు

★ **వృషభం:** ఎంత ప్రయాసపడినా ఏమున్నది లాభం? అనుకొంటారు అప్రయత్న ధనాదాయమున్నది పోయిన వస్తువులు సేకరించుకోగలుగుతారు నాలుగు విధాల అనుకూలత చెప్పదగ్గ సమయం స్త్రీలకు నూతనావకాశాలకు వృత్తి పెంపునకు అవకాశం గల వారం, మరి ఆరోగ్యమందు జాగ్రత్త!

★ **మిధునం:** వృత్తియందో, ఉద్యోగ రీత్యానో, వ్యవహారమందో మీకు ఏదో యిబ్బంది కనిపించనున్నది అంత తొందరగా త్వరపడి చేసిన వ్యవహారాలు మీకు యిబ్బంది కలిగింపగలవు యత్న కార్యమందు సత్ఫలితమే అనుభవింపనున్నారు స్త్రీలకు ఆరోగ్య రీత్యాజాగ్రత్తపడవలసినసమయం ఒక వేళ కొందరకుగృహ మార్పు కూడాసంభవం

★ **కర్కాటకం:** కాని వారితో నైనా, అయిన వారితోనైనా పోరాటానికి దిగటం ఏమంత శ్రేయస్కరం గాదు ప్రతిబరాణిస్తుంది నూతన వస్తు సేకరణకుఅవకాశమున్నది మీ మనోరథం, వ్యాపారరీత్యాసానుకూలం కాగలదు స్త్రీలకు వారమంతా గాకున్నా సోమ మంగళ వారాలందు అధిక శ్రమ,ప్రయాణ సన్నాహాలు

★ **సింహం:** మీ ఆలోచనలు పలిస్తాయి మీతో పోరాడానికి దిగవలెనని వెనుకకు పోతారు ఉత్తమ వారంగా గ్రహించి ప్రయాస పడండి, మేలున్నది చాలమందికి ఉద్యోగయత్నాలుసానుకూలం కాగలవు స్త్రీలకు అధి కారమందుపెంపు చెప్పదగిన అంశం

★ **కన్య:** చాలామందికి దూర ప్రయాణ సన్నాహాలుంటాయి వృత్తియందు అంతో యితో పెంపు చేకూరుతుంది 'కోర్టు' వ్యవహారాలందు అనుకూలత చేకూరుతుంది చుట్టుపక్కల వారితో గొడవలు రాకుండా చూచుకోవాలి స్త్రీలకు నూతన వృత్తికైప్రాకులాడేవారికి సదవకాశమున్నది

★ **తుల.** నాలుగు రకాల మీకు ఆదాయం, అంతస్థు పెరిగే అవకాశమున్నది రాజకీయవాదులకు అనుకూలమైన వారం కార్య సాధనకు దిగవచ్చు కోరుకొన్న వస్తువులు సేకరించుకోగలుగుతారు స్త్రీలకు ఒకటి రెండు మార్గాల అనుకూలత దనలబ్ధి

★ **వృశ్చికం:** శక్తివంచన లేకుండా పాటుపడే ప్రకృతే మీది అయినా లాభం? కాలం కానినాడు మొనగాడైనా తలవంచవలసిందే శనివారం మాత్రం సర్వానుకూలం స్త్రీలకు ఉద్యోగ మందల అవకాశాలు తొలగిపోతాయి ఆరోగ్య మందభివృద్ధి యత్న కార్యంద్వ శుభకార్యోన్ముఖులు కాగలుగుతారు

★ **ధనుస్సు:** రాజకీయంగా మీకు అనుకూల వారం అయినా మంచి చెడ్డల గురితించి నడచుకోటం మంచిది సజ్జన సాంగత్యమే కోరుకోవలె అనవసరంగా చుట్టుపక్కల వేరే వారిని దూరంగా ఉంచాలి స్త్రీలకు నూతన వస్తువులు కొనుగోలు చేయుటకు వస్త్ర సంపాదనకు అనుకూలం

★ **మకరం:** ఖర్చు విషయంగా ఏదో అననుకూలత సంభవించనున్నది బంధు వర్గీయులతో వాగ్వాదాలకు దిగవలసిన సమయం మరి జాగ్రత్తగా ఉండటం అవసరం గదా! స్త్రీలకు బంధువుల రాకపోకల సందడి, ఉద్యోగమందు ముందడుగు వేసే అవకాశాలుంటాయి

★ **కుంభం:** కావలసినవారో బంధువులో ఎరివితులో యింటికి రానున్నారు వారికై వారమంతా శ్రమించవలసిన అగత్యమున్నది లావాదేవీలందు మీకనుకూలం మీ యింట శుభం జరిగే అవకాశమున్నది స్త్రీలకు ఉద్యోగమందు కాని, ధన సేకరణయందు గాని, ఒకరిని నమ్మటం శ్రేయస్కరంగాదు

★ **మీనం.** ఉత్తమ ఫలదాయక దినం పనులందు జాప్యం ఏమాత్రం తగదు చాలమందికి తప్పనిసరిగా ప్రయాణం చేయవలసిన అగత్యం ఏర్పడుతుంది స్థిరచరాస్తులందు ఏదో అననుకూలత సంభవించనున్నది ఓర్పుతో గ్రహించి సంచరించటం శ్రేయస్కరం స్త్రీలకు కొందరకు రచనా విధానాన మేలు అధికార పూర్వకములైన పదవులేవైనా లభించగలవు గ్రహించండి

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

# వ్యక్తిగతం



లండన్‌లో 108 సంవత్సరాల చరిత్ర గల వింబుల్డన్ టెన్నిస్ పోటీలలోని పురుషుల సింగిల్స్ ఫైనల్స్‌లో పశ్చిమ జర్మనీకి చెందిన 17 సంవత్సరాల బాలుడు బోరిస్‌బెకర్ అత్యద్భుతమైన విజయాన్ని సాధించి చరిత్ర సృష్టించాడు టెన్నిస్ ఆటలో విశ్వవిజేతలుగా కీర్తి గడించిన జాన్ మెకెన్రో, జిమ్మీ కానర్స్‌లని మెరుపులా ఆడి ఓడించి ఫైనల్స్‌కి చేరుకున్న 27 సంవత్సరాల కెవిన్‌కరెన్ పై బోరిస్ బెకర్ అత్యంత లాఘవంగా, తొణుకు బెణుకు లేకుండా ఎటువంటి ఆందోళనా పడకుండా ఆడి ఘన విజయాన్ని సాధించాడు బెకర్ అన్‌సీడెడ్ ఆటగాడు గత సంవత్సరం నించే అతను అంతర్జాతీయ సర్క్యూట్‌లో ఆడటం మొదలు పెట్టాడు వింబుల్డన్ కిరీటాన్ని ఒక అన్‌సీడెడ్ ఆటగాడు గెలుచుకోవటం చరిత్రలో మొట్ట మొదటిసారి, అది బోరిస్ బెకర్‌తో ప్రారంభం అయింది అంతేకాకుండా వింబుల్డన్ అమెరికన్ ఆస్ట్రేలియన్ ఫ్రెంచి ఓపెన్ టెన్నిస్ ఛాంపియన్‌షిప్‌లని గెలుచుకోవటం ద్వారా గ్రాండ్‌స్లామ్ కూడా సాధించిన ఘనత చరిత్రలో బోరిస్‌బెకర్‌కే దక్కడం మరో విశేషం బెకర్ అప్పుడు బాలు 7 లో కాలు మోపుతున్నది అతను వింబుల్డన్ కిరీటాన్ని చేజిక్కించుకున్నది జూలై (7వ నెల) 7న ఆ రోజుకి అతని వయసూ 17 సంవత్సరాల 7 నెలల 7 రోజులు ఈ వింబుల్డన్ విజయోత్సవ సందర్భంగా జరిగే షాంపైన్ పార్టీలో పాల్గొనటానికి కూడా చట్ట ప్రకారం అతనికి తగిన వయసు లేదు వోటు హక్కు, డ్రైవింగ్ లైసెన్స్‌లని పొందేందుకు అతను ఇంకా చిన్న వయస్కుడే! జర్మనీ చరిత్రలో కూడా మొట్టమొదటి వింబుల్డన్ విజేత బోరిస్ బెకర్ ఫైనల్స్‌లో బెకర్ ప్రదర్శించిన నిబ్బరాన్ని అతని ప్రత్యర్థి కరెన్ కూడా ప్రశంసించాడు ప్రపంచ టెన్నిస్‌లో అగ్రగామిగా నిలిచే సత్తా బెకర్‌కి ఉన్నదని కూడా అయన అన్నారు □

# శ్రీమతితో సినిమాకు




జి.వి. రామచంద్రరాజు

శ్రీనివాసమూర్తి ఆరోజు గట్టి నిర్ణయానికి వచ్చాడు తన బాస్‌కి ఏదో విధంగా నచ్చ చెప్పి మస్కా కొట్టి పెందరాళే యింటికి వెళ్ళాలి తను ఆవిధంగా చెయగలిగితే అది తన సర్వీసులో సాహసమే అవుతుంది ఎప్పటికప్పుడు శ్రీమతి కోరిక వాయిదా వేస్తున్నాడు భార్య తనను అసమర్ధుడుగా స్పందన లేనివాడిగ జమకట్టేసింది ఈసారి తనూ ఒక భర్త అని రుజువు చేయాలి

సాయంత్రం నాలుగు గంటలకు బాస్ గదిలోకి వెళ్ళాడు కాని మస్కా కొట్టడానికి ధైర్యం చాలటం లేదు

శ్రీనివాసమూర్తి స్వతహాగా మొగమాటస్తుడు రెవెన్యూ డిపార్టుమెంటులో పని చేస్తున్నాడు ఏ డిపార్టుమెంటు కయినా ఆదివారమనో పండుగనో కాస్త రెస్టు తీసుకోవచ్చు కాని యీ డిపార్టు మెంటుకు మాత్రం అన్ని రోజులు ఒక్కలాగే ఉంటాయి దీపావళి రోజున బాణసంచా పేలుడు వెంటనే అక్కడికి పరుగెత్తాలి రిపబ్లిక్ ఉత్సవం రోజున అగ్ని ప్రమాదం ఆదివారం రోజున పె

ఆఫీసర్ల క్యాంపులు, మీటింగులు

శ్రీనివాసమూర్తి వాచీ చూచుకొన్నాడు నాలుగు న్నర ధైర్యం చెసుకొని బాస్‌తో చాలా అర్జంటు పని ఉందని చెప్పాడు ఎప్పుడూ పర్మిషన్ అడగనివాడు అడిగాడు బాస్ ఓ కే అన్నాడు పర్వాలేదు మొదటి మెట్టులో విజయం సాధించా ననుకున్నాడు శ్రీనివాసమూర్తి

ఐదు గంటలకు యిల్లు చేరుకున్నాడు జయా, జయా , త్వరగా తెమలాలి ఈ రోజు మనం సినిమాకు వెడుతున్నాం ఎంతో హుందాగా, గర్వంగా సినీపోజులో అన్నాడు

జయకు ఏమాత్రం నమ్మకంలేదు నిజంగా బయలుదేరినా ఆవేళకు ఆఫీసుకు రమ్మని ఏదో కబురు వస్తుంది

భర్తతో కలిసి సినిమాకు వెళ్లాలని జయ తీరని కోరిక ఏ ఆదివారమైనా పండుగ రోజునైనా భర్తను సినిమాకు తీసుకెళ్లమంటే 'రష్'గా వుంటుంది టిక్కట్లు దొరకవు అంటాడు ఇక మిగతా రోజుల్లో తను అడగ నక్కరలేదు అతను చెప్ప నక్కరలేదు ఒకసారి సినిమాల గురించి లెక్చరు కూడ యిచ్చాడు

సినిమాల వల్ల దేశానికి ఎంతో అనర్థం జరుగుతోంది ప్రజల ఆర్థిక పరిస్థితి దెబ్బ తింటోంది తినడానికి తిండి లేకపోయినా - ముఖ్యంగా రోజూ కూలి చేసుకొనేవాడు- సినిమా చూడకుండా ఉండలేక పోతున్నాడు అందులోని అర్థనగ్న వస్త్రధారణ, క్లబ్ డాన్సులు, బూతు మాటలు పాటలు, రేప్ సీన్లు, దోపిడీలు, హత్యలు వాళ్లను బాగా ఆకర్షిస్తున్నాయి సినిమా ప్రొడ్యూసర్లు వీరి బలహీనతను కనిపెట్టి అటువంటి సన్నివేశాలను పుష్కలంగా గుప్పించి సొమ్ము చేసుకుంటున్నారు మనిషిని చెడు ఆకర్షించి నట్లుగ మంచి ఆకర్షించదు ఈ రోజుల్లో హత్యలు బ్యాంకు దోపిడీలు, మానభంగాలు వగైరా జరగడానికి ముఖ్యంగ సినిమాలు దోహదం చెస్తున్నాయని వేరుగ చెప్ప నవసరంలేదు నా ఉద్దేశంలో సినిమాలను ప్రభుత్వం నిషేధించాలి అందులో కళాలేదు, కళాపోషణలేదు వ్యాపారం మాత్రమే సినిమాలను నిషేధిస్తే ప్రజల ఆర్థిక పరిస్థితి చక్కబడుతుంది స్థితికి మించిన ఆడంబరాలు తగ్గుతాయి" శ్రీనివాసమూర్తికి ఆవేశం పెరుగుతోంది

చాలు, చాలు మీకో నమస్కారం. నన్ను సినిమాకు తీసుకొని వెళ్లక్కరలేదు గాని, సినిమాలను నిషేధించకండి జనం పిచ్చిపట్టి చస్తారు మధ్యనిషేధాన్నయినా భరిస్తారుగాని సినిమాలను రద్దు చేస్తే యింకేమయినా వుందా ఇప్పుడే యుగాంత మవుతుంది "జయకు గతం జ్ఞప్తికి వచ్చింది అట్టివాడు మనసు మార్చుకున్నాడు

పద్మశ్రీలో 'స్వాతి' సినిమా బాగుందని మా ఆఫీసులో వాళ్లు అనుకుంటున్నారు జయ శ్రీనివాసమూర్తి మాటల్లోకి వచ్చింది

అవును 'స్వాతి' సినిమా బాగున్నదని స్నేహితురాలు శారద చెప్పింది 'తనూ వెళ్లాలనుకుంటున్నది జయ అప్పుడప్పుడు యిరుగు పొరుగు అమ్మలక్కలతో సినిమాకు వెడుతుంది కాని శ్రీవారితో కలిసి వెడితే ఉండే హాయి, అనుభూతి వాళ్లతో వెడితే ఏముంటుంది అందుకే తన ఆరాటం తపన

అబ్బ! యిన్నాళ్లకు తన తీయని కోరిక తీరనున్నది శ్రీనివాసమూర్తి తను అనుకున్నంత జడుడుకాడు

గబగబా వంట పని పూర్తి చెసెసింది పిల్లలను చూడమని అత్తగారికి చెప్పింది జయ ఆనందం చూస్తుంటే శ్రీనివాసమూర్తికి కూడ ఉత్సాహంగానే యుంది ఇన్నాళ్లకు భార్య కోరిక తీర్చ గలుగుతున్నాడు తన సర్వీసులో యిదొక మంచి రోజు మంచి సంఘటన

సినిమా హాలుకు చేరుకున్నారు బయట జనం రద్దీలేదు తన అదృష్టం టిక్కట్లు దొరకవేమోనని భయపడ్డాడు ఇప్పుడు యిబ్బందిలేదు

టిక్కట్లు తీసుకొని లోనికి వెళ్లి కూర్చున్నారు పలచ పలచగా జనం వస్తున్నారు 'స్వాతి' సినిమా విడుదల అయి చాల కాలమయింది గదా, అందుచే రద్దీ లేదనుకున్నాడు సినిమా ప్రారంభమయింది టైటిల్సు వస్తున్నాయి 'గూండాలకు గూండా-15 రీళ్ళు'

ఇదేమిటండీ- ఇంకోటేదో సినిమా చూపిస్తున్నాడు -జయ భర్తతో అంది

అవును-ఇదేమిటి? ఓహో ! యింకో సినిమా లోని ఫ్లాషస్ చూపెడుతున్నాడు- జయతో అన్నాడు శ్రీనివాసమూర్తి తన ఊహాగానాన్ని తనే మెచ్చుకుంటూ ఫైటింగ్సుతో ప్రారంభమయింది సినిమా నాలుగు నిమిషాల తరువాత క్లబ్ డాన్సు-- మరలా ఫైటింగులు-జయ ఉత్సాహమంతా నీరుకారి పోయింది శ్రీనివాసమూర్తి మనసుకూడా వికలమయింది

'సినిమా మారిపోయిందా, ఏమిటి? టిక్కట్లు కొనే ముందు పోస్టర్లు చూడలేదు ప్రక్కవారిని అడిగాడు తన అనుమానం నిజమయింది స్వాతి సినిమా అంతకు ముందు రోజున మారిపోయింది శ్రీనివాసమూర్తి డీలాపడిపోయాడు మనసు పాడైపోయింది తల బరువెక్కింది 'జయ తనను ఏమను కుంటోందో!' తల పట్టుకొని కూర్చుంది మాట్లాడటం లేదు

ఇంటర్వెల్‌లో వెళ్లిపోదామని జయ , కీ వచ్చి వెసింది

'మనస్ఫూర్తిగ తనను సినిమాకు తీసుకొని వెళ్లాలని వుంటే యిటువంటి సినిమా ఎందుకు దొరుకుతుంది ఇది వరలో శ్రీనివాసమూర్తి సినిమా గురించి యిచ్చిన లెక్చరు జ్ఞాపకం వచ్చింది

ఉక్రోషం ముంచుకొచ్చింది

ఛీ ఛీ , దేనికయినా అదృష్టముండాలి ఆడదానికి కొన్ని సరదాలు కోరికలు ఉంటాయని యీ మగాళ్లకు ఎప్పటికయినా తెలుస్తుందా? అవును, వాళ్లకేం , హాయిగా తిరిగి వస్తారు కావలసినవి చూస్తారు తేనె పూసిన కత్తులు గట్టిగానే అరిచింది జయ

పాపం, శ్రీనివాసమూర్తి భార్య మనసెరుగని భర్తగానే మిగిలి పోయాడు □






# ఈ కొత్త రంగుల టీవీలో ఏమి

**దాని జన్మస్థానం, ప్రపంచ క్లాసు సాంకేతిజ్ఞత, ఉత్పత్తి పద్ధతులు, సోలిడైర్ CTS 605**

ప్రపంచ స్థాయి పశ్చిమ జర్మనీ సాంకేతిజ్ఞత దానికి మూలం చిరకాలం మన్నే సరకులు మాత్రమే యివ్వడానికి పేరు పొందింది అంతే తప్ప పారవేసిన పనికిరానివి ఎప్పటికి కావు ఐటిటి నుంచి పశ్చిమ జర్మనీలో ప్రెహ్ నుంచి లోపాలే ఎరుగని విడిభాగాలు మన అతితీవ్ర వాతావరణ పరిస్థితులను తట్టుకోగలవే అన్నీ

ఇక సర్క్యూట్ విషయం లోపరహిత సంపూర్ణ రూపకల్పన భారతదేశ పరిస్థితులు తట్టుకోగలది ఉదాహరణకి మన వోల్టేజి హెచ్చుతగ్గులనే తీసుకుందాం జపాన్‌లోగాని లేదా పశ్చిమ జర్మనీలోగాని యిలోలి అసలు తెలీనే తెలీవు ఈ ఇబ్బందిని తట్టుకోడానికి, సోలిడైర్‌లోని పరిశోధన అభివృద్ధి శాఖ ఒక విశిష్టమైన దాన్ని రూపొందించింది అదే OVT, SMPS కాక యిది అదనం అన్నమాట అన్ని రకాల ట్రాన్సియంట్ వోల్టేజి హెచ్చుతగ్గులనుంచీ టివిని యిది కాపాడుతుంది ఆటోమాటిక్‌గా ఆన్ లేదా ఆఫ్ చేయవచ్చు నిజంగా గొప్ప ముందడుగు మీకోసం అంతేకాదు LOT SMPS ఎలక్ట్రానిక్ ట్యూనర్, కలర్ ఐసిలు తదితరాలు యిప్పుడు ప్రపంచమంతటా వాటిని వాడుతున్నారు అంతకన్నా గొప్పవిషయం సోలిడైర్‌కి మాత్రమే లభిస్తున్న గొప్ప ప్రజాదరణ సోలిడైర్ సగర్వ యజమానుల్ని అడగండి దాని గొప్పతనం గురించి యింకా అనేకం చెబుతారు లేదా మా డీలర్లనైనా అడగవచ్చు ఈరోజున మీకొలుగోలుకు వున్న వాటన్నిటిలో సోలిడైర్ అత్యుత్తమమైంది ఏలాగో వారు చెబుతారు






CTS 605

**Solidaire** COLOUR

**-that seldom fails!**

మిటుతున్నట్టుగా అనిపించింది

చాలా అంది

నో ఒక్క సంతకంతో వదిలేస్తామా యిదిగో ఎస్కార్ట్ సర్టిఫికెటు ఫిలప్ చేసి సంతకం చేయండి

ప్రతిసారి చెక్ తీసుకుంటున్నా క్రొత్త ఏం బుర్రో ' అనుకున్న మాట వినిపించేసరికి చెప్పడానికేకదా మాకు జీతాలు అన్నాను

ఆ అమ్మాయి నవ్వేసింది – అంతేనా, రేపొద్దున్న మా కార్యక్రమం విని దాని మీద రిపోర్ట్ వ్రాసి మా జాతకాలు తేల్చేయడానికిను – అని రెవెన్యూ స్టాంపు కోసం యిరవై పైసలిచ్చింది

ఫరవాలేదండి

లెక్క లెక్కే

సర్టిఫికెట్ ఫిలప్ చేయగానే నీలం చొక్కా 'ఎస్కార్ట్ సిగ్నేచర్' దగ్గర సంతకం పెట్టింది బదులుగా 'థాంక్స్' ప్రవీణ కంఠం అతనితో

అదేమిటి ఎస్కార్ట్ సంతకం పెడితే థ్యాంక్స్ అంటోంది – ఏదో అనుమానం ఎద తలుపులు తట్టింది

ఇక మాకు శలవిప్పిస్తారా

నో అందామనుకున్నా – కానీ అన్లేదు

ఆ అమ్మాయి చెక్ తీసుకోవడం, వెళ్ళిపోవడం అన్నీ వెంట వెంటనే ప్రోగ్రామ్ తరువాత అనౌన్స్మెంట్లా జరిగిపోయాయి

వాళ్ళిద్దరూ కళ్ళ ముందు నుంచే వెళ్ళిపోయారు

ఆఫీసులో ఆ అమ్మాయి గురించి అనుకున్న మాటలు గుర్తొచ్చాయి

ఎందుకో తలపోటు మొదలయింది

సీట్లో కూర్చో బుద్ధి కూడా కాలేదు

వేడివేడి కాఫీ ఓ టాబ్లెట్

ఆలోచనలను చల్లబరచడానికి పట్టాలు తప్పుతున్న మనసును మార్గంలోకి లాక్కురావటానికి

కొద్ది రోజుల తరువాత

కేలండరులో రెండు కాగితాలు కదిలాయి

ఏదో సంగీత రూపకంలో పాడటానికని వచ్చింది ప్రవీణ

ఈసారి ఆమెతో మరో వ్యక్తి పసుపు చొక్కా

ఈసారి ఎస్కార్ట్స్ సంతకం అతనిది సంతకం చేసేసి వెళ్ళిపోయి అతను బయట వెయిట్ చేస్తున్నాడు

అతనికి నిముషాలు యెలా గడుస్తున్నాయో మరి నాకు తెలియదు

ఏమండి మీరు ఏమి అనుకోనంటే ఓ మాట అనుమానాన్ని కాస్త కదిపాను

అడగండి సందేహం దేనికి ప్రవీణ మాటలో ధైర్యం కొట్టొచ్చినట్టు కనిపించింది

ఎస్కార్ట్గా వచ్చిన ఆయన మీకు ఏమవుతారో తెలుసుకోవచ్చా అబ్బే ఏంలేదు పోలికలుంటేనూ –

– మొదటిది చాలా సేపట్నుంచీ పీకుతున్న అనుమానం దానిని కప్పిపుచ్చుకోడానికి రెండోది అబద్ధం

ఈసారి ప్రవీణ ఓ నవ్వు నవ్వింది

నా ప్రశ్న అంత జోక్గా ఉందా అడిగాను

కాదు మళ్ళీ నవ్వులొంచే రాలేక వచ్చిందా మాట

'అరె ఏమిటి మేడమ్ చెప్పయినా నవ్వండి నవ్వయినా చెప్పండి

ఆ నవ్వుకి ఓ నాలుగు ఆపీసు ముఖాలు నాకేసి అదోలా చూశాయి డ్యూటీ రూమ్ ముందు నుంచి పనిలేకపోయినా వెడుతూ అల్లబోయే కథకి ప్లాట్ దొరుకుతుందేమోనన్న ఆశతో

– అప్పటికే నా బ్రహ్మచారి జీవితానికి వున్న నాలుగు కథలకి మరో రెండు అతికించడానికి

ఓ అమ్మాయితో మాట్లాడటం తప్పు

చూడటం నేరం

పలకరిస్తే ప్రేమ

నవ్వితే మరేదో

క్రొత్త అర్థాలు చెప్పే డిక్ష నరీ మా ఆఫీసు

ఆ ముఖాలలో భావాలు వికృతంగా కనిపించేసరికి నాకు అసహ్యమేసింది

నిజం చెప్పమంటారా అబద్ధం చెప్పమంటారా' ప్రవీణ

భలేవారే మీరు ఏం చెప్పినా నిజమనే అనుకుంటాను

అది నా మీద నమ్మకమా మీ అమాయకత్వమా కొంపదిసి – మళ్ళీ ఓ నవ్వు

ఆ నవ్వులో సరిగమలున్నాయి

చూడండి ఒక అమ్మాయి గడప దాటి బయటి కొచ్చిందంటే నలుగురూ నాలుగు రకాలైన కామెంట్స్ విసిరేవారే మా ఇంటికి మగదిక్కు, పెద్ద దిక్కు నాన్నగారే ఆయన రిటైరయ్యారు వచ్చే కొద్ది పెన్షను, ఆయన ఓపిక లేకపోయినా తెచ్చుకుని చెప్పే ట్యూషన్లు అంతే అక్క పెళ్ళికని చేసిన అప్పు యింకా అప్పుగానే వుంది సంగీతం మీద నాకుండే శ్రద్ధవల్ల ఈ డబ్బు ఈ రోజున మా కుటుంబానికి ఉపయోగపడుతోంది బస్సు దిగగానే వెంటబడే వాళ్ళు యికిలించే వాళ్ళు ఏవేవో మాటలు అనేవాళ్ళు వాటి నుంచి తప్పించు కోడానికి ఒకటే మార్గం కనిపించింది ఏదోలా కల్పించుకునైనా సరే వారితో ఏదో మాట్లాడేయాలి – అదే పని చేస్తున్నాను మీరా 'ఎస్కార్ట్స్' లేకుండా మొత్తం ఎమవుంట్ యివ్వరు నేను మా చెల్లినో, తమ్ముడినో తీసుకురాలేక కాదు తీసుకొస్తే నాతో బాటు బస్సు చార్జీలూ అవీ వాళ్ళను తీసుకొచ్చి ఈ డబ్బు ఖర్చు చేయడం యిష్టంలేదు ఎందుకంటే – ఒక నెల బియ్యం ఖర్చైనా కొంత వెళ్ళిపోతుంది – అందుకే బస్సు దిగగానే యిలా వెంటబడే వాళ్ళలో ఒకర్ని పరిచయం చేసుకుని నా గురించి నేనే ఓ కథను కల్పించుకుని చెప్పుకుని ప్రాణాలను అరచేతుల్లో పెట్టుకుని యిక్కడకు వస్తున్నాను

ఆమె చెబుతున్నది వినేసరికి చాలా జాలేసింది – నవ్వే ఆ పెదవుల వెనుక యింత కథుందా అనిపించింది

చదువుకున్నవాడినై వుండి నేనే ఆమె కూడా వచ్చేవారిని చూసి ఒరత్తంగా అంచనా వేశానేమో ఓ మనిషిని గురించి ఆలోచించేటప్పుడు ముందు వారిని ఉన్నతంగా ఊహించడం ఎందుకు చేతకాదో అని తిట్టుకున్నాను అందులో నన్నూ చేర్చుకున్నాను

'మీరు కోరి ప్రమాదం తెచ్చుకోవటం లేదు కదా

హుం ప్రమాదం ఏది కాదు ప్రమాదం ఆడది ఒంటరిగా వెళ్ళకుండా ఎప్పుడూ చెల్లినో, తమ్ముడినో వుంచుకోవాలా కూడా అయినా నేనేం తప్పు చేస్తున్నట్టు అనుకోవటం లేదు మనిషి బలహీనతలు తెలుసును కనుక వాటిని ఆధారం చేసుకుని, నాకు నేను ధైర్యంగా ముందుకు వెళ్ళగలుగుతున్నాను అన్నట్టు మర్చేపోయాను సాయంకాలం విజయనగరంలో నా లలితసంగీత కచేరి వుంది చాలా పెద్దవాళ్ళని యిన్వైట్ చేయడం జరిగింది ఒక రకంగా సెలెక్షన్స్ కోసం ఏర్పాటు చేసిన కార్యక్రమమే ఈ కచేరి నాకో ఉద్యోగం తెచ్చి పెడితే నేను అదృష్టవంతురాలినే మా నాన్న చిన్న సంపాదనకి తోడు నిలిచినట్టవుతుంది ఆపై భగవంతుడి దయ ఇదిగో కార్డు రావడానికి ప్రయత్నించండి సారీ మీకు నా హిస్టరీ చెప్పి టైమ్ వేస్ట్ చెశానేమో

నో నో అదేంకాదు"

వస్తానండి" వెళ్ళిపోయింది

అయిదు – పది నిముషాల తర్వాత

పోను మ్రోగింది

'కాకినాడ నుంచి ట్రంకాలా హలో ఆఁ ఇది ఆలిండియా రేడియో స్టేషనే ఏమిటి కుమారి ప్రవీణ ఆఁ లైట్ మ్యూజిక్ ఆర్టిస్ట్ ఆఁ ఏమిటి వాళ్ళ

నాన్నగారు నాన్నగారికి హార్ట్ ఎటాక్ ఏమిటి పోయారా అయ్యయ్యో ఆఁ అలాగే వెంటనే తెలియజేస్తాను

ఈ దారుణ వార్త ఎలా చెప్పాలో తెలియక ఎలాగైనా చెప్పక తప్పదు కనుక గేటుకూడా దాటి వుండదని ప్రవీణకోసం పరిగెత్తాను

కనిపించలేదు

రికార్డింగవగానే విజయనగరంలో జరిగే లలితసంగీత కచేరికి వెడుతున్నానని చెప్పిన విషయం గుర్తొచ్చింది

ఆ వార్త అందజేస్తే –

కచేరిలో పాడలేక – ఉద్యోగావకాశాన్ని పోగొట్టినట్టవుతుందేమో పోయిన తండ్రి ఎలాగూ ఎంత బాధపడినా రాడు

కాని ఆ అమ్మాయి టాలెంట్కి ఉద్యోగం వస్తుంది వచ్చి తరుతుంది

జీవితానికో గమ్యం చూపించె ఉద్యోగమే తండ్రి మరణవార్తకన్నా ముఖ్యమనిపించింది నాకు ఆ సమయంలో

ఆలస్యమైనా ఫరవాలేదు –

కచేరి అయ్యాకే ఈ విషయం తెలియాలనే నిర్ణయం తీసుకున్నాను

కచేరికి రమ్మని ప్రవీణ యిచ్చిన ఇన్విటేషన్ కార్డు మీద అప్రయత్నంగానే కన్నీటి బొట్లు రాలాయి □

కొత్త సీరియల్ ప్రారంభం!



# ప్రతిభ



డాక్టర్ ముదిగొండ శివప్రసాద్

అది శరదృతువు. గగన కన్య కప్పు ఆకాశంలో మంచుతెర వ్యాపిం కరణంగా రాత్రిగా మారింది.

చుక్కలు పొదిగిన తెలిపట్టు చీరను ప్రోషిత వాసవ సజ్జికల నిశాకాంత శ్యావ ఎదురు చూస్తూ ఎవరికోసమో నిలబడి కన్పిస్తున్నది.

సంధ్య ప్రదోష సమయ తాండవ నృత్యానంతరం వ్యోమకేశుడై విచలిత జటాజూటాన్ని సవరించుకుంటున్నాడా అన్నట్లు దుబ్బులు ఆకాశంలో మబ్బులు.

ఇదొక విచిత్ర నర్తన ముహూర్తం!
విశ్వకళా రహస్యాన్వేషణ మహాసంకల్ప సమయం!

ఆనాడు సాయంకాలం నుండే హైదరాబాదులోని రవింద్ర భారతి ప్రాంగణం జన సమ్మర్దం కాజొచ్చింది కార్లతో, ఆటోలతో కళాభవనుకు ముందు భాగం కిటకిటలాడి పోతున్నది

ఆ రాత్రి విశ్వ విఖ్యాత నర్తకీమణి కుమారి ప్రతిభ అక్కడ తన భరత నాట్య

Bali

ప్రదర్శనను ఇస్తున్నది. అందుకే ఈ జన సందోహం.

కుమారి ప్రతిభ నర్తిస్తుంటే అది ఒక ఖేలనంవలె ఉంటదని, పరమశివుని పట్టపురాణి గజ్జ కట్టినట్లు ఉంటుందని అభిజ్ఞుల అభిప్రాయం.

అనుకొన్న సమయానికి సరిగ్గా ఆంధ్రప్రదేశ్ మంత్రి వర్గానికి చెందిన ఒక ప్రముఖుడు ముఖ్య అతిథిగా విచ్చేసారు. ఆయన రాగానే ఆయన కోసం ఎదురు చూస్తున్న కార్యకర్తలు మంగళ వాద్యాలను ప్రయోగించారు. ఆంధ్రులకు ప్రశస్తి తెచ్చిన గుంటూరు జిల్లా ప్రముఖుని మంగళ వాద్యమది.

ముఖ్య అతిథిని పూర్ణకుంభంతో వేదిక వద్దకు తీసుకు వచ్చారు.

ముఖ్య అతిథి మైక్ ముందుకు వచ్చాడు. మైకు ఒక మైకం లాంటిది. ఇనుమును అయస్కాంతం ఆకర్షించినట్లు కొందరిని అది వదలకుండా ప్రలోభ పెడుతుంది. ముఖ్య అతిథి మైకు మైకంలో పడి సుదీర్ఘ ప్రసంగమే చేసాడు. అతనికి ఒక పర్సనల్ సెక్రటరి ఉన్నాడు. అతను మంచి విద్వాంసుడు. ఈ మంత్రిగారు ఏ సభకు వెడితే ఆ సభకు కావలసిన సమాచారం ముందే శాస్త్రీయంగా, సప్రమాణంగా వ్రాసి ఇస్తూ ఉంటాడు. అందువల్ల ముఖ్య అతిథి చేసే ఏ ప్రసంగమైనా సరే జనరంజకంగా ఉండటంతో పాటు విజ్ఞానదాయకంగా శోభిస్తూ ఉంటుంది.

న్న మలి ముసుగు

ంది. త్రిసంధ్య

రించిన

ాంగియై

న్నట్లు

శివుడు తన

దుబ్బులుగా



# ప్రతిభ

"శోదర శోదరిమణులారా! నేడు మన హైదరాబాదు నగరానికి ఒక గర్వకారణమైన దినం! ఒక పర్వకారణమైన దినం! తెలుగు కళా రంగానికి కలికి తురాయి వంటి తెలుగు వెలుగు కుమారి ప్రతిభ భరత నాట్య ప్రదర్శనను స్థానిక లలిత కళా పరిషత్తు వారి అధ్వర్యాన ఇస్తున్నది. ఈమె ఇంతకు ముందే భారత దేశంలోని అనేక ప్రాంతాలలో తన ప్రదర్శనను ఇచ్చి అద్వితీయమైన తన ప్రతిభను నిరూపించుకొని ఎన్నో సన్మానాలు, బిరుదులు పొందింది. అందువల్ల ఈమెను నేను ఇప్పుడు మళ్లీ ప్రస్తుతించటం చంద్రుని వెలుగును చూపటం కోసం కొవ్వొత్తిని పైకెత్తటం లాంటిది. సూర్యుని వెలుగును వర్ణించటం కోసం కాగడా ప్రయత్నించటం వంటిది. ఆమె నృత్యం అజరామరమై తెలుగు వారికి తరతరాల తరగని కీర్తి ప్రతిష్ఠలను చేకూర్చాలని ఆశిస్తున్నాను. (సభలో కరతాళ ధ్వనులు) భరతనాట్యం, ఆంధ్రుల నాట్యకళా అత్యంత ప్రాచీనమైనవి. "భ" అంటే భావము, "ర" అంటే రాగము, "త" అంటే తాళము. ఈ మూడింటితో కూడినదే భరతము. అంతేకాదు భరతులు. అంటే నటులు అని ఒక అర్థం ఉంది. నటుల ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకుని రచింపబడిన సమగ్ర నాట్య శాస్త్రమే భరతము. దీన్ని రచించిన వాడు సామాన్యుడు కాదు. ఒక మహా ముని. రసస్రష్ట, రసద్రష్ట, క్రాంతదర్శి, తపస్వి." ఈ విధంగా ప్రసంగం సాగిపోతున్నది.

శ్రోతలు ప్రశాంతంగా సహనంగా వింటూ ఉన్నారు. అందుకు కారణం ఈ మాటలన్నీ వారికి యిష్టమైనవని కాదు. పూర్తిగా అర్థమవుతున్నవనీ కాదు. అదొక ఆనవాయితీ. అలా ఎవరో వ్రాసిపెట్టిన విద్వత్ప్రసంగాన్ని నగరంలో ముఖ్య అతిథులు వల్లిస్తూ ఉంటారు. సభ్యులు లాంఛనంగా వింటూ ఉంటారు.

ముఖ్య అతిథి ప్రసంగం ముగించి కుర్చీలో కూలబడ్డాడు. సభ మొత్తం కరతాళ ధ్వనులతో మారు మ్రోగి పోయింది. తరవాత మరి కొన్ని సభా మర్యాదల అనంతరం వేదికపై కూర్చున్న ప్రముఖులంతా కిందికి దిగివచ్చి ముందు సీట్లలో కూర్చున్నారు. తెరపడింది. తరువాత విశ్వవిఖ్యాత నర్తకి కుమారి ప్రతిభ భరతనాట్య ప్రదర్శనం ప్రారంభం కాబోతుందని, ఆ ప్రదర్శనలో ఈ ముఖ్యాంశాలు ఉంటాయని ఒకరు తెలుగులో, హిందిలో, ఆంగ్లంలో కూడా చెప్పారు. ఆ తరువాత కొన్ని క్షణాలకు థియేటరులోని దీపాలన్నీ ఆరిపోయాయి. తెర సున్నితంగా తెరచుకుని రెండు వైపులకూ జరిగి పోయింది. తెరపై ఒక్కసారిగా వేనకు వేల కొవ్వొత్తుల కాంతులతో ప్రకాశించే విద్యుద్దీపాలు వెలిగాయి. వేదికపై ఒక నర్తకి అంజలి ఘటిస్తూ నిలబడి ఉంది. ఆమెకు వెనుక భాగంలో నటరాజస్వామి చిత్రం గల తెర నేపథ్యంగా అమర్చారు. ఆ నర్తకి స్వామికి పుష్పాంజలి ఘటించింది. అనంతరం రెండు చేతులలోనికి రెండు దీపశిఖలు గల పొడవైన సెమ్మెలను తీసికున్నది. వానితో స్వామికి హారతినిచ్చే దీప నృత్యం అభినయించింది. అది చూచి అంతా ముగ్ధులై పోయారు. కరతాళ ధ్వనులతో థియేటర్ మారు మ్రోగి పోయింది.

"ప్రతిభ గొప్పగా నర్తిస్తుందని వినటమేగాని ఇదివరకు చూడలేదు. నిజంగా ఈ దీపనృత్యంలో ఆమెకు ఆమెయే సాటి" అని ఒకరు తన ప్రక్కవారితో ప్రశంశాపూర్వకంగా అంటున్నారు. దీప నృత్యం సాగుతున్నంత వరకూ యిలాగే సభికులనుండి రాసాగాయి. దీప నృత్యం అనంతరం, "ఇప్పటి వరకూ దీప నృత్యాన్ని అభినయించిన వారు కుమారి ప్రతిభ యొక్క శిష్యురాలు, కుమారి సుధారాణి", అని మైకులో చెప్పారు. అది విని కొత్త ప్రేక్షకులు ఆశ్చర్య చకితులైనారు.

"ఓహో! ఇప్పటి వరకూ ఈమే ప్రతిభని భ్రమించామె. ఈమె నృత్యమే యింత బాగుంటే యిక ఆమె నృత్య మెంత మధురంగా ఉంటుందో" అంటూ లొట్టలు వేయసాగారు. ప్రతిభ నృత్యాన్ని లోగడ చూచిన వారు కొందరక్కడ లేకపోలేదు. వారు మాత్రం వీరి అజ్ఞతకు పైకి కనపడకుండా చిరునవ్వు నవ్వుకున్నారు. తెరపడి థియేటర్లో లైట్లు వెలిగాయి. ప్రేక్షకులంతా ప్రశాంత డోలికలలో ఓలలాడు తున్నారు. చమత్కారాలతో, ప్రశంసా వాక్యాలతో ఆడిటోరియం మొత్తం నిండి పోయింది. ఎటు చూచినా కలకలా రావాలే! టూత్‌పేస్టు అమ్మకపు ప్రకటన ముఖాలే! ముచ్చట ముదుల నారిమణులు, ఎత్తు కొప్పుల వారూ, నడి కొప్పుల వారూ, గుర్రపు జూలువారూ, నితంబచుంబిత కేశకలు, రకరకాల అలంకరణలు ఎన్నో ముఖాలు ముఖానికొక నోరు, నోటికొక ప్రశంస.

థియేటర్లో మళ్లీ లైట్లు ఆరిపోయాయి. తెర తెరుచుకుంది. యిప్పుడు వేదికపై సాక్షాత్తు ప్రతిభ నిలబడింది. ఆమె గులాబీ రంగు దుస్తును ధరించింది. తదనుగుణంగానే సంపూర్ణ ఆహార్యమూ, భూషాలంకరణములూ అలంకరించు కున్నది. ప్రతిభ ఎవరి చేతనూ మేకప్ చేయించుకోదట. తన మేకప్ తనే చేసి కుంటుంది. కేవలం సుధారాణి సహాయం చేస్తుందని అంటారు.

ప్రతిభ సన్నగా, పొడుగ్గా, నల్ల కలువలా నిలబడి ఉంది. ఆమె కన్నులు మిక్కిలి విశాలమైనవి. సహజ కాంతి విస్ఫారిత మైనవి. సృష్టిలోని సకల భావ ప్రకటనా సామర్థ్యాన్ని కలిగినవి. ఆమె కనుబొమ్మలు నేత్ర దేవతకు పైన నిలిపిన కీర్తి కిరీటాల వలె ఉన్నాయి. ఆమె శిరస్సు ఒక రాజ గోపురం వలెనూ ఆమె ముఖం అందలి అధిష్ఠాన దేవత వలెనూ, వక్షస్థలం దేవాలయ ప్రాంగణంలో నిలిపిన గజకుంభ స్థలాల వలెను, చేతులు ఆలయ ప్రాకారం వలెనూ, పాదములు ఆలయ సోపాన పంక్తి వలెనూ ప్రకాశిస్తున్నాయి.

ప్రతిభ నృత్య ప్రదర్శన ప్రారంభమైంది. అలరింపు జతి స్వరం, మండూక శబ్దం, తిల్లానా, గీత గోవింద అభినయం. తరవాత అన్నమాచార్య కీర్తనకు అభినయం సాగుతున్నాయి.

"కులుకక నడువరు కొమ్మలాల
జలజల రాలేను జాజులు మాయమ్మవి"

ఇది అన్నమాచార్య కీర్తన. మహాభక్తుడైన అన్నమాచార్యులు తన భావనా బలంతో అలివేలు మంగాదేవిని ఈ కీర్తనలో ఊహించు కుంటున్నాడు. తల్లిని చెలికత్తెలు పల్లకిలో మోస్తున్నారు. అయితే వారు కులుకుతూ అటూ ఇటూ నడిస్తే అమ్మవారి తలలోని జాజులు ఆ కుదుపులకు పల్లకిలోనికి రాల్తాయనే భయంతో ఈ భక్త కవి చెలికత్తెలను మృదువుగా నడువ వలసిందిగా అర్థించటం ఈ గీతంలోని భావం.

దీనికి ప్రతిభ పట్టిన అభినయం చూచి పారిషదులంతా శిలా ప్రతిమల వలె, కుడ్య చిత్రాల వలె, కాగితపు చిత్తరువుల వలె మారిపోయారు. అందరి కళ్లలో రసప్లావితములవుతున్నవి. దాదాపు ఆడిటోరియంలోని ప్రేక్షకులంతా బాహ్యస్మృతిని కోల్పోయి ప్రతిభ నర్తనంతో తాదాత్మ్యం చెంది ఉన్నారు.

అలా చెందని వ్యక్తి ఆ థియేటర్‌లో ఒక్కడే ఉన్నాడు.

అతని పేరు భవభూతి.

అతను మాత్రం ఆమె నృత్యాన్ని కేవలం ఆసక్తితో పరిశీలిస్తున్నాడు. కాని నృత్యంలో తన్మయుడు కాలేదు. మరి కొంతసేపటికి నృత్య ప్రదర్శన ముగిసింది. మోహినీ భస్మాసురలోని కథా భాగాన్ని తీసికుని తానే మోహినిగా, తానే శివునిగా, తానే భస్మాసురునిగా నృత్యంలోనే నాటకీయతను ప్రదర్శించింది ప్రతిభ. దానితో ప్రదర్శన జగన్మోహనంగా ముగిసింది.

ఇంక చెప్పే దేముం ది. ఆటో గ్రాఫుల వేట మొదలైంది. ఒకటే జన ప్రవాహం. జన వర్షం! ప్రశంసా కు వృష్టి!

ప్రతిభ సగర్వంగా, ఓపికగా, విలాసంగా ఒక విచిత్రమైన హొయలతో నిలబడి ఒంపు సొంపులను ఒలికిస్తూ సంతకాలు చేస్తున్నది. అలా వరుసగా చేస్తూ అందరి ప్రశంసను రెండు చేతులతోనూ, రెండు కన్నులతోనూ అందుకుంటూ ఒక్కొక్కరినీ సాగనంపు తున్నది.

"మీ నృత్యం బాగుంది" ఒక ప్రశంసా వాక్యం.

విశేషణాలు లేని ఈ బాగుంది అనే సాదా వాక్యం ఆమెకు రుచించ లేదు. అలవాటు ప్రకారం ఆటో గ్రాఫు యివ్వడానికి పుస్తకం యిమ్మంటూ ఎడమ చేతిని ముందుకు చాచింది.

కాని, ఈ "బాగుంది" చేతిలో ఆటోగ్రాఫు పుస్తకం లేదు.

ఆమె తలపైకెత్తి చూచింది.

అతడు భవభూతి

"నేను మీతో కొంచెం సేపు మాట్లాడ వచ్చునా?"

భవభూతి ప్రశ్నకు ఆమె బదులు చెప్పకుండా మిగిలిన వారికి ఆటోగ్రాఫులు ఇస్తున్నది.

కాని ఆమె గొప్ప అభినేత్రి! అందువల్ల ఆమె కనుబొమ్మల భాషను భవభూతి భావాల కిందకి అనునయించు కున్నాడు ఆ భావాలలో కొంచెం చిరాకు, మరి కొంచెం పరాకు, కాసంత గర్వం, కన్పడీ కన్పడని అసహనం భవభూతికి గోచరించాయి

"ఆటోగ్రాఫులు యివ్వడానికే తీరికలేని నాకు ఒక ప్రేక్షకునితో మాట్లాడేందుకు కూడా సమయం ఉంటుందని భ్రమిస్తున్నావా మహాశయా" అన్నట్టు ఒక భావవిలాసం

ప్రతిభ ప్రశంసా సౌగంధ్యంతో వాతావరణ మంతా మత్తెక్కి ఉంది.

భవభూతి వెనుదిరిగి వెళ్ళి పోయాడు.

ఆమె కళా సౌందర్యానికి కైవారాలు పలికే భక్తులు, వంది మాగధులు ఒక్కొక్కరే నిష్క్రమించ సాగారు

ముఖ్య అతిథి, ఇతర పురప్రముఖులు నిష్క్రమించారు ప్రతిభ మేకప్ రూములోనికి వెళ్ళి వేష భూషలను సవరించింది ముఖానికి కొబ్బరి నూనె రాసుకుని మృదువైన వస్త్రంతో తుడుచుకుంది.

"అమ్మా! బయట కారు సిద్ధంగా ఉంది", స్థానిక సంస్థ కార్యదర్శి విన్నపం.

సుధారాణి దుస్తులన్నీ సర్దింది ఇరువురూ మేకప్ రూము నుండి బయటకు వచ్చారు. ఇంకా అక్కడ ప్రతిభను దర్శించుకోవాలనే తపనతో అక్కడక్కడా నిలబడ్డారు. ప్రతిభ కారు వద్దకు రాగానే మళ్ళీ వారంతా కారు చుట్టూ గుమిగూడారు. అందరూ మళ్ళీ ప్రతిభకు ప్రశంసా పూర్వకమైన అభివందనాలు చేసారు. ఆమె వాటినన్నిటిని స్వీకరించి, తిరిగి నాటకీయంగా రెండు చేతులూ జోడించి, కారులో కూర్చొంది. ఆమెతో సుధారాణి కూడా కూర్చొంది

కారు ముందుకు సాగి పోయింది

రవీంద్ర భారతి ప్రధాన ద్వారం వద్ద, అవతల రోడ్డు మీద సర్దార్ పటేల్ విగ్రహం సమీపంలోనూ ప్రతిభ కళా ప్రదర్శన ప్రశంసిస్తూ అలంకరించిన సుస్వాగతం అనే బానర్స్ చూస్తూ ప్రతిభ సాగిపోయింది

ఆమెను సికిందరాబాదులో ఒక ఫైవ్‌స్టార్ హోటలులో ఉంచారు.

అభిమానుల బారి నుంచి ఆమెను కాపాడే నిమిత్తం ఆమె బసను కార్యకర్తలు ఎవ్వరికి తెలియకుండా రహస్యంగా ఉంచారు ప్రతిభ హోటలులో తన గదికి చేరుకుంది

కళాసంస్థ కార్యకర్త ఒకరు ఆమెకు రావలసిన డబ్బు, మర్నాడు బెంగుళూరుకు వెళ్ళవలసిన విమానం టిక్కెట్టు ఇచ్చి తిరిగి రేపు ఉదయం విమానం వేళకు వచ్చి దర్శించుకుంటానని చెప్పి వెళ్ళిపోయాడు

"నట్టువాంగము వారికిబస వేరే హాలులో ఏర్పాటుచేయటం ఎందుకు? ఇక్కడే అయితే సౌకర్యంగా ఉండేది కదా!" అన్నది సుధారాణి.

ప్రతిభ ఏమి మాట్లాడలేదు. లోపలికి వెళ్ళి వేడినీళ్ళతో స్నానం చేసింది. ఈ లోపల వేడి వేడి ఆహారపదార్ధాలు వచ్చాయి సుధారాణి కడుపునిండా భోయనం చేసింది ప్రతిభ మాత్రం రెండు రొట్టెలు తీసికుంది.

సుధారాణి నిద్రపోయింది

ప్రతిభ ఏకాంతంగా గదిలో పచార్లు చేస్తూంది. ముందుకు వెళ్ళి గాజు కిటికీ తలుపులు తెరిచింది కిటికీ చువ్వల మధ్యలో నుండి వెండి వెన్నెలకాంతులతో తడిసిన ఆకాశం స్పష్టంగా కన్పిస్తున్నది. గదిలో చల్లని గాలులు ప్రసరించాయి

చంద్రుడు నీలాకాశమనే సరోవరంలో పడేసిన రజిత పాత్రలా కన్పడుతున్నాడు

అర్ధరాత్రి పన్నెండు గంటలు దాటింది.

నగరమంతా దాదాపు నిద్రపోయింది ప్రతిభ మాత్రం అలా కిటికీ చువ్వలు పట్టుకుని ఆకాశం వంక నిర్నిమిషంగా చూస్తూ ఉంది

ఇందాకటి సన్మానాలు, చప్పట్లు, ప్రశంసా వాక్యాలు, ఆటోగ్రాఫులు, వందిమాగధుల కైవారాలు అన్నీ ఆమె కళ్ళ ముందూ లీలామాత్రంగా తిరుగుతున్నాయి

ప్రతిభ నిట్టూర్చింది గట్టిగా.

ఆమెకు తెలియకుండానే ఆమె రెండు కన్నుల నుండి రెండు నీటి బిందువులు నునుపైన ఆమె కపోలాలు స్పృశించి జారి కింద పడ్డాయి.

'జీవితంలో మరొక రోజు, మరొక రాత్రి గడిచిపోయాయి" అనుకున్నది ప్రతిభ స్వగతంలో ఆమె తెల్లవార్లూ అలా నిద్రలేకుండా గదిలో ఏకాంత దర్శనంలో ఉండిపోయింది

రాత్రి మాత్రమే గడిచిపోయింది

★ 2 ★

బెంగుళూరులో రవీంద్ర కళాక్షేత్రం ఉంది ఇది దాదాపు హైదరాబాదులో రవీంద్రభారతి వలె ఉంటుంది అక్కడ జరిగిన సమావేశానికి భవభూతిని ఆహ్వానించారు 'తెలుగు నాటకరంగం యొక్క క్రమవికాసం' అనే అంశం గూర్చి భవభూతి మాట్లాడాడు తెలుగులో ప్రాచీనకాలంలో నాటక సాహిత్యం లేదనటం




పొరపాటనీ, యక్షగానాలు అనబడే సంప్రదాయానికి చెందిన నాటకాలు పదహారో శతాబ్దానికి ముందే ఉన్నాయని భవభూతి చెప్పాడు కనడంలో ఉన్న యక్షగానానికి తెలుగులో ఉన్న తంజావూరు యక్షగానానికి భేద సాదృశాలను వివరించాడు.

భవభూతి చేసిన ప్రసంగం బెంగుళూరు శ్రోతలను ఎంతగానో ఆకర్షించింది. సెమినార్ పద్ధతి ననుసరించి శ్రోతలు కొందరు భవభూతిని ప్రశ్నించారు. వాటికి ఆయన సముచితమైన సమాధానాలు చెప్పాడు.

"తెలుగు నాటకరంగంలో గొప్ప నటుడెవరు?" ఒక ప్రశ్న.

"బళ్ళారి రాఘవ. స్థానం నరసింహారావు వీరిద్దరు ఆంగికానికి కాకుండా సాత్వికానికి ప్రాధాన్యత యిచ్చారు. అందువల్ల వీరు మహానటుల కిందకి వస్తున్నారు."

"సంస్కృతంలోని నాటకాలు తెలుగులో కావ్యాలుగా అనువదింపబడ్డాయట నిజమేనా?"

"అవును! సంస్కృతంలోని శాకుంతలం శృంగార శాకుంతలం అనే పేర

# ప్రతిభ

కావ్యంగా వచ్చింది అలాగే ప్రబోధ చంద్రోదయం అనే నాటకం గూడా కావ్యంగా వచ్చింది "

"ఉత్తమజాతి నర్తకి ఎలా అభినయించాలి?"

ఒక స్త్రీ కంఠస్వరం వినిపించింది.

భవభూతి ఆ దిక్కును చూచాడు

ఆ ప్రశ్న వేసింది ప్రతిభ

ఆమె ఆడిటోరియంలో కూర్చుని ఉన్నది.

అంటే, ఇంతవరకు తనుచేసిన ప్రసంగమంతా వింటూ ఉన్నదన్న మాట భవభూతికి ఉత్సాహం వచ్చింది వెంటనే యిలా చెప్పాడు



"ఉత్తమ శ్రేణికి చెందిన నర్తకి నృత్యం చేసినప్పుడు ప్రేక్షకులకు రసానందం కలుగుతుంది. ఆడిటోరియంలో కూర్చున్న ఎవరైనా ఓహో ఈ ప్రతిభ ఎంత బాగా నర్తిస్తున్నది అని అన్నట్లైతే ఆమె బాగా నర్తించటంలేదు అని అర్థం. ఎందువలనంటే నిజంగానే ఆమె బాగా నర్తిస్తున్నట్లైతే అతడు బాహ్య స్పృహను కోల్పోయి, ఆ నృత్యంలో తాదాత్మ్యం చెందుతాడు అలాకాక ఆమెను ఆమెగా, నృత్యాన్ని నృత్యంగా విడమర్చి ప్రేక్షకుడు చూస్తున్నాడు అంటే అతడు ఇంకా రసస్థితికి రాలేదని, నృత్యంలో తాదాత్మ్యం చెందలేదని అర్థం

ఇంకొక ముఖ్య విషయంకూడా ఉంది భారతదేశంలోని నృత్యాలకు, పాశ్చాత్య దేశాలలోని నృత్యాలకూ ఒక ప్రధాన భేదముంది. విదేశీ నృత్యాలలో ఎక్కువ భాగం ఆనందాన్ని ప్రవర్తింపచేయుటకు చేస్తారు. అవి చేసేవారికే కాదు, చూసేవారికి కూడా ఇంద్రియోద్రేకాన్ని కలిగిస్తుంది కాని భారతదేశంలో ప్రధానంగా ఉన్నది ఆరాధనా నృత్యాలు. వీని ప్రయోజనం ఒక్కటే. మానవుణ్ణి ఈశ్వరాభిముఖంగా నడిపించటం అతని ఇంద్రియాలను అంతర్ముఖం చెయటం ప్రేక్షకుణ్ణి రసస్థితిలోనికి తీసుకు వెళ్ళి ఆ దశలో అతనిలోని సంస్కారాల్ని వికసింప చేసి అతణ్ణి సహృదయుణ్ణి చేయటం."

ఆడిటోరియంలోని వారంతా చప్పట్లు కొట్టారు

చర్చాగోష్ఠి ముగిసిన తర్వాత వేదికపై వారంతా అభినందించారు.

"భవభూతి ఆంధ్రప్రదేశ్‌లోని హైదరాబాదుకు చెందిన గొప్ప నాటక రచయిత. ఈయన రచనలు తెలుగుదేశంలోనే కాకుండా రాష్ట్రేతరంగా కూడా ప్రదర్శించి మన్ననలను అందుకున్నాయి. ఈయన ఎంతటి రసవంతమైన రచయితయో అంతటి మంచి వక్త, విమర్శకుడు అని ఇప్పుడు సభాముఖంగా నిరూపించుకున్నారు. సంస్కృతంలో భవభూతి గొప్ప నాటకకర్త. తెలుగులో వీరు కూడా అంతటివారు. అందువలన వారికి తెలుగు పాఠకులందరూ భవభూతి అనే బిరుదనామం ఇచ్చారు. తల్లిదండ్రులు పెట్టిన పేరు ప్రజలు మర్చిపోయారు. ఇదే వారికి స్థిరపడిపోయింది. వీరు బెంగుళూరుకు రావడం నిజంగా మన అదృష్టం". ఇలా సాగింది, అధ్యక్షుని ప్రసంగం.

సభ ముగియగానే ప్రతిభ భవభూతిని సమీపించింది

"ఈమె పేరే ప్రతిభ. విశ్వవిఖ్యాత నర్తకిమణి. మా బెంగుళూరుకు గర్వకారణం".

ప్రతిభ దగ్గరకు రావడం చూచి అధ్యక్షుడు ఆమెను భవభూతికి లాంఛనంగా పరిచయం చేసాడు.

"నాకు తెలుసు నేను ఆమె నృత్యం హైదరాబాదు రవీంద్రభారతిలో ఇటీవలే చూచాను. ప్రదర్శన కాగానే నేను ఆమె వద్దకు వెళ్ళి నేను నా అభినందలు చెప్పాను."

"క్షమించండి. ఆనాడు నేను మిమ్మల్ని ప్రత్యేకంగా గుర్తించలేకపోయాను. మీరు యింత గొప్పవారని యిప్పుడే తెలుసుకున్నాను."

"మీ ప్రశంసకు కృతజ్ఞతలు."

"మీరు ఎప్పటి దాకా బెంగుళూరులో ఉంటారు?"

"రేపు, ఎల్లుండి ఉంటాను. తరువాత తిరిగి హైదరాబాదు వెడతాను. ఎల్లుండి సాయంత్రం బెంగుళూరు ఎక్స్‌ప్రెస్‌లో నాకు టిక్కెట్టు రిజర్వు చేసారు."

"మీకు అభ్యంతరం లేకపోతే మీరు వెళ్ళేలోగా ఒకసారి మా కళామందిరానికి రాగలరా?"

"తప్పకుండా. రేపు సాయంత్రం మీకు ఖాళీగా ఉంటుందా?"

"అలాగే. సాయంత్రం మూడు నుండి అయిదు వరకు తీరిక ఉంటుంది. 5 నుండి 7 వరకు సాధన నడుస్తుంది. ఆ తరువాత మళ్ళీ తీరిక ఉంటుంది. మీకు ఎప్పుడు వీలుగా ఉంటే అప్పుడు రావచ్చు." అని బెంగుళూరులోని గవిపురం రోడ్డు కెంపెగౌడ నగర్‌లో ఉన్న తన కళామందిరం అడ్రసు ఇచ్చింది.

భవభూతి ఆ రాత్రి విశ్రమించాడు.

(ఇంకా ఉంది)

# సుభాషితాలు

కాకః కృష్ణః పికః కృష్ణః
కో భేదః పికకాకయోః?
వసంతకాలే సంప్రాప్తే
కాకః కాకః పికః పికః




కాకి నలుపే, కోయిల కూడా నలుపే. మరి కోయిలకు కాకికి భేదమేమిటి? వసంతఋతువు వచ్చిందంటే కాకి కాకే, కోయిల కోయిలే.

(కాకి, కోయిల రంగులో నొకటిగా యున్నప్పటికీ వసంతం వచ్చి కోయిల కంఠం విప్పేసరికి కాకి వేరుపడిపోతుందని భావం - మనుష్యులలో నూ ఇలాగే గొప్పతనం సమయంలో తెలియవస్తుంది.)

వజ్రాదపి కఠోరాణి
మృదూని కుసుమాదపి
సతాం భవంతి చేతాంసి
కో హి విజ్ఞాతు మర్హతి




సత్పురుషులయొక్క మనస్సు వజ్రానికంటే కఠినమైనది. పూవుకంటే మృదువైనది. దీని నెవరు గ్రహింప సమర్థులు?

(సత్పురుషుల మనస్సు ఒక తరుణంలో (దుష్ట శిక్షణలో) మిక్కిలి కఠినంగానూ, మరియొక తరుణంలో (శిష్ట రక్షణలో) మరీ మృదువు గానూ మారిపోతుందని భావం.)

–ఆయుర్వేద శిరోమణి రాజ రాజేశ్వర శర్మ.

'జయం మనదే'లో కృష్ణ, శ్రీదేవి



# సినిమా విశేషాలు

-జి. వి. జి.

## హీరో కృష్ణ కథ, స్క్రీన్‌ప్లే, కూర్పు, నిర్మాణం, దర్శకత్వంలో తెలుగు, హిందీ భాషల్లో "సింహాసనం" 70 ఎం. ఎం. చిత్రం

"జూలై 19న బొంబాయిలో స్టీరియో ఫోనిక్ సౌండ్ సిస్టమ్ లో పాటల రికార్డింగ్ ప్రారంభించాం. ఆగస్టు నుంచి పద్మాలయ స్టూడియోలో ఒకే సారి రెండు చిత్రాల షూటింగ్ జరుగుతుంది," అన్నారు హీరో కృష్ణ. ఈయన తెలుగులో మొట్టమొదటి స్కోప్ చిత్రం " అల్లూరి సీతారామరాజు"ని రూపొందించారు తొలి 70 ఎం. ఎం. చిత్రాన్ని నిర్మించే ఘనత కూడా ఈయనకే దక్కుతుంది. తెలుగు వెర్షన్‌లో కృష్ణ (ద్విపాత్రలు) , జయప్రద, రాధ, మందాకిని, వహీదా రెహమాన్, గుమ్మడి, సత్యనారాయణ, బాలయ్య, ప్రభాకరరెడ్డి, కాంతారావు, గిరిబాబు, రాజ్‌వర్మ పాత్రధారులు. మహారథి సంభాషణలు, బప్పీలహరి సంగీతం, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయ, భాస్కరరాజు శిల్పం తెరవెనుక హంగులు. హిందీ "సింహాసన్"లో జితేంద్ర, జయప్రద, రాధ, మందాకిని, వహీదారెహమాన్ ఆదిగా గల వారుంటారు. భారీ ఎత్తున రూపొందే ఈ సంచలనాత్మక చిత్రానికి జి హనుమంతరావు, జి. ఆదిశేషగిరిరావు నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు.

## ఆగస్టు 9న "చిటపట చినుకులు-2"

"గొల్లపూడికి రేసుల పిచ్చి. రమా ప్రభకు సినిమా పిచ్చి. ఈ నూతన దంపతుల జీవితం సాఫీగా సాగేందుకు ఉత్సాహాన్ని కలిగించే గుళికలు తయారు చేసే నాటు వైద్యుడు పద్మనాభం. కడుపుబ్బ నవ్వించే ఈ పాత్రల చుట్టూ కథ తిరుగుతూ మధ్య మధ్య టి. వి. లో కనిపించే మా జగపతి సంస్థ పాత చిత్రాల నుంచి 14 పాటలు, ఫైట్స్ వగైరాలతో 'చిటపట చినుకులు-2' ను మరింత ఆకర్షణీయంగా రూపొందించాం. దీన్ని ఆగస్టు 9న విడుదల చేస్తున్నాం," అన్నారు దర్శక నిర్మాత వి. బి. రాజేంద్ర ప్రసాద్ పాలవాక్కం సముద్ర తీరంలో ని అందమైన జగపతి గెస్ట్ హౌస్‌లో గొల్లపూడి మారుతీరావు సంభాషణలు, నవకాంత్ ఛాయ, ఎ. సంజీవి కూర్పు తెరవెనుక హంగులు. "చిటపట చినుకులు-1" విజయవంతంగా ప్రదర్శింపబడిన విషయం అందరికీ తెలిసిందే.

## మాదాల, ధవళ సత్యం కాంబినేషన్‌లో రచయిత శ్రీకాంత్ చిత్రం

"లోగడ చాలామంది నా 'దేవుళ్ళారా మీ పేరేమిటి?' విశాలాంధ్ర నవలల పోటీలో ప్రథమ

బహుమతి పొందిన నవలను తెరకెక్కించాలనుకున్నారు. అభ్యుదయ సూత్రాలు బాక్సాఫీస్ వద్ద ఏమౌతాయోనన్న సందేహంతోనో, లేక మసాలా చిత్రాల తాకిడికి తట్టుకోలేదనే భయంతోనో ముందుకు సాగలేదు. చివరికి నేనే విప్లవ నటుడు మాదాల రంగారావును నాయకుడుగా, అభ్యుదయ దర్శకుడు ధవళ సత్యం దర్శకత్వంలో నిర్మించడానికి సన్నాహాలు పూర్తి చేశాను సమకాలీన సామాజిక సమస్యలను, వాటి లోతుపాతులను చర్చించే ఈ చిత్రానికి తాతినేని చలపతిరావు సంగీత దర్శకత్వంలో మూడు పాటలను రికార్డ్ చేశాను," అన్నారు శ్రీకాంత్ ఈయన జన చైతన్య ఆర్ట్ పిక్చర్స్ పతాకంలో నిర్మించే తొలి చిత్రంలో ప్రభాకరరెడ్డి, గుమ్మడి, గిరిబాబు, వీరభద్రరావు, ఎం.పి ప్రసాద్ ఆదిగాగలవారు పాల్గొంటారు. మాటలను బొల్లిముంత శివరామకృష్ణ, శ్రీకాంత్ రాశారు. ఆర్. రామారావు ఛాయాగ్రాహకుడు. అంకిరెడ్డి సంకలనకర్త.

## శోభన్‌బాబు "శ్రీవారు"

"జూలై 22 నుండి 27 వరకు రెండవ షెడ్యూల్ పూర్తి చేశాం ఆగస్ట్ 21 నుండి సెప్టెంబర్ 5వరకు జరిగే తదుపరి షెడ్యూల్‌తో మొత్తం షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు కె వి. వి సత్యనారాయణ ఈయన సమర్పించే రాఘవేంద్ర సినీ క్రియేషన్స్ "శ్రీవారు" చిత్రంలో శోభన్‌బాబు, విజయశాంతి, చంద్రమోహన్, అశ్వని, బాలాజీ, గొల్లపూడి, ప్రభాకరరెడ్డి, రమణమూర్తి, రాళ్ళపల్లి, మాస్టర్ అర్జున్, ఎస్. వరలక్ష్మి, అత్తిలి లక్ష్మి వగైరా తారాగణం గొల్లపూడి సంభాషణలు, కె వి మహదేవన్ సంగీతం, పి చెంగయ్య ఛాయ, కళాధర్ శిల్పం, కె రామ్‌సూరి సహ దర్శకత్వం, కె సత్యం కూర్పుతో బి భాస్కరరావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే ఈ చిత్రానికి ఆసం గోపాలకృష్ణారెడ్డి, కందేపి సత్యనారాయణ నిర్మాతలు

## "ఈ సమాజం మాకొద్దు"

'కలిసి మెలిసి తిరిగినందువల్ల గిరిజనుల స్థితిగతుల గురించి నాకు 18 ఏళ్ళుగా తెలుసు అటవీ ప్రాంతాలలోని గిరిజనాభివృద్ధికి ప్రభుత్వం ఎన్నో వసతులు కల్పించి, ఎన్నో పథకాలు రూపొందించి, వివిధ సహాయ కార్యక్రమాలను చేబడూ, అమలు పరుస్తోంది. కానీ, ఈ గిరిజనులు నాగరికతా సమాజంలోకి వస్తే నష్టపోయేది దళారీలు ఈ దళారీలకు అటవీ సంపదను తెచ్చే వాళ్ళుండరు గనుక ఈ దళారీలు గిరిజనులకు ప్రభుత్వ సహాయ కార్యక్రమాలు అందనీయడం లేదు ఎన్నో కష్టాలకు గురి చేస్తున్నారు వీళ్ళ దోపిడికి తట్టుకోలేక 'ఈ సమాజం మాకొద్దు' అనే నిస్పృహతో గిరిజనులు తిరిగి అడవుల్లోకి వెళ్ళి కూపస్థ మండూకాల్లా జీవించక తప్పడం లేదు. ఈ చిత్రంలో నాయకులైన సంజీవి, రాంప్రసాద్ మా అబ్బాయిలు నాటకానుభవం గలవారు అందుకే పట్టభద్రులయ్యాక ఈ సినిమా రంగంలో ప్రవేశపెడుతున్నాను లెక్చరర్‌గా పని చేసే మా అమ్మాయి జ్యోతి కూడా ఒక చక్కని పాత్రను నిర్వహించింది నేను కూడా ఒక ముఖ్యమైన పాత్రను

"శ్రీవారు"లో శోభన్‌బాబు, విజయశాంతి



"వందేమాతరం"లో డా. రాజశేఖర్, విజయశాంతి

పోషించాను. ఈ చిత్రమంతా రాజమండ్రి, మారేడుమిల్లి పరిసరాలలో షూట్ చేయబడింది." అని తెలియజేశారు కథ సమకూర్చి నిర్మించిన జె.ఎస్.ఆర్. పరిమళరావు. ఈ చిత్రంలో ఇంకా షావుకారు జానకి, మనోచిత్ర, వనితశ్రీ, కాకరాల, త్యాగరాజు, గోకిన రామారావు, పినిశెట్టి హనుమంతరావు, వరదా బ్రహ్మానందం, ఉదయ్, రాజగోపాల్, రంగా, ఎబ్నైజర్‌తో పాటు కొందరు రంగస్థల కళాకారులు పాల్గొన్నారు. మోదకూరి సంభాషణలు, రమేష్ నాయుడు సంగీతం, విజయ్ ఛాయ, రామారావు సహకార దర్శకత్వం, రాంప్రసాద్ నిర్వహణలో డాక్టర్ విమలాదేవి సమర్పించే ఈ చిత్రానికి జి. రాజ్‌కుమార్ దర్శకుడు. పరిమళరావు పిక్చర్స్ వారి తదుపరి చిత్రం "సీతమ్మ-రామయ్య."

తీసు్తన్నది బూతు సినిమా లేక మామూలు చిత్రమా అని సందేహపడుతున్నారు నిర్మాతగారు!



## టి. కృష్ణ దర్శకత్వంలో వై. హరికృష్ణ సమర్పించే "వందేమాతరం" షూటింగ్ ముగింపు

"దేశానికి వెన్నెముక వంటిది గ్రామం. కాని, నేటి గ్రామాలు కుటిల రాజకీయాలతో కలుషితమైపోయాయి. ఇలాంటి పరిస్థితుల్లో యువకుల కర్తవ్యమేమిటి – అని ప్రబోధించే చిత్రం. జూన్ 26 నుంచి జులై 7 వరకు గుంటూరు దగ్గర అమినాబాద్‌లో చివరి షెడ్యూల్ పూర్తి చేశాం," అన్నారు కృష్ణ చిత్రవారి "వందేమాతరం" చిత్రానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించిన టి. కృష్ణ. "దేవాలయం" వంటి ఉత్కృష్టమైన చిత్రాన్ని అందించిన వై. హరికృష్ణ సమర్పించే మరో ప్రతిష్టాత్మక చిత్రమిది. ఇందులో విజయశాంతి, డాక్టర్ రాజశేఖర్, పి. ఎల్. నారాయణ, వేలు, నర్రా, రాజేంద్రప్రసాద్, నిర్మల ముఖ్య భూమికలు నిర్వహించారు. వి. ఎస్. కామేశ్వరరావు రచయిత. చక్రవర్తి స్వరకల్పనలో సి. నారాయణరెడ్డి, దాసం గోపాలకృష్ణ, అదృష్ట దీపక్ గీతాలు రాశారు. ఆర్ట్. రామారావు, ఛాయ, ఉల్చి శిల్పం, ముత్యాల సుబ్బయ్య సహ దర్శకత్వం, చౌదుల సుబ్బారావు కూర్పు, నరసింహారావు సహకార దర్శకత్వంతో టి. సదాశివరావు ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్. వై. అనిల్‌బాబు నిర్మాత.

# హిందీ చిత్ర విశేషాలు

● 'ఊంచే లోగ్' చిత్రం పతాక సన్నివేశాల కోసం బొంబాయి నుంచి ఒక నల్లటి గుర్రాన్ని ఊటీకి తీసుకెళ్లారు నిర్మాతలు కొంత షూటింగ్ జరిగాక ప్రమాదవశాత్తూ ఆ గుర్రం కాళ్ళకు బలమైన గాయాలు తగిలాయి అలాంటి వేరే నల్లటి గుర్రం కోసం ఊటీ అంతా గాలించినా దొరక లేదు బొంబాయి నుంచి ఇంకో గుర్రాన్ని పిలిపించాలంటే చాలా టయిమ్ పడుతుంది చివరికి అలాంటిదే ఒక గుర్రం దొరికింది గాని దాని రంగు నలుపు కాదు గత్యంతరం లేక నల్లటి బూట్ పాలిష్‌తో ఆ గుర్రాన్ని నల్లగా మార్చారు అలా మార్చటానికి రోజుకి 160 టిన్నుల పాలిష్ కావలసి వచ్చింది అయిదవ రోజున ఊటీలో ఏ కొట్టులోనూ నల్ల పాలిష్ డబ్బా మిగలక పోయేసరికి హుటాహుటిగా బెంగళూరు నుంచి 320 డబ్బాలు తెప్పించి, మిగతా రెండు రోజుల షూటింగ్‌ను పూర్తి చెయగలిగారట

● రాజేష్ ఖన్నా ఒక ఘనతను సాధించాడు అదేమిటంటే- షబానా ఆజ్మీ, స్మితాపాటిల్ ఒక చిత్రంలో నటించేలా చూడటం 'అలగ్ అలగ్, అమృత్' చిత్రాల అనంతరం ఆ తారలిద్దరి మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమనేదట ఎలాగో ఒప్పించాడు రాజేష్ ఖన్నా అంతకు ముందు శ్రీదేవి, జయప్రదలు మాట్లాడుకునేలా చేసింది కూడా ఈయనేనట

● అశోక్‌ఖన్నా తొలిసారి స్వయదర్శకత్వంలో నిర్మించే 'రంగమంచ్' చిత్రం ఒక భరత నాట్య కళాకారిణి జీవితానికి సంబంధించినది ఆ 'ఊర్వశి' పాత్రను ధరించే హేమమాలిని ఆ చిత్రానికి నృత్య దర్శకురాలు కూడా ఇటీవల ఆమె గర్భవతి అవడంతో ఆ చిత్ర నిర్మాణం కుంటుపడింది.

● స్మితా పాటిల్ చిదంబరం అనే మలయాళ చిత్రంలో నటిస్తోంది ఆమె ధరిస్తున్న నాయిక పాత్ర పేరు శివకామి నాకు ఆడపిల్ల పుడితే, ఆ మలయాళ చిత్రం జ్ఞాపకార్థం 'శివకామి' పేరే పెడతాను, అంటుంది స్మితాపాటిల్

● రాజేంద్ర కుమార్, సునీల్ దత్ కలిసి మదర్ ఇండియా చిత్రంలో నటించారు ఇప్పుడు వాళ్ళ పుత్రులు కుమార్ గౌరవ్, సంజయ్ దత్ కలిసి 'నామ్' అనే మహేష్ భట్ దర్శకత్వం వహించే చిత్రంలో కలిసి నటిస్తున్నారు

● 'తేరే బినా క్యా జీనా' అనే పాకిస్తానీ హిట్ చిత్రం ఆధారంగా జె ఓంప్రకాష్, సాల్మన్ జాడ, కె.సి. బొకాడియా వంటివారు మూడు చిత్రాలు తీస్తున్నారు అలాగే డెత్ విష్, లాస్ట్ ట్రెయిన్ ఫ్రమ్ గన్ హిల్ ఆంగ్ల చిత్రాల ఆధారంగా మూడు నాలుగు హిందీ చిత్రాలు తయారవుతున్నాయి.

● ఎన్నో అవార్డులు గెలుపొందిన ఓ నటిని బుక్ చేయడానికి కలుసుకున్నాడు ఓ నిర్మాత తన వద్ద ఉన్న కథను వినిపించాడు 'ఛ-ఛ. చాలా అసహజంగా ఉంది ఎంతగా ప్రేమిస్తే మటుకు ఓ వివాహితుడ్ని పెళ్ళి చేసుకుంటుందా హీరోయిన్? నిజం జీవితంలో ఇలా జరుగుతుందా?' అని తిరస్కరించిన ఆ నటి ఆ తర్వాత వారం రోజులకే ఓ వివాహితుడ్ని పెళ్ళి చేసుకుంది ఆ నటి షబానా ఆజ్మీ ఆ వివాహితుడు రచయిత జావేద్'

-- జి.వి.జి.

"ప్రేమించు పెళ్లాడు"లో రాజేంద్రప్రసాద్, భానుప్రియ



# సినిమా

...ద్యూల్" అన్నారు బి. భాస్కరరావు. ఈయన స్క్రీన్‌ప్లే సమకూర్చి, దర్శకత్వం వహించే ఈ సంస్థ రెండవ చిత్రంలో శోభన్‌బాబు, విజయశాంతి, చంద్రమోహన్, అశ్విని, గొల్లపూడి మారుతీరావు, అత్తిలి లక్ష్మి, బాలాజీ, మాస్టర్ అర్జున్ వగైరా నటవర్గం. కె. వి. మహదేవన్ సంగీతం, చెంగయ్య ఛాయ. కళాధర్ శిల్పం, కె. సత్యం కూర్పుతో కె. ఎ. వి. సత్యనారాయణ సమర్పించే ఈ చిత్రానికి ఆనం గోపాలకృష్ణారెడ్డి, కందేపి సత్యనారాయణ నిర్మాతలు.

## గోపీకృష్ణ మూవీస్ చిత్రాలు

"...వి...లి ...వా...ని" ఘన విజయం తర్వాత హీరో

## రాఘవేంద్ర సినీ క్రియేషన్స్ 2వ చిత్రం ప్రారంభం

మధ్యతరగతికి చెందిన యువకుడు, సంపన్నుల కుటుంబానికి చెందిన యువతి ... వీరి ప్రేమ ఫలించి, పెద్దల అంగీకారంతోనే పెళ్లి జరుగుతుంది. ఆ తర్వాత వీళ్ళ వ్యక్తిత్వాలకు సంబంధించిన భేదాభిప్రాయాలు ... దాంతో కథ ఎన్నో మలుపులు తిరుగుతుంది. పక్కా ఫామిలీ సెంటిమెంట్. ఈ చిత్రంలో రెండు విశేషాలున్నాయి.

శోభన్‌బాబుగారి చిత్రాన్ని నేను డైరెక్ట్ చెయ్యడం ఇది తొలిసారి. చాలా కాలం తరువాత కేరెక్టర్ ఆర్టిస్ట్ గొల్లపూడి మారుతీరావు సంభాషణలు సమకూర్చి చిత్రమిది. జూన్ 21 నుంచి జూలై 10 వరకు మొదటి షెడ్యూల్ జరిగింది. జూలై 20 నుంచి 27 వరకు రెండవ షెడ్యూల్, ఆగస్టు 21 నుంచి 25 వరకు ఆఖరి

"కుటుంబ బంధం"లో రాజేష్, భానుప్రియ



ఇటీవల నెల్లూరులో జరిగిన నెఫ్జా నాటకోత్సవాలను ప్రారంభిస్తున్న సినీ దర్శకులు శ్రీ జంధ్యాల.నెఫ్జా సుందరరామిరెడ్డి బహుమతి ప్రదానోత్సవ సభలో పాల్గొన్న నిర్మాత డా. తిరుపతిరెడ్డి, నటి సుమలతలని చిత్రంలో చూడవచ్చు.



కృష్ణంరాజు, నిర్మాత యు. సూర్యనారాయణరాజుల బాధ్యత మరింత పెరిగింది. అంతకన్నా భారీగా, విశిష్టమైన రీతిలో రెండు చిత్రాలను ప్లాన్ చేసినట్లు కృష్ణంరాజు చెప్పారు. త్వరలో సెట్స్‌కు వెళ్లే "వీరార్జున" చిత్రానికి కొండవీటి వెంకటకవి సంభాషణలు రాస్తున్నారు. వచ్చే ఏడు "బ్రహ్మర్షి విశ్వామిత్ర" ప్రారంభమవుతుంది.

## ఎ. వి. ఎం. ప్రొడక్షన్స్ "నాగబాల"

బానర్ వాల్యూ ఉన్న సంస్థలలో ఎ. వి. ఎం. ఒకటి. ఈ బానర్‌లో ఎం. కుమరన్, కె. షణ్ముగం నిర్మించే "నాగబాల" చిత్రానికి జూలై 14న ఎ. వి. ఎం. గార్డెన్ స్టూడియోలో పూజ జరిగింది. అర్జున్, విజయశాంతి, శశికళ ఆదిగాగలవారు పాల్గొంటారు. సంగీతం చక్రవర్తి. దర్శకత్వం రామనారాయణన్ □

# డబ్బు..... డబ్బు

రోజంతా పాతరూపాయినోట్లు లెక్కపెట్టి ఒక బ్యాంక్ అధికారికి చేతిపై ఫంగస్ వ్యాపించి పుండ్లుపడ్డాయి! - వార్త

MONTE KRIS/O




















సీరియల్

# మల్లిక

యర్నగడ్డ కిశోర

(గత సంచిక తరువాయి)

లంచ్‌కి భార్గవ్‌ని రెస్టారెంట్‌కి తీసికెళ్ళాడు జిమ్. ఇద్దరూ అప్పుడప్పుడూ ఒకళ్ళనొకళ్ళని అలా ట్రీట్ చేసుకోవడం అలవాటే! కాని, ఈ రోజు మామూలుగా వెళ్ళే మెక్‌డొనల్డ్స్, పిజ్జాప్లేసుల్లాంటి ఫాస్ట్‌ఫుడ్ రెస్టారెంట్‌కి కాక టేబుల్ క్లోత్స్, క్లాత్ నాప్‌కిన్స్ వాడే ఖరీదైన రెస్టారెంట్‌కి తీసికెళ్ళాడు. కారణం– అతనికి ఏదో స్టాకులో అనుకోకుండా కలిసి రావటమే!

మనిషి చాలా వుత్సాహంగా వున్నాడు.

"భార్గవ్! ఇక బెంజ్‌కారు కొనే సమయం ఆసన్నమయ్యింది." అన్నాడు హుషారుగా.

"మరి టొయోటానేం జేస్తావ్?"

"ఇంక అదెందుకూ దిష్టి పిడతలాగా? అమ్మి పడేస్తాను."

అంతలోనే ఏదో గుర్తొచ్చినట్లు అడిగాడు, "రాత్రి మల్లికేమి చివాట్లు పెట్టలేదు కదా?"

"అసలు మాట్లాడితే గదా చివాట్లు పెట్టటానికి?"

"అయితే సైలెంట్ ట్రీట్‌మెంట్ అన్నమాట! అది అన్ని శిక్షల్లోకి ఘోరమైంది!"

"ప్చ్! మల్లిక వేరనుకున్నాను. తనూ అందరు ఆడవాళ్ళలాంటిదే జిమ్!" నిరాశగా అన్నాడు భార్గవ్.

"మరి ఇంతకాలంగా నేను చెబుతున్న దేమిటి? ప్రేమ, పెళ్ళి వగైరాలన్నీ ఒట్టి మిధ్య బడీ! ఈ పెళ్ళాలనే వాళ్ళు మొగుళ్ళ డబ్బులో, ఇంటిలో, వస్తువుల్లో, కారుల్లో భాగం పంచుకుంటారు గాని కష్టాల్లో, చికాకుల్లో కాదు! అయినా ఈ ఆడవాళ్ళెవరిక్కావాలట? మనంతట మనం బ్రతకలేకనా?" జిమ్‌కి డేట్ ఎవ్వరూ దొరకనప్పుడు అలా "ఆడవైరాగ్యం" కలుగుతుంటుంది అప్పుడప్పుడూ.

ఏదో అనబోయి ఆగిపోయాడు భార్గవ్. వాళ్ళ ప్రక్క టేబుల్ దగ్గర ఒక యంగ్ కపుల్ కూర్చొని వున్నారు. అప్పుడే వెయిటర్ వాళ్ళ ఆర్డర్ తీసుకొచ్చి టేబుల్ మీద పెట్టి వెళ్ళిపోయాడు. ఒండని పచ్చి అయిస్టర్స్ చిప్పలతో పాటే ప్లేట్‌లో నుండి స్టేర్ చేస్తున్నాయి! అవి తినటానికి ఆమె సంశయపడుతుంటే అతను ఒక్కటైనా తినమని బలవంతం చేస్తున్నాడు. ఇక తప్పక ఫోర్క్‌తో, తెరిచి వుంచిన ఒక చిప్పలో నుండి అయిస్టర్ పైకి తీసి కళ్ళు మూసుకుని నోట్లో వేసుకుంది.

"మరి అంత చెడ్డగా లేదుకదూ?" అనునయంగా అంటున్నాడతను.

ఏం చెప్పాలో తెలియక మర్యాదకు తలూపి, ప్లేట్‌లోకి చూసిందామె. అప్పటివరకూ వెగటుగా పెట్టిన ఆమె ముఖంలో అకస్మాత్తుగా చెప్పలేని ఆశ్చర్యం ద్యోతకమయ్యింది.

"మైగాడ్! వుంగరం ఈ చిప్పలోకి ఎలా వచ్చింది?"

చిప్పలోని ముత్యపుటుంగరం చేతిలోకి తీసుకుంది.

"ముత్యం వుండేది ముత్యపుచిప్పలోనే అనుకుంటాను?" అతను ఏం ఎరగనట్లు అన్నాడు.

ఆమెకు అర్థమైనట్లుంది. గబుక్కున ముందుకు వంగి అతన్ని ముద్దు పెట్టుకుంది.

ఆ దరిదాపుల్లోనే వున్న వెయిటర్ అతని వంక చూసి నవ్వాడు.

"హాపి యానివర్సరి హని!" అతను వుంగరం తొడుగుతూ అన్నాడు.

"భార్గవ్! మరి అంతలా చూడకు. న్యూసెన్స్ క్రింద "సూ" చెయ్యగలరు!" జిమ్ భుజం తట్టటంతో ఇటు తిరిగాడు భార్గవ్. అతని ముఖం పాలిపోయినట్లుంది.

"నేనొట్టి ఫూల్‌ని జిమ్! అనవసరంగా మల్లికను విసుక్కున్నాను. మొన్న మా మేరేజ్ యానివర్సరి!"

"అలాగా?" జిమ్ కూడా తెల్లముఖం వేశాడు.

* * * * * *

భార్గవ్ ఆరుగంటలకే ఇంటికి వచ్చాడు. మల్లిక కిచన్‌లో ఏదో చేస్తోంది. నేరుగా కిచన్‌లోకి వెళ్ళాడు. మాట్లాడకుండా ఆమె చెయ్యి పట్టుకుని డెన్‌లోకి తీసుకొచ్చి సోఫాలో ప్రక్కన కూర్చొబెట్టుకున్నాడు.

"అయామ్ వెరి సారి మల్లీ! యానివర్సరి సంగతే మర్చిపోయాను. నిన్నటి నా ప్రవర్తనను మన్నించగలవా?"

అతని కళ్ళల్లోకే కాస్సేపు చూసింది మల్లిక.

"యూ ఆర్ ఫర్‌గివెన్!" అంది నవ్వుతూ.

జేబులో నుండి ముత్యపుటుంగరం తీసి ఆమె వేలుకి తొడిగాడు. "తొందరగా తయారవ్వు. రెస్టారెంట్‌లో రిజర్వ్ చేశాను."

"ఇప్పుడా?" వుంగరం చూసుకుంటూ అడిగింది.

"మనస్సులో ఎప్పుడు సంతోషంగా వుంటే అప్పుడే పండగ! పదపద. ఆకలి మండిపోతోంది" తొందర చేశాడు.

మధ్యాన్నం అతను చేసినట్లుగానే, రెస్టారెంట్‌లో అయిస్టర్ చిప్పలో వుంగరం పెట్టి మల్లికను సర్‌ప్రైజ్ చేద్దామనుకున్నాడు భార్గవ్. కాని మరి కాపీ

**జరిగిన కథ–14:** భార్గవ్ అమెరికాలో ఒక చిన్న ప్రైవేటు కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాడు. భార్గవ్‌కి మల్లిక పరిచయం అయ్యింది. ఆమె ఉద్యోగంలో చేరినాక వారిద్దరు పెళ్ళి చేసుకున్నారు. వారి జీవితం సాఫీగా సాగిపోతున్నా పిల్లలు మాత్రం కలుగలేదు. అందుకై ఆ దంపతులు డాక్టర్ల చుట్టూ తిరగటం ప్రారంభించారు. వారికి పిల్లలు పుట్టక పోవడానికి కారణాన్ని ఏ డాక్టరూ చెప్పలేక పోయాడు. కానీ భార్గవ్‌కి మాత్రం తమకి తప్పక పిల్లలు పుడుతారని నమ్మకం. ఒంటరి తనంతో బాధపడుతున్న మల్లికకి చిన్ననాటి స్నేహితురాలు అంజలి తారస పడటం ఆనందాన్ని కలుగ చేసింది. పిల్లల్ని పెంపకం తీసుకునే విషయంలో తమకి ఆసక్తి లేదని డాక్టరుతో చెపుతాడు భార్గవ్. డాక్టరు మాటలు విన్నా భార్గవ్‌కి తనింట్లో చిన్నప్పుడు పాలేరుగా ఉన్న చిట్టిగాడు, వాడి పిల్లలు జ్ఞాపకం వస్తారు. చిట్టిగాడి పిల్లలకి ఏదో ఒకదారి చూపించాలనుకుంటాడు. చిట్టిగాడి భార్య చనిపోయిందని, వాడు క్షయతో బాధపడుతున్నాడని తండ్రి ఉత్తరం ద్వారా తెలుసుకున్న భార్గవ్ ఆవేదన చెందుతాడు. డేవిడ్ తన ఇంట్లో కంపెనీ తరఫున ఇచ్చే "క్రిస్‌మస్" పార్టీకి మల్లిక, భార్గవ్ వెళతారు. భార్గవ్ ఇదివరకటిలా ఉండటం లేదని స్నేహితురాలు అంజలికి చెప్పి బాధ పడుతుంది మల్లిక మల్లిక, భార్గవ్ సపోర్ట్ గ్రూపు మీటింగ్‌కి వెళతారు. లావు తగ్గడానికేగాక, లావు పెరగకుండా ఉండటానికి "హెల్త్‌స్పా"కి వెళ్ళాలనుకుంటుంది మల్లిక. మల్లిక, అంజలి కూడా "హెల్త్‌స్పా"కి వెళ్ళి వస్తున్నారు. భార్గవ్ ప్రవర్తన మల్లికకు తీరని బాధని కలుగ చేస్తోంది. వెడ్డింగ్ యానివర్సిరీ నాడు భార్గవ్ తప్పతాగి ఇంటికి రాకుండా జిమ్ అపార్ట్‌మెంటులో పడి ఉండటంతో మల్లికకు మనస్సంతా శూన్యంగా అయ్యింది. పిల్లలు లేకపోవడమే దీనికంతా కారణం అనుకుంటుందామె.

చేసినట్లవుతుందేమోనని ఆ ఆలోచన విరమించుకున్నాడు. అదిగాక, పచ్చి ఆయిస్టర్స్ తినటమనేది అంత సులభ విషయంగా తోచలేదతనికి.

10

ఆఫీసుకి దగ్గరలో వున్న చిన్న పార్కులో కూర్చున్నారు జిమ్, భార్గవ్. ఫాల్ సీజన్ అవ్వటంతో స్వెట్టరేసుకున్నా కొంచెం చలిగానే వుంది. దగ్గరలో ఎవరో ఇద్దరు ముసలివాళ్ళు చెక్క బెంచిమీద కూర్చొని పక్షులకు బ్రెడ్ ముక్కలు విసిరేస్తున్నారు.

అక్కడ నుంచి చూస్తుంటే రోడ్డుమీద జనసందోహం కనబడుతూనే వుంది. అంత మంది జనం వుండగానే ఇద్దరు సన్నంగా, పొడుగ్గా వున్న కుర్రాళ్ళు రోడ్డు ప్రక్కన పార్క్ చేసి వుంచిన ఒక కారులోని భాగాలు చకచకా వూడదీసి ప్రక్కనే డబుల్‌పార్క్ చేసి వుంచిన వేన్‌లోకి చేరవేస్తున్నారు. చూస్తుండగానే కారు బాడీతప్ప మిగిలిన పార్టులన్నీ టైర్లతో సహా మాయమయ్యాయి. ఒకసారి తృప్తిగా దానివంక చూసి, దర్జాగా వేన్‌లో ఎక్కి వెళ్ళిపోయారు వాళ్ళు.

"సాయంత్రం కారుకోసం వెదుక్కునే ఆ కారు ఆసామి ముఖం చూడాలి!" అటే చూస్తున్న జిమ్ అన్నాడు.

భార్గవ్ మాట్లాడకపోవటంతో అతనివంక చూశాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నావ్?"

"ఇవ్వాళ వచ్చిన ఆఫీసు సర్క్యులర్ చూశావా?"

"ఏ సర్క్యులర్? ఓ, స్టాక్ ఆప్షన్‌దేనా?"

"అవును. కొంటే ఎలా వుంటుందా అని ఆలోచిస్తున్నాను."

"ఇప్పటికే మన కంపెనీలో చాలా స్టాక్స్ వున్నాయి కదా? స్టాక్స్ విలువ కూడా బాగా పడిపోయింది. కంపెనీ కొంచెం కొంచంగా మునుగుతూనే వుంది తప్ప పైకి తేలే సూచనలు కనుచూపు మేరలో కనబడ్డం లేదు. మళ్ళీ కంపెనీ నిలదొక్కుకుని (అసలు నిలదొక్కుకోగలిగితే?), స్టాక్స్ విలువ పెరిగేసరికి చాలా కాలం పడుతుంది. అదిగాక వున్నదంతా ఒక కంపెనీలో పెట్టకూడదనేది స్టాక్ మార్కెట్లో ఒక రూలు! కాబట్టి ఇక మన కంపెనీ స్టాక్స్ కొనటం బుద్ధి తెలిసి తక్కువపని నా అభిప్రాయం" సిన్సియర్‌గా అన్నాడు జిమ్.

"నువ్వన్నది నిజమే. కాని ఇంకోరకంగా ఆలోచించి చూడు జిమ్! స్టాకులు బాగా తక్కువలో వున్నప్పుడు కొనాలనేది కూడా స్టాక్ మార్కెట్లో ఒక రూలేకదా? ఏదైనా మంచి విశేషం జరిగితే పదింతలు పెరుగుతాయిగాని మన స్టాకులు ఇంతకంటే తక్కువ వెళ్ళవు. నువ్వొక రూమర్ విన్నావా? మనం తయారు చేసే ప్రాడక్ట్ గురించి వినడం వల్లనో ఏమో బయటివాళ్ళకి సంబంధించిన ఒక పెద్ద కంపెనీ మన కంపెనీతో 'మెర్జ్' అవ్వాలని



# మల్లిక

ప్రయత్నిస్తోందట. అదే జరిగితే ఇక మన కంపెనీకి భయం వుండదు. పెద్ద కంపెనీతో కలియటం వల్ల స్థిరత్వం ఏర్పడుతుంది. స్టాకులు వాటంతట అవే ఆటోమేటిగ్గా పెరుగుతాయి. ఆ తర్వాత మనమా ప్రొడక్ట్స్ తయారు చెయ్యగలిగితే మన కంపెనీ బంగారు గుడ్లు పెట్టే బాతే అవుతుంది. అందుకే స్టాకులు కొనటానికి ఇదే అదునైన సమయం. ఖరీదు పెరిగినాక కొనాలన్నా కొనలేం."

భార్గవ్ చెప్పింది విని, కాస్సేపాలోచించి, తల విదిలించాడు జిమ్. "నువ్వేన్నైనా చెప్పు! నాకెందుకో ఇంకా స్టాకులు కొనే విషయం రుచించటంలేదు. నువ్వు చెప్పినదంతా మియర్ స్పెక్యులేషన్ గదా? రూమర్ల మీద ఆధారపడితే జరగొచ్చు జరక్కపోవచ్చు! జరక్కపోవటానికే ఎక్కువ అవకాశాలున్నాయి. అందులోనూ మనం మాట్లాడేది పెద్ద మొత్తం సంగతి! కంపెనీతో పాటే నువ్వూ అడుక్కి వెళ్ళగలవు. కాస్త జాగ్రత్తగా ఆలోచించు."

ఆ తర్వాత వారం రోజులూ భార్గవ్ అదే ఆలోచించాడు. నిద్రకూడా పోకుండా ఆలోచించాడు. క్రిందా మీదా పడి, ఆఖరికి కొనాలనే నిర్ణయించుకున్నాడు. కంపెనీవాళ్ళిచ్చిన స్టాక్సేగాని తను స్వంత డబ్బుతో ఇంతవరకూ తమ కంపెనీవి కొనలేదు. ఒకవేళ కంపెనీ దివాళా తీసినా ఇప్పుడు పెట్టుబడి పెట్టబోయే డబ్బే నష్టపోయేది. కాని అనుకున్నది అనుకున్నట్లయితే వచ్చే లాభం వూహించలేని విధంగా వుంటుంది. దానికి మాత్రం రిస్కు తీసుకోక తప్పదు.

ఆ నిశ్చయానికి వచ్చినాక అతని మనస్సు తేలికైంది. కాకపోతే ఒక్కటే సమస్య! భార్గవ్ దగ్గర ఇప్పుడు రెడీ క్యాష్ లేదు. వున్నదంతా పెట్టి ఆ మధ్య బంగారం కొన్నాడు. ధర తగ్గిన సమయంలో ఇప్పుడు బంగారం అమ్మటం అవివేకం.

మంచి డీల్ రావటం ఒకెత్తయితే, ఆ సమయంలో చేతిలో రెడీగా డబ్బుండటం ఇంకొక ఎత్తు! అదివరకు ఎన్నోసార్లు డబ్బులేక బంగారంలాంటి అవకాశాలెన్నో చేజారిపోతుంటే నిస్సహాయంగా చూస్తూ నిలబడవలసి వచ్చేది. ఈసారలా జరగనివ్వరాదు!

చటుక్కున అతనికొక విషయం గుర్తొచ్చింది.

అది హోమ్ ఈక్విటీ లోను!

ఇంటి డౌన్ పేమెంట్ మీద అప్పిచ్చే పథకం! ఈ మధ్య బ్యాంక్‌వాళ్ళు ఆ విషయమై పంపిన ఏదో పాంఫ్లెట్ అవసరం లేక ట్రాష్‌కాన్‌లో పడేశాడు.

భార్గవ్ వెంటనే బ్యాంక్‌కి వుత్తరం వ్రాశాడు, ఆ విషయమై అవసరమైన సమాచారం పంపమని.

ఆ రాత్రే మల్లికతో ఆ విషయం మాట్లాడాడు.

"ఇంటి మీదే గాక కార్ల మీద కూడా అప్పు తీసుకోవచ్చు. ఇంకా క్రెడిట్ కార్డులు కూడా వున్నాయి గదా? అన్నిటి మీదా షుమారు పాతిక, ముప్పైవేలు అప్పు పుట్టవచ్చు." వుత్సాహంగా చెబుతున్నాడు భార్గవ్.

వింటున్న మల్లికకు మతిపోతున్నట్లుంది. అసలే ఇంటికి నెలనెలా మోర్టగేజ్ కట్టాలి. ఇంకా దాని మీద అప్పు చేసి స్టాకులు కొనటమా? రేపేదైనా జరిగితే వున్నదంతా పోవటమే కాక ఆ అప్పులు కూడా నెత్తిన పడవూ? మళ్ళ మొదటికొచ్చినట్లే గదా? ఈ దేశం వచ్చినప్పుడు చేతిలో కనీసం రెండు సూటుకేసులన్నా వుండేవి. అప్పుడవీ వుండవు!

"వద్దు భార్గవ్! ఇప్పటికి మనకున్న సమస్యలు చాలు. ఇంకా లేనిపోని సమస్యలు తేవద్దు. కూడే కూడే జీవితాన్ని తల్లక్రిందులు చెయ్యొద్దు. వినటానికే చాలా రిస్కీగా వుంది." భయం భయంగా అంది.

నవ్వాడు భార్గవ్. "ఇంతులో నువ్వు భయపడేంత రిస్కులేదు మల్లీ! మన ఇద్దరి జీతాలతో ఈ మాత్రం అప్పు తీర్చెయ్యగలం. పోతే పాతిక ముప్పైవేలు. వస్తే మిలియన్ డాలర్లు! లాభనష్టాలలో అంత తేడా వున్నప్పుడు ఆ మాత్రం అపాయానికే జడుసుకుంటే ఎలా?"

భార్గవ్ మొండితనాన్ని చూస్తుంటే చిరెత్తుకొచ్చింది మల్లికకు. అణచివుంచిన అసహనం బైటికి తన్నుకొచ్చింది.

"ఈ డబ్బు వ్యామోహం నిన్నెందుకు పట్టుకుందో, ఎలా పట్టుకుందో నాకర్థం కావటంలేదు. మన తర్వాత అనుభవించటానికి ఎవరున్నారని నీ ఈ ఆరాటం? ఎందుకా మిలియన్లు? మనిద్దరి చితులూ పేర్చటానికా?"

భార్గవ్ ముఖంలో నవ్వు మాయమైంది. "నువ్వే వ్యామోహంతో కాన్‌గేమ్‌లో ఇరుక్కుని ఆరువేలు పోగొట్టుకున్నావో అదే వ్యామోహంతో ఈ స్టాకులు కొనాలనుకుంటున్నాను. సరా? ఇంత మాత్రం వివరణ చాలనుకుంటాను!" అనేసి అక్కడనుండి విసురుగా వెళ్ళిపోయాడు.

బాణం తగిలిన పక్షిలాగా గిలగిలలాడింది మల్లిక మనస్సు. ఎక్కడ కొట్టాలో అక్కడే కొట్టాడు! ఇన్నేళ్ళ తర్వాత మొదటిసారిగా నైట్‌మేర్ లాంటి ఆ సంఘటనని గురించి తనని అవమానిస్తున్నాడు. అన్నిటికంటే ఏ విషయం ప్రస్తావన తనని ఎక్కువ బాధిస్తుందో తెలిసే, అది కావాలనే బైటికి తెచ్చాడు. తన ఫీలింగ్సంటే అతనికిక లెక్కలేదా?

గుండెను ఎవరో ఇనప పిడికిళ్ళ మధ్య నలుపుతున్నట్లు ఒకటే బాధ! అది






విశ్వనాథ సత్యనారాయణ, దేవులపల్లి కృష్ణశాస్త్రి, వేలూరి
శివరామశాస్త్రి, చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి, శ్రీశ్రీ, తల్లావఝ్ఝల శివశంకర
శాస్త్రి, కాటూరి వెంకటేశ్వరరావు, వేదుల సత్యనారాయణశాస్త్రి,
మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, మల్లంపల్లి సోమశేఖర-
శర్మ, భావరాజు వెంకటకృష్ణారావు , రాయప్రోలు సుబ్బారావు,
పుట్టపర్తి నారాయణాచార్యులు, తిరుమల రామచంద్ర, పిలకా
గణపతిశాస్త్రి, విద్వాన్ విశ్వం, చిలకమర్తి లక్ష్మీ నరసింహం,
వేంకట పార్వతీశ్వర కవులు, శ్రీరంగం నారా
యణబాబు, గొబ్బూరు వెంకట రాఘవా

# భారతి

## సాహిత్య మాసపత్రిక

నందరావు, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ,
శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, పానుగంటి
లక్ష్మీ నరసింహారావు, శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, జి. వి.
కృష్ణారావు, కె. వి. రమణారెడ్డి, నిఖిలేశ్వర్, మల్లంపల్లి శరభయ్య,
కొత్త సత్యనారాయణ చౌదరి, జాషువ, కవి కొండల వెంకటరావు,
చిలుకూరి వీరభద్రరావు, వేలటూరి వెంకటరమణయ్య, వేదం
వెంకటరాయశాస్త్రి, వజ్ఝల కాళిదాసు, ఆర్. ఎస్. సుదర్శనం,
చలం, రాచకొండ విశ్వనాథశాస్త్రి, బలివాడ కాంతారావు, చక్రవర్తి
రాజగోపాలాచారి, చేకూరి రామారావు, తుమ్మల సీతారామ
మూర్తి, బి. జి. ఎల్. స్వామి, నిడుదవోలు వెంకటరావు, హెచ్. ఎస్.
బ్రహ్మానంద, సర్దేశాయి తిరుమలరావు, ఆరుద్ర, కవికోకిల
దువ్వూరి రామిరెడ్డి, విక్రాల శేషాచార్యులు, దాశరథి, డా. సి.
నారాయణరెడ్డి, గుంటూరు శేషేంద్రశర్మ, దుర్గాబాయి దేశ్‌ముఖ్.

GANDHI

# మల్లిక

గుండె నొప్పి. మనస్సులోని బాధ తెలియనంత విపరీతంగా వుంది

సత్తువంతా ఎవరో తోడేసినట్లు అలాగే కూర్చుండిపోయింది మల్లిక ఆమె మదిలో ఎప్పటివో అదిమి వుంచిన జ్ఞాపకాల పొరలు రెప రెప లాడసాగాయి అవి భయంకరమైనవి వాటిని కలలో కూడా తల్చుకోటానికి ఇష్టపడదు మల్లిక కాని, ఈనాడు భార్గవ్ నోట వెంట వినగానే మిట నొక్కన వాటంతో బలాగా అవన్నీ బైటికి తన్నుకు రాసాగాయి

కళ్ళు మూసుకుని వెనక్కి వాలింది

ఆ రోజు మల్లిక ఆఫసుకి శెలవు భార్గవ్ లాబ్‌కి వెళ్ళినాక ఏం తోచక షాపింగ్‌కి బైలుదేరింది.

మామూలుగానే ఆ షాపింగ్‌మాల్ జనంతో కటకటలాడుతుంటుంది ఆ రోజు చాలా ఆఫసులకి శెలవు అవ్వటంతో ఇంకా క్రిక్కిరిసి వుంది ఎన్నో కొందామని వచ్చి ఏమి కొనకుండానే వెళ్ళిపోయేవాళ్ళు, వూరికే చూద్దామని వచ్చి సంచులనిండా కొనుక్కెళ్ళే వాళ్ళు, కొన్నా కొనకపోయినా కాలక్షేపానికి వచ్చేవాళ్ళు – మాలంతా నిండిపోయారు

ఎస్కలేటర్‌లో రెండవ అంతస్తుకి వెళ్ళి, హాండ్‌బాగ్స్ సెక్షన్‌లో హాండ్‌బాగ్స్ చూస్తూ నిల్చుంది మల్లిక

'హాయ్' అన్న పలకరింపుతో తిరిగి చూసింది

కాస్త పొట్టిగా వున్న బ్లాక్ అమెరికన్ యువతి ప్రక్కన నిలబడి వుంది అటూ ఇటూ చూసి తన చేతిలో వున్న పర్సు తెరిచి చూపించింది దాని నిండా వంద డాలర్ల బిల్లులున్నాయి తనకెందుకు చూపుతున్నది అర్థంగాక ప్రశ్నార్థకంగా ఆ యువతి వైపు చూసింది మల్లిక

గొంతు బాగా తగ్గించి ఆ యువతి అంది, "షాపులోకి వస్తుంటే తలుపు దగ్గర పడి వుంది పర్సు తెరిచి చూస్తే మతిపోయినట్లయ్యింది ఏం చెయ్యాలో తెలియక ఎదురుగా నువ్వు కనబడితే నీ దగ్గరికి వచ్చాను ఏం చేద్దామంటావు?'

'పాపం, ఎవరో పోగొట్టుకుని వుంటారు సెక్యూరిటీ గార్డుకి ఇస్తే పోగొట్టుకున్నవాళ్ళు కంప్లెయిన్ చేసినప్పుడు అందజేస్తాడు " అంది మల్లిక

మల్లికకు కాస్త అవతలగా నిలబడి పర్సులు చూస్తున్న నల్లటి పొడుగుపాటమ్మాయి అందుకుంది

"అడ్డు వస్తున్నందుకు క్షమించండి! అనుకోకుండా మీ సంభాషణ వినటం తటస్థించింది సెక్యూరిటీ గార్డుకి ఇచ్చినా పోయినవాళ్ళకి అందజేస్తాడని నమ్మకంలేదు వూరికే అతనికి ఇచ్చే బదులు, దొరికింది నీకు గాబట్టి నువ్వే వుంచుకుంటె తప్పులేదని నా అభిప్రాయం ఆపైన నీ ఇష్టం!'

పొట్టిమ్మాయి కాస్సేపు ఆలోచించింది 'నువ్వన్నది నిజమే! నేనే వుంచుకుంటాను నాకు సపోర్ట్ ఇచ్చినందుకు మీ ఇద్దరికీ కూడా కొంత ఇవ్వటం న్యాయం. ఏమంటారు?"

పొడుగమ్మాయి వెంటనే "వైనాట్? డబ్బు చేదా?" అని. ప్రశ్నార్థకంగా మల్లిక వంక చూసింది

మల్లికకు ఏమనాలో అర్థంకాలేదు వెంటనే అనుకోని ఈ పరిస్థితి అయోమయంగా వుంది ఒక ప్రక్క సంతోషంగా వున్నా, ఏ మూలో పాపం ఆ పోగొట్టుకున్నదెవరో అన్న సానుభూతీ లేకపోలేదామెలో!

ఆఖరికి అనుకోకుండానే సరేనంది మల్లిక కూడా. ముందు బైటికెళ్దాం పదమని పొడుగమ్మాయి దారితీసింది ఇద్దరూ వెనక నడిచారు పొట్టిమ్మాయి, బెదురు చూపులు చూస్తూ నడుస్తుంటే, పొడుగమ్మాయి సహజంగా వుండటానికి ప్రయత్నించమని సలహా ఇచ్చింది

పొడుగమ్మాయి సలహా మీద ముగ్గురూ దగ్గరలో వున్న రెస్టారెంట్‌లోకి దారితీశారు. ఇంకా లంచ్ టైం కాకపోవడం వల్ల జనం పలచగా వున్నారు మూలగా వున్న టేబుల్ దగ్గర కూర్చున్నారు ముగ్గురూ.

వాళ్ళిద్దరూ లైట్‌గా లంచ్ ఆర్డర్ చేస్తే, మల్లిక కాఫీ మాత్రం చాలంది







వెయిట్రస్ ఆర్డర్ తీసుకుని వెళ్ళే వరకూ ఎవ్వరూ మాట్లాడలేదు

"ఇక మనం మాట్లాడొచ్చు ముందు ఒకళ్ళకొకళ్ళం పరిచయం చేసుకుందాం నా పేరు గ్లోరియా ప్రైవేట్ డ్యూటీ నర్స్‌గా పనిచేస్తుంటాను రాత్రిళ్ళు పగలంతా ఖాళీయే కదా, షాపులమ్మట తిరగటమే నా పని. ఈ రోజు మాత్రం నా అదృష్టం పండి ఆ షాపులో, ఆ సమయంలో మీ దగ్గరుండటం జరిగింది!" సంతోషంగా అంది పొడుగమ్మాయి

"నా పేరు వెరానికా ఇక్కడికి దగ్గరలోనే వున్న ఒక 'లా' ఆఫీసులో పనిచేస్తున్నాను ముగ్గురు పిల్లలు నాకు ఈ మధ్యనే డివోర్సు అయ్యింది ప్రస్తుతం ఈ డబ్బు విలువ నాకు తెలిసినంతగా మరెవ్వరికీ తెలియదేమో!" అన్నది పొట్టిమ్మాయి

ఇద్దరూ కలిసి మల్లిక వంక చూశారు

ఇక మల్లికకు పరిచయం చేసుకోక తప్పలేదు పొడిగా పేరు మాత్రం చెప్పి వూరుకుంది

నువ్వు వుద్యోగం చేస్తున్నావా? నీ భర్త ఏంజేస్తాడు? పిల్లలున్నారా? ఎక్కడ వున్నారు?" అడిగింది గ్లోరియా

ఇబ్బందిగా అనిపించింది మల్లికకు డబ్బు తీసుకుని ఎవరి దారిన వాళ్ళు పోయేదానికి ఎందుకిన్ని ప్రశ్నలు? పరాయివాళ్ళకు వివరాలేవీ చెప్పకూడదనేది ఇక్కడ అందరకూ తెల్సిన విషయమే! కాని అవసరం తనది లెక్కలేనట్లు మాట్లాడితే డబ్బివ్వం పొమ్మంటారేమో!

"ప్రస్తుతం పిల్లలు లేరు మా ఆయన ఇంజనీరు నేను వుద్యోగం చెయ్యటంలేదు మేమిక్కడికి కాస్త దగ్గరలోనే వుంటున్నాం వివరాలు కాస్త మార్చి చెప్పింది.

వెరానికా దొరికిన-పర్సుని టేబుల్ క్రిందగా వంచి తెరిచి చూచింది ఆమె ముఖంలో చెప్పలేని ఆశ్చర్యం!

"మైగాడ్! నేననుకున్న దానికంటే ఎక్కువ డబ్బే వున్నట్లుంది అన్నీ వంద డాలర్ బిల్లులే! ఏదో చీటీ కూడా వున్నట్లుంది" అంటూ చీటీ విప్పి చదవసాగింది

అందులో ఇలా వుంది – 'ఈ మధ్య తెచ్చిన షిప్‌మెంట్ తాలూకూ డబ్బు కొంత పంపుతున్నాను ఈ మధ్య పోలీసు నిఘా ఎక్కువవ్వటంతో అంతా అమ్మటం కుదరలేదు త్వరలోనే అమ్మి మిగతా డబ్బు పంపగలను' – క్రింద ఎవరిదో సంతకం వుంది

"అవినీతిగా సంపాదించిన డబ్బు ఈ విధంగా పోగొట్టుకున్నాడు, ఎవరో దురదృష్టవంతుడు! అతను పోలీస్ కంప్లైంట్ ఇవ్వటానిక్కూడా వీల్లేదు ఎవరో కష్టపడి సంపాదించిన డబ్బు పంచుకుంటున్నామని గిల్టీగా ఫీలవ్వనక్కర్లేదు మనం!" వుత్సాహంగా అంది వెరానికా

మొత్తం ఎంత వుంది? అడిగింది గ్లోరియా

"ఏమో! రెస్ట్ రూంలోకి వెళ్ళి ఎంతుందో లెక్క బెట్టి వస్తాను అని లేచి బాత్‌రూం వైపు వెళ్ళింది వెరానికా

"వెరానికా మంచి మనిషిలాగే వుంది లేకపోతే మనక్కూడా ఇవ్వాల్సిన అవసరం ఏముంది? ఈ రోజు మనిద్దరి లక్కీ డే లాగా వుంది నీకు సంతోషంగా లేదూ?' గొంతు బాగా తగ్గించి అంది గ్లోరియా

తలూపి వూరుకుంది మల్లిక

ఇంతలో వెరానికా వచ్చి కూర్చుంది ఇద్దరూ ఆమె వంక చూశారు సంభ్రమాశ్చర్యాలతో వుక్కిరిబిక్కిరి అవుతున్నట్లుంది ఆమె

నేను చెబితే మీరు నమ్మరు ఇందులో ఎంత డబ్బుందో తెలుసా? ఏభైవేల డాలర్లు!"

మల్లికకు నమ్మశక్యంగాలేదు అప్రయత్నంగా చెయ్యి గుండె మీదకు వెళ్ళింది గ్లోరియా పరిస్థితి కూడా అలాగే కనపడింది

నేను పనిచేస్తున్న ఆఫీసులో నాకొక మంచి లాయర్ ఫ్రెండున్నాడు అతని దగ్గరకు వెళ్ళి అసలు ఈ డబ్బు ఇలా పంచుకోవచ్చో లేదో అడిగివస్తాను ఏమంటారు? అడిగింది వెరానికా

అలా చెయ్యటమే మంచిది ' అంది గ్లోరియా

మల్లిక తలూపింది సమ్మతిగా

"ఇప్పుడే వస్తాను మా ఆఫీసు ఇక్కడికి చాలా దగ్గర అని వెళ్ళిపోయింది వెరానికా

వెయిట్రస్ బిల్లు తెచ్చి ఇచ్చింది గ్లోరియా తన పర్స్ తెరిచి చూసింది

'ఓ! పర్స్‌లో డబ్బు పెట్టటం మరిచిపోయాను నీ దగ్గర వుంటే ఇస్తావా మల్లికా? తర్వాత పంచుకునే డబ్బులో చూసుకుందాం అంది

మల్లిక డబ్బులు చెల్లించింది ఈ లోపల వెరానికా వచ్చింది

మా ఫ్రెండ్‌తో మాట్లాడాను ఇది బైటపడకుండా పంచుకునే విధానం తను చెబుతానన్నాడు ఇప్పుడు అతని దగ్గరకు వెళ్ళాలి మనం నేను అతనికి బాగా తెలుసు మీరిద్దరూ కూడా డబ్బు బైట పడకుండా జాగ్రత్తగా వాడుకోగలరని అతనికి నమ్మకం కలిగిస్తే డబ్బు తనే పంచి ముందు ముందు ఏ ఆటంకాలూ లేకుండా వుండేలా చేస్తానన్నాడు అలా మీకిష్టమేనా?' అడిగింది వెరానికా

"ష్యూర్! అంతకంటే మనకేం గావాలి? అదిసరే, మా ఇద్దరికీ ఎంత ఇద్దామనుకుంటున్నావు? అడిగింది గ్లోరియా

'అది కూడా మా ఫ్రెండ్‌తో ఆలోచించాను మీ ఇద్దరికీ చెరొక పదివేలు, మా ఫ్రెండ్‌కి పదివేలు – మిగిలింది నాకు అంది వెరానికా

# మల్లిక

నమ్మశక్యం గాలేదు మల్లికకు. వెరానికా అంత డబ్బు ఇస్తుందనుకో లేదామె.

"థాంక్స్ వెరానికా! ఇంత డబ్బు మాకివ్వటం నీ మంచితనం తప్ప మరేంకాదు. గాడ్ బ్లెస్ యూ!" అని వెరానికా బుగ్గమీద ముద్దు పెట్టుకుంది గ్లోరియా.

ముగ్గురూ బైటికి నడిచారు. గ్లోరియా కారులో మూడు వీధులవతల వున్న వెరానికా ఆఫీసు బిల్డింగ్ దగ్గరికి వెళ్ళారు.

"ఒక్కొక్కళ్ళూ వెళ్ళి మా ఫ్రెండ్‌కి నమ్మకం కలిగించాలి. ముందు ఎవరు వెళ్తారు?"

గ్లోరియాని వెళ్ళమంది మల్లిక. గ్లోరియాకి వాళ్ళ ఫ్రెండ్ పేరు, రూం నెంబరు చిన్న చీటీ మీద వ్రాసి ఇచ్చింది వెరానికా.

"నన్ను చూస్తే మీ ఫ్రెండ్‌కు నమ్మకం కలుగుతుందో లేదో వెరానికా! ఏం చెబితే నమ్ముతాడంటావు?"

"ఏముంది? నువ్వు బాంక్‌లో స్వంతంగా డబ్బు వేసి తియ్యగలనని నిరూపించాలి. నీ దగ్గరిప్పుడు బాంక్ నుండి డబ్బు తీసినట్లుగా ఏదైనా ఆధారముందా?"

"వుంది. వుదయం షాపింగ్‌కి వచ్చే ముందు కారు కొనటానికని బాంక్ నుండి డబ్బు తీశాను. ఏది కొన్నా కాష్‌తో కొనటం మా అలవాటులే! షాపింగ్ తర్వాత నా భర్తతో కలిసి కారు డీలర్ దగ్గరకెళ్ళాలని మా ప్లాన్. ఆ డబ్బు ఇంకా నా దగ్గరే వుంది. భయంగా వుంటుందని గర్డిల్ బెల్ట్‌లో దాచాను." అంది గ్లోరియా, గర్డిల్ తడుముకుంటూ.

"అంతకంటే ఏం కావాలి? బాంక్ బుక్, ఆ డబ్బు చూపిస్తే చాలు."

గ్లోరియా వెళ్ళినాక, మల్లిక నడిగింది వెరానికా, "నీ దగ్గర అట్లాంటి ప్రూఫ్ ఏదైనా వుందా?"

"ప్రస్తుతం లేదు. కానీ నేనే స్వంతంగా బాంక్ పనులు చూస్తాను. మా వారికి ఆఫీసు పనితో తీరిక వుండదు. మాకు జాయింట్ అకౌంట్ వుంది." గబగబా అంది మల్లిక.

"కొంచెం చిక్కేనే! తన కళ్ళతో చూడనిదే నమ్మడు మా ఫ్రెండ్. మీరుండేది ఇక్కడికి దగ్గర్లోనేనంటున్నావుగా? వెళ్ళి త్వరగా బాంక్ బుక్ తీసుకురా. కార్లోనే వచ్చావా?"

"లేదు. 'సబ్‌వే'లో వచ్చాను."

"అయితే ఈ కారులోనే వెళ్ళి తెసుకొద్దాం. గ్లోరియా ఏమీ అనుకోదులే. అంత డబ్బు చేతికి వస్తుంటే ఆమాత్రం సహాయం చెయ్యదా?"

ఇంతలో గ్లోరియా తిరిగివచ్చింది. ముఖమంతా సంతోషంతో వెలిగిపోతోంది. వచ్చి కార్లో కూర్చుంది.

"మీ ఫ్రెండ్ చాలా మంచివాడులా వున్నాడు వెరానికా! బాంక్ బుక్, డబ్బు చూపిస్తే చాలన్నాడు. మల్లికను పంపమన్నాడు."

"మల్లిక దగ్గర ఇప్పుడు ప్రూఫేమీ లేదట. ఇంటికెళ్ళి తెమ్మంటున్నాను. సబ్‌వేలో అయితే ఆలస్యమవుతుంది. నీ కార్లో వెళ్ళి రావటానికి నీకేమైనా అభ్యంతరమా?"

"అభ్యంతరమెందుకు? ఎంత త్వరగా ఈ పని అయితే అంత త్వరగా డబ్బు చేతికొస్తుంది కదా?" అని కారు స్టార్ట్ చేసింది గ్లోరియా.

(ఇంకా ఉంది)

# ప్రశ్నావళి

కె. రామలక్ష్మి

### జి. వి. ఆర్. సికింద్రాబాదు

★ మంచి పేరుకి ప్రచారానికి తేడా ఏమిటి?

● మంచి పేరు శాశ్వతంగా వుంటుంది. ప్రచారం సాగినన్నాళ్ళు వుంటుంది! అంతే.

### ఎన్. ఎస్. కె. కొత్తగూడెం

★ ప్రజలలో చాలా భాగం అక్రమ అర్జనకు మాత్రమే ఎందుకు తహ తహ లాడుతారు?

● సంపాదించడం సులభం. టాక్సు బాధ వుండదు. ఇక దానిపై మొగ్గు చూపడంలో – వింతేముంది?

★ జీవితంలో యింత మెలో డ్రామా ఎందుకు?

● రక్తి కట్టడానికి!

### ఎస్. హెచ్. తిప్పనపల్లి

★ మనం సైన్సులో ఎంతో అభివృద్ధిలో వున్నా పేర్లలో రాముడు, వెంకటేశ్వరుడు తప్ప వేరే పేర్లే లేవా?

● ఎలక్ట్రోడు న్యూట్రాన్, ఏటమ్ అంటూ పెట్టుకో మంటారా? పేరుకి వృత్తికి ఏమిటి సంబంధం? నాస్తిక బ్రహ్మ గో. రా. గారి పేరు రామచంద్ర రావు! అంత మాత్రం చేత ఏమైంది?!

### ఎం. పి. కె. గుంటూరు

★ ఇప్పుడొస్తున్న 3–డి సినిమాలపై మీ అభిప్రాయం?

● ఓపిక ఉంటే కళ్ళ జోడు తోను, లేక పోతే ఉట్టి కళ్ళ తో నూ చూసేయొచ్చు!

### యు. ఎస్. ఆర్. ముట్నూరు

★ కత్తి గొప్పదా? కలం గొప్పదా?

● ఉంటే రెండూ గొప్పవే!

### పి. ఎమ్. ఆర్. సత్తెనపల్లి

★ నేను ఒక అమ్మాయిని మూడు సంవత్సరాల నుంచి ప్రేమిస్తున్నా. పెండ్లి చేసుకోవాలని వుంది. నే రాసిన ఉత్తరాలు తీసుకుంది. కాని మాట్లాడదు. తన అభిప్రాయం చెప్పదు. మా కులాలు వేరు. ఆమె అభిప్రాయం చెప్తే ఆమె పెద్దలతో మాట్లాడాలని ...

● మీకామె నచ్చింది కదా – వెళ్ళి సూటిగా మాట్లాడండి. తప్పేముంది?

### సి. హెచ్. టి. సిర్‌పూర్ కాగజ్‌నగర్

★ మానభంగానికి గురి అయిన స్త్రీని యీ సమాజం అవమానిస్తుంది. ఎందుకు?

● ఎందుకేమిటి లోకువ? వ్యక్తిగా ఆమెకి విలువనివ్వరు కనుక ... ఎవరికేనా వుంటుంది – ఆమెను కించపరిచే హక్కు!

### పి.వి. చాగల్లు

★ దేవుళ్ళు కొండ మీదే వెలుస్తారెందుకు?

● భక్తుల శక్తి పరీక్షించడానికి కాబోలు!

### ఎ. వి. ఎస్. ఎమ్. చీరాల

★ ప్రముఖ నటి పద్మశ్రీ భానుమతీ రామకృష్ణపై మీ అభిప్రాయం.

● స్నేహశీలి. సంభాషణా చతుర. ఆమెతో మాట్లాడుతూంటే టైం తెలియదు.

### టి. వి. కె. ఆర్. కొంగుదురు

★ మీ పేరు పక్కన డిగ్రీ ఏమీ కనిపించదు. ఇంత నాలెడ్జి సంపాదించడానికి ఏం చదివారు.

● అదే గమ్మత్తు. చదివితే తెలివి రాకపోయేదో ఏమో – అనిపిస్తుంది! డిగ్రీలతో లోకజ్ఞానం రాదు ... జీవితం చదవాలి. అదెలా అని అడక్కండి. చుట్టూ ప్రపంచం గుడ్డిగా కాకుండా చూడడం అలవాటు చేసుకోవాలి. మనుషులని వినడం, పరిశీలించడం అలవాటు చేసుకోవాలి. అప్పుడు ... యీ లోకం కాస్త కాస్త అర్థం అవుతున్నట్టు అనిపిస్తుంది.

### కె. బి. ఆర్. టాటానగర్

★ కాలం మారింది అంటుంటారు. ఎప్పటిలాగే సూర్యుడు తూర్పున ఉదయించి – పడమర అస్తమిస్తున్నాడు. మరి కాలం మారిందనడంలో అర్థం ఏమిటి?

● మీలా దిక్కులే లెక్కగా వుండేవారికి – కాలం మారినా ఒకటే – మారకపోయినా ఒకటే – మీ కాలం అలాగే వెళ్ళబుచ్చండి!

### పి. ఆర్. గుంటూరు

★ వివాహబంధంలో మాధుర్యం నెమ్మదిగా నెమ్మదిగా తగ్గిపోవడానికి కారణం ఏమిటి?

● తరిగే యౌవ్వనం. పెరిగే బాధ్యతలు.

### ఎస్. జి. అనంతపురం

★ నేను ఒక వస్తువు పోగొట్టుకున్నాను. అది దగ్గరలో నే వుంది. ఒకరి వద్ద వుంది. అది నాకు దక్కుతుందా?

● దక్కదు. ఇంకొకరి సొత్తయిపోయాక – అదింక మీదెలా అవుతుంది?!

### సి. హెచ్. ఎన్. ఆర్. సత్తెనపల్లి

★ కాలానుగుణంగా హిందూమతములోని ఆచార వ్యవహారములలో తక్షణం కొన్ని మార్పులు జరగాలి అని నేను ఆశిస్తున్నాను.

● అసలు హిందూమతం మిగిలివుందా? మార్పులు తేడానికి!!

★ నేటి మానవుని మేధాశక్తిని ఏమని వర్ణిస్తారు?

● అబ్బా! బాగా సంపాదించే శక్తి వుంది! అని.

★ మీరెప్పుడైనా రేడియోలో మాట్లాడ్డం ప్రసంగించడం జరిగిందా? మీ రచనలు ప్రసారం అయ్యాయా?

● ఆఁ అడపాతడపా యీ పని '51 నుంచి చేస్తున్నాను! చాలా ఆలస్యంగా అడిగారు!

### బి. ఆర్. వి. శ్రీకాకుళం

★ నేను బి. ఎ. పాసయ్యాను. ఇంట్లో వాళ్ళు బి. ఇడి చేయమంటున్నారు. మీ సలహా.

● ఉట్టి డిగ్రీ కంటే – ఏదైనా ప్రొఫెషన్‌కి పనికివచ్చే – ట్రెయినింగు మంచిదే.

### కె. కె. ఆర్. సికింద్రాబాదు.

★ సెన్సారు వారు ఎందుకు ఫెయిలవుతున్నారు?

● ఏ సెన్సారూ ఓ ఐడియాలో సగం వేగంగా కూడా పరుగెత్తలేదు! రూల్సు సంకెళ్ళు అడ్డుకుంటాయి. □





# “మెర్లిన్” ఎవరు?

పాశ్చాత్య సాహిత్య సంపదని చవిచూచిన వాళ్లకి మెర్లిన్ ఎవరో చూచాయగా నైనా తెలుస్తుంది కాని, మెర్లిన్ పూర్తి వివరాలు మాత్రం సాహిత్య పరిశోధకులకి కూడా అందుబాటులో లేదని చెప్పవలసి ఉంటుంది. జర్మన్, వేల్స్, బ్రిటన్, స్కాట్‌లాండ్ దేశాలలోని ఆబాల గోపాలానికి మెర్లిన్ బాగా ఎరుక. అద్భుతాలు చేసే వ్యక్తిగా మెర్లిన్ చిరస్మరణీయుడు. గొప్ప కవి అని కొందరు అంటారు. ప్రవక్త అని మరికొందరు చెబుతారు. రాజ్యాధి కారి అని కూడా కొందరి అభిప్రాయం. కొందరి దృష్టిలో అతడొక మాంత్రికుడు. పైశాచిక విద్యలు బాగా తెలిసిన వాడు. ఇంకా కొందరి ప్రకారం అతడు ఉట్టి పిచ్చివాడు. అడవులలో తిరుగాడే మొరటు మనిషి. ఇలాగ అతడిని గురించి ఎన్నో రకాల కథలు– కొన్ని కట్టుకథలు కూడా– ఉన్నాయి. వేల్స్ భాషా వేత్తల ప్రకారం– కాల్పనిక సాహిత్య జగత్తులో– అతడిని ఆర్థర్ రాజు ఆస్థానంలో ఉండే కవిగా గుర్తించవచ్చును. ఇక్కడ కూడా మళ్లీ అనుమానమే! ఓర్‌టిగెరెన్ రాజు ఆస్థానంలో మెర్లిన్ ఉండేవాడని కొందరు ఇప్పటికీ గట్టిగా నమ్ముతున్నారు. ఇంకా కొంపరు ఆర్థర్ ఆస్థానంలోనే కాదు, అతడి తండ్రి ఉథర్ పెన్‌డ్రాగన్ ఆస్థానంలో కూడా మెర్లిన్ సలహాలు ఇచ్చేవాడని చెబుతారు. వేటికీ స్ఫుటమైన దాఖలాలు ఉన్నట్లు కనిపించవు.

"ది వేవర్‌లీ ఎన్‌సైక్లోపీడియా"లో మెర్లిన్ గురించి కొంత సమాచారం ఉంది. వేల్స్ సాహిత్యంలో "మైరిడ్డిన్"గా ఇతనికి గుర్తింపు ఉంది. ఇతడికి ఘనంగా ఉత్సవాలు జరపడం వేల్స్, స్కాట్‌లాండ్, బ్రిటన్ దేశాలలోని కొన్ని ప్రాంతాలలో ఇప్పటికీ ఆనవాయితీగా ఉంది. మాంత్రికునిగా, మత ప్రవక్తగా ఇతడిని గుర్తించడం జరుగుతోంది. ఇతడు 5–6 శతాబ్దాలకి చెందిన వాడని చెప్పబడుతోంది. ఓర్‌టిగెరెన్, ఆర్థర్ ఆస్థానాలలో ఇతడు ఉండేవాడు. ఇంగ్లీషు రచయితల దృష్టిలో మెర్లిన్ ఒక శృంగార పురుషుడు. జియోఫ్రీ ఆఫ్ మన్‌మవుత్ రాసినట్లు చెప్పబడుతున్న "హిస్టరియా రీగమ్ బ్రిటన్నియే"లో మెర్లిన్ కి సంబంధించి కొన్ని వివరాలు ఉన్నాయి. ఈ వివరాలు "ఎన్ సైక్లోపీడియా బ్రిటానికా"లో సంక్షిప్తంగా ఇవ్వబడి ఉన్నాయి.

800 సంవత్సరానికి చెందిన వేల్స్ సాహితీ సుగతుడు నెన్నియస్ చెప్పిన మెర్లిన్ కథ ఆధారంగా జియోఫ్రీ ఆఫ్ మన్ "మవుత్" హిస్టరియా రీగమ్ బ్రిటన్నియే" రాసినట్లు తెలుస్తోంది. ఆంబ్రోసియస్ అని పిలువ బడే అబ్బాయి ఓర్‌టిగెరెన్ రాజుకి సలహాలిచ్చేవాడు. ఆంబ్రోసియా అంటే అమృతం అని అర్థం ఉంది. మెర్లిన్ చిరంజీవి అని నేటికీ నమ్మేవారికి ఈ పేరు కూడా సాక్ష్యంగా నిలుస్తుంది. ఇతడే ఆర్థర్ తండ్రి అయిన ఉథర్ పెన్‌డ్రాగన్ ఆస్థానంలో ఉండేవాడు. ఆ తరువాత ఆర్థర్ ఆస్థానంలో కూడా ఉండేవాడు. జియోఫ్రీ ఆఫ్ మన్‌మవుత్ తరువాత రాసిన "వీటా మెర్లిని"లో మెర్లిన్ కథని మరికొంచెం వివరించాడు. ఈ కథకి ఉత్తర వేల్స్ ప్రాంతంలో వినిపించే కాల్పనిక గాథ ఆధారమని కూడా వ్యక్తపరిచాడు. మెర్లిన్ అరణ్యాలలో తిరుగాడే అనాగరిక వ్యక్తిగా ఈ గాథలో వర్ణించడం జరిగింది. ఇతడికి కొన్ని దివ్య శక్తులు ఉండేవి. దివ్యశక్తులని ఈ గాథలో అయితే ఉంది కాని, మిగతాచోట్ల క్షుద్రశక్తులు ఉన్నట్లే వెల్లడి అవుతోంది. ఈ గాథలో వర్ణించబడిన మెర్లిన్‌ని గమనిస్తే మనకు వాల్మీకి గుర్తుకొస్తాడు. అతడు కూడా అడవులలో తిరుగాడే కిరాతకుడే కదా మొదట! ఆ తరువాత మహర్షియై దివ్యశక్తి సంపన్నుడై అజరామరమైన కీర్తివంతుడు కాగలిగాడు. ఇక్కడ మెర్లిన్ కాలం 13వ శతాబ్దం అయి ఉండవచ్చుననే అనుమానాన్ని కూడా వ్యక్తపరచడం సంభవించింది.

రాబర్ట్ డి బొరన్స్ రాసిన గేయ కావ్యం "మెర్లిన్"లో మెర్లిన్‌కి క్రైస్తవ మత ప్రవక్త స్థానం కూడా ఆపాదించ బడింది. ఇందులో మెర్లిన్‌కి ఎనలేని పవిత్రత చేకూర్చడం జరిగిందని సాహిత్య చరిత్ర కారులు అంటారు. ఈ కథకీ ఆర్థర్ కథకీ సంబంధం ఉండేలా బొరన్స్ జాగ్రత్త పడినట్లు అనిపిస్తుంది. "వల్‌గేట్ సైకిల్" అనే మరొక పుస్తకంలో మెర్లిన్‌ని గురించి మరీ సందేహాస్పదంగా చర్చించడం గుర్తించవలసి వస్తుంది. మొదటి భాగంలో మెర్లిన్ పైశాచిక శక్తుల సమ్మిళిత స్వరూపంగా గోచరిస్తాడు. క్షుద్రమైన దుష్ట భూతాంశలు కనిపిస్తాయి. అదే రెండవ భాగంలో మెర్లిన్ శాంతి దూతగా మత ప్రవక్తగా అవతరిస్తాడు. దైవికమైన శక్తులకి ప్రత్యామ్నాయంగా నిలుస్తాడు. ఇందులో ఏది నిజం అని తేల్చడం కష్టం! శివతత్వాన్ని, శివరూపాన్ని వర్ణించినట్లుగా! ఆది పురుషుడొక చోట, అర్ధనారీశ్వరుడొకచోట! గరళ కంఠుడు ఒక వంక, చంద్రశేఖరుడు మరొక వంక! అలాగే మెర్లిన్ విషయం కూడా అనితోస్తుంది. అంతమాత్రాన శివుడితో మెర్లిన్‌ని పోల్చినట్లు కాదు.

కొన్ని దాఖలాల ప్రకారం ఉథర్ తరువాత వారసుడు ఎంపిక కోసం పరీక్ష పెట్టమని చెప్పింది మెర్లిన్ మహాశయుడే అని తెలుస్తుంది. "నైట్ ఫెలోషిప్ ఆఫ్ రవుండ్ టేబుల్"ని రూపొందించింది కూడా ఇతడేనని మరికొన్ని పుస్తకాలలో ఉన్నాయి. చివరగా మెర్లిన్ "లేడీ ఆఫ్ ది లేక్" వ్యామోహంలో పడి, ఆమె వెంటనే వెళ్లి మరణించాడని ఒక కథనం. అతడికి మరణం లేదు, అతడిని తలచుకుంటే ఇప్పటికీ కనిపిస్తాడని మరొక వాదం.

మెర్లిన్‌కి సంబంధించిన వాదోపవాదాలు ఇప్పటివి కావు. ఎప్పటినించో కొనసాగుతున్నాయి. ఇంకా కొనసాగుతాయి కూడా! మన వేదవ్యాసుని మీద జరిగే చర్చల లాగా! వ్యాసుడు ఒకడేనా? లేక చాలామంది ఆ పేరు గల వారున్నారా? – అన్నది ఇంకా తేలలేదు. మరి కొందరు వ్యాస పీఠం ఉందని, ఆ పీఠాధిపతిని వ్యాసుడని పిలుస్తారని చెబుతారు. ఎన్నో గ్రంథాలని రాసినట్లు చెప్పబడుతున్న వ్యాసుని జన్మ వృత్తాంతం కూడా స్పష్టంగాలేదు. ఆయన సాక్షాత్తు శ్రీమన్నారాయణుని అవతారమని నమ్మేవాళ్లు కూడా ఉన్నారు. అలాగే మెర్లిన్ విషయమూనూ!

"హిస్టారికల్ మెర్లిన్" పేరిట ఇటీవలే పీటర్ రెడ్‌గ్రోవ్ అనే జర్మన్ సాహిత్య వేత్త నికోలాయ్ టాల్‌స్టాయ్ రాసిన "ది క్వెస్ట్ ఫర్ మెర్లిన్" అనే

## నేడే స్వాతంత్ర్యదినం

భరతమాత దాస్య శృంఖలాలు
తెగిపోయిన పర్వదినం
రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యం
అస్తమించిన సుదినం
తెల్లవారు తోకముడిచి
చల్లగా జారుకున్న దినం
మువ్వన్నె జాతీయ పతాకం
కన్నుల పండువు చేసిన దినం
స్వేచ్ఛా స్వాతంత్ర్యములకన్న
మనిషికి భువిలో ఏది లేదని మిన్న
చాటి చెప్పు పండుగ దినం
అదియే స్వాతంత్ర్య దినోత్సవం

— ఆర్. పట్టాభిరామరాజు

పరిశోధనా గ్రంథంపై "ది జర్మన్ ట్రిబ్యూన్" పత్రికలో సుదీర్ఘమైన సమీక్ష చేసాడు. ఈ సమీక్షలో ఇతడు నికోలాయ్ టాల్‌స్టాయ్ దర్శించిన మెర్లిన్ వివరాలని సాధ్యమైనంత నిశితంగా స్పష్టీకరించాడు

ఎమ్మా జంగ్ "గ్రయిల్ లెజెంట్" (ఈగాథపై ఇంకా సందేహాలు తీరలేదు!) ప్రకారం మెర్లిన్ సాధు వర్తనం కలిగిన ప్రవక్త అయితే ప్రవక్తలు పాలుపంచుకోకూడదని రాజకీయాలని, చర్చిలు అంగీకరించని కార్యకలాపాలని అతడు నడిపినట్లు ఎన్నో సందర్భాలలో వినబడుతోంది స్పెన్సర్, లీలీ, టెన్నీసన్, పాయిస్, రాబర్ట్ నయ్ మొదలైన ప్రథమశ్రేణి సాహిత్య కారులంతా మెర్లిన్ అనే సాగరాన్ని మథించిన జిజ్ఞాసువులే! జియోఫ్రీ ఆఫ్ మన్‌మవుత్ గాథలు, రాబర్ట్ డి బొరన్స్, మలోరి తదితరుల రచనల ప్రకారం మెర్లిన్ తండ్రిలేని ఒక అనాథ బాలుడు. అయితే అసాధారణమైన సూక్ష్మ బుద్ధి గలవాడు దైవికశక్తి సంపన్నుడని కొందరు అంటారు కాని, ఎక్కువమంది పైశాచిక శక్తిగల వాడని చెబుతారు 'మెఫిస్టోఫిలెస్" అనే రాక్షసునితో మెర్లిన్‌ని కొందరు పోలుస్తారు ఈ రాక్షసుడు జర్మన్ దేశపు గాథలలో తారసపడే ఒక దుష్టభూతము ఫాస్టు అనే మానవుడు ఈ భూతానికి ఆత్మని అమ్మినట్లు కల్పన మెర్లిన్ చిరబురలాడుతూఉండే క్షుద్రపురుషుడు శాంతి, సహనం, ప్రశాంతత నైర్మల్యం గోచరించే సిద్ధ పురుషుడు కాదు రవుండు టేబిల్‌ని సృష్టించి స్టోన్‌హెంజ్ పట్టణాన్నెకదలించిన వాడు మెర్లిన్ కాని దీన్ని భయానక లీలగా చెబుతారు, మహిమగా అంగికరించడం లేదు అతనికి క్రైస్తవమతంపై విశ్వాసం ఉన్నట్లు దాఖలాలు స్ఫుటంగా లేవని నికోలాయ్ టాల్‌స్టాయ్ అంటాడు ప్రాచీన బ్రిటన్‌లో ప్రశస్తమై ఉన్న క్రైస్తవ సంప్రదాయాలని ఇతడు త్రోసి పుచ్చాడు బ్రిటన్‌లకి, సాక్సన్‌లకి (ఉత్తర జర్మన్ ప్రాంతపు వాళ్ళు కావచ్చు!) యుద్ధం జరిగినప్పుడు (ఆర్‌డెరిడ్ యుద్ధం) మెర్లిన్ పోషకు డైన గ్వెన్‌డొలావ్ ఓటమి పాలు కావడంతో, మెర్లిన్‌కి దాదాపు పిచ్చిపట్టి అడవుల పాలైనాడని ఒక కథనం ఈ అడవులలోనే ఇతడు మాంత్రిక విద్యని నేర్చు కున్నాడని మరి కొందరి అభిప్రాయం ఇతడి చెల్లెలు (ఈమె ఎవరో అంతుబట్టడంలేదు!) సృష్టించిన "ఎస్ప్లుమాయిర్" మంత్ర గృహంలో మెర్లిన్ మంత్ర విద్యను అభ్యాసం చేసుకొన్నాడని చెప్పటానికి కొన్ని ఆధారాలు ఉన్నాయి ఈ మంత్ర గృహానికి డెబ్బై కిటికీలు ఉండేవని ఇది స్టోన్‌హెంజ్ సమీపంలోగల కొండ ప్రాంతమే అయి ఉంటుందని కొందరు భాష్య కారులు అంటున్నారు

కొందరి అంచనా ప్రకారం మెర్లిన్, డ్రూయిడ్‌ల వర్గానికి చెందిన వాడు వీళ్ళు వేల్స్ లేదా జర్మన్‌కి చెందిన మతాధిపతులు కావచ్చును వీరు పొడవుగా, ఎర్రటి వెంట్రుకలతో నీలి కళ్ళతో ఉండేవారు ప్రాచీన కాలంలో వీరు మధ్య పశ్చిమ ఐరోపాలో



శృంగార పురుషునిగా మెర్లిన్!
ఎడ్వర్ట్ బర్న్ – జోన్స చిత్రం ఆధారంగా!

ఉండేవారు క్రీస్తు ముందు 400 నాటికి వీళ్ళు ఇటలీని, రోమ్‌ని కూడా జయించారు క్రీస్తు ముందు 600 నాటికే వీళ్ళకి భాష, లిపి, సంప్రదాయం స్పష్టంగా రూపుదిద్దుకొని ఉండేవి. ఈ డ్రూయిడ్‌లు బ్రిటన్, వేల్స్; ఐర్లాండ్, స్కాట్‌లాండ్ ప్రాంతాలలో విస్తరించి ఉన్నప్పటికీ బ్రిటన్ వీరికి ప్రధాన కేంద్రంగా ఉండేది నరబలులు వీరి ఆచారంలో ఉండేవి పవిత్రమైన వృక్షాన్ని కొలవడం • వీరి ఆనవాయితీగా ఉండేది వీరు దేవతలని పూజించే వారు స్ట్రాబో చరిత్రకారుని ప్రకారం మెర్లిన్, డ్రూయిడ్‌లు పాటించే సెక్స్ కార్యకలాపాలని కూడా పాటించేవాడు సామోత్రాస్ అని పిలువబడే గ్రీక్ దీవిలో ఏ విధమైన లైంగిక కలాపాలని పూజల పేరిట జరిపేవారో, దాదాపు అలాంటి వాటినే మెర్లిన్ కూడా జరిపేవాడని ఒక వాదముంది.

మరొక కథనం ప్రకారం మెర్లిన్ మంత్ర విద్యలని ది లేడీ ఆఫ్ ది లేక్, మోర్గాన్ ల ఫే, వివియన్, నిమ్యూ వంటి మంత్ర విద్యావిశారదుల వద్ద అభ్యసించాడు. మెర్లిన్ మానసిక క్లేశాన్ని, హృదయ పరితాపాన్ని మహిమోపేతమైన ఆపిల్ చెట్టు క్రింద పోగొట్టు కొన్నట్లు ఆధారం ఉంది ఇక్కడ మనకు గౌతముడు బోధివృక్షం క్రింద కూర్చొని సిద్ధార్థుడైన సంగతి నెనపుకు వస్తుంది మెర్లిన్ స్వాంతన పొందిన స్థలాన్ని "హార్ట్‌ఫెల్ స్పా"గా టాల్‌స్టాయ్ గుర్తించాడు

నికోలాయ్ టాల్‌స్టాయ్ మెర్లిన్ స్వభావాన్ని విశదపరుస్తూ "ది సెక్సువల్ ఎలిమెంట్" అనే

అధ్యాయం క్రింద మెర్లిన్ అనుసరించిన "షామనిజమ్" గురించి ప్రస్తావించాడు. ఉత్తర ఆసియాకి చెందిన కొందరు ఆదిమవాసులు షామనిజాన్నిపాటించేవారు. ఆత్మని ఆవహించే పూజా విధానాన్ని (స్పిరిట్ వర్‌షిప్‌ని!) "షామనిజమ్" అని పిలవవచ్చు. నార్త్ అమెరికన్ ఇండియన్‌లు కూడా ఇలాంటి పూజావిధానాన్ని కొనసాగిస్తారు. మెర్లిన్ సెక్స్ సంబంధమైన పూజలని విరివిగా చేసేవాడని అనిపిస్తుంది. తొమ్మిది మంది దేవకన్యలని ఇతడు ఆరాధించే వాడు. భూదేవితో క్రొత్తరాజు సంగమించినట్లుగా భావన కలిగిస్తూ స్త్రీని ఇలాంటి అంశానికి ఉపయోగించుకోవడం మెర్లిన్ చేసేవాడని తోస్తుంది. ఇది వింటూ ఉంటే భారతీయ ప్రాచీన సంప్రదాయంలో (?) చోటు చేసుకొన్న జననేంద్రియారాధన, తాంత్రిక పూజా సంవిధానాలు – మొదలైనవి గుర్తుకి వస్తాయి. అయితే మెర్లిన్ అనుసరించిన ఈ పద్ధతుల గురించి ఎమ్మా జంగ్ కల్పనలో కాని, జియోఫ్రీ ఆఫ్ మన్‌మవుత్ రచనలో కాని స్పష్టంగా ఉన్నట్లు చెప్పడానికి వీలు లేదని పీటర్ రెడ్‌గ్రోవ్ అభిప్రాయం.

ఏది ఏమైనప్పటికీ మెర్లిన్ మాత్రం వివాదాస్పదంగానే మిగిలిపోతున్నాడు. ఇతడిని "రొమాన్స్"కి మూలంగా ఆంగ్ల భాషా వేత్తలు స్వీకరించినా, సెక్స్ కార్యకలాపాలకి కూడా ఇతడి పేరే చెప్పడం జరుగుతోంది. ఇతడి స్వభావం అలా ఉంచి రూపం ఎలా ఉంటుందో అని ఆలోచించినా ఊహకి అందడం లేదు. వాల్ట్ డిస్నీ ప్రచురణ "ది స్వోర్డ్ ఇన్ ది స్టోన్"లో మెర్లిన్ బొమ్మ వికృతంగా ఉంది. ఇది వ్యంగ్య చిత్రమే అయినా మెర్లిన్ స్వభావరీత్యా అలా ఊహించి ఉండవచ్చునని భావించవచ్చు.



మెర్లిన్ ఊహా చిత్రం!

(వాల్ట్‌డిస్నీ ప్రచురణ – "దిస్వోర్డ్ ఇన్ ది స్టోన్" ఆధారంగా!)

ఇతడికి పెంపుడు గుడ్లగూబ ఉండేదని, ఇతడి విద్యలన్నీ క్షుద్రమైనవని అనిపిస్తుంది. ఇతడికి రెక్కలున్నట్లు, ఒక రెక్క క్రింది భాగం నించి వార్ట్ అనే పిల్లవాడు ఉదయించినట్లు కూడా కథలు ప్రచారంలో ఉన్నాయి. ఇవన్నీ అతడి మాయాజాలాన్ని, దుష్ట స్వభావాన్ని వివరించేవని అనుకోవచ్చు. ఇతడు హంతకుడని కూడా వర్ణించే కల్పనలు సయితం ఉన్నాయి!

మెర్లిన్ అభూతకల్పనని, అతడికి సంబంధించి ఉన్న చరిత్రంతా ఉట్టిదేనని వాదించే వాళ్ళు ఉండనే ఉన్నారు. అదే సమయంలో అతడు చిరంజీవి అని, తలచుకుంటే కటాక్షిస్తాడని అనుకొనే వాళ్ళు ఇప్పటికీ ఉన్నారు. భూత విద్యకి ఇతడిని ఆదిపురుషుని చేసేవాళ్ళు ఉన్నట్లే, దైవిక శక్తులకి ఇతడిని వారసుని చేసిన వాళ్ళూ ఉన్నారు. శృంగార పురుషునిగా, కామ కళా ప్రియునిగా ఇతడిని గుర్తించడం కద్దు. ఇతడు మర్మయోగి అని కొందరంటే, మహారాజని మరి కొందరను కొంటున్నారు. ఇంతకీ నిజానిజాలు వాదోప వాదాలే! ఇవి ఎట్లా ఉన్నా మెర్లిన్ పేరు చెబితే చాలు, ఆ కథలని వినడానికి, ప్రచురించడానికి, కొని చదవడానికి పాశ్చాత్యులు నేటికీ సిద్ధంగా ఉండటం ఎంతైనా ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. □

–డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు.

## భువనేశ్వర్‌లో తిరుమల– తిరుపతి దేవస్థాన సమాచార కేంద్రం

'దేవాలయాల నగరం' గా ప్రసిద్ధి పొందిన భువనేశ్వర్‌లో మూడు దశాబ్దాల ఖ్యాతి గాంచిన **'ఆంధ్ర కల్చరల్ అసోసియేషన్'** ఆధ్వర్యాన వారి **కార్యాలయంలో తిరుమల – తిరుపతి దేవస్థానం వారు తిరుమలేశుని** దర్శించే యాత్రికుల సౌకర్యార్థం ఏర్పాటు చేసిన సమాచార కేంద్రానికి ఒరిస్సా ముఖ్యమంత్రి శ్రీ జానకి వల్లభ పట్నాయక్ **జూన్ 8 న** ప్రారంభోత్సవం చేశారు. దేవస్థానం ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ శ్రీ ఎస్. లక్ష్మీనారాయణ అధ్యక్షత వహించారు. శ్రీ పట్నాయక్ ముఖ్యఅతిధిగా పాల్గొన్నారు. అసోసియేషన్ కార్యదర్శి శ్రీ ఎన్. ఎస్. రావు నివేదిక సమర్పించారు. అధ్యక్షులు యాత్రికుల సౌకర్య కార్యక్రమాన్ని వివరించారు. ముఖ్యమంత్రికి అధ్యక్షుల వారిచ్చే దేవస్థాన కానుక సమర్పించబడింది. కుమారి ఎ. సుధారాణి (విజయనగరం) శాస్త్రీయ సంగీత సుధాస్రవంతి జరిగింది. అసోసియేషన్ ఉపాధ్యక్షులు శ్రీ పార్థసారధి వందన సమర్పణ చేశారు.

## అవీ ఇవీ అన్నీ

ఇటీవల ఆంధ్ర సంస్కృతీ సమితి భువనేశ్వర్‌లో శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము సమాచార కేంద్రమును ప్రారంభోత్సవము చేసిన ఒరిస్సా ముఖ్యమంత్రి శ్రీ జానకీ వల్లభ పట్నాయిక్, శ్రీ ఎస్. లక్ష్మీ నారాయణ (ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము), ఆంధ్ర సంస్కృతి సమితి, భువనేశ్వర్ సభ్యులని చిత్రంలో చూడవచ్చు.



## మాజిక్ ఫెస్టివల్

**ఆల్ ఇండియా మాజిక్ ఫెస్టివల్ – 1985 ఒరిస్సా రాజధాని భువనేశ్వర్‌లో మూడు రోజులపాటు అక్టోబర్ 6, 7, 8 తేదిలలో జరుగుతుంది. దేశం నలుమూలలనుండి మెజీషియన్లు, మాజిక్ అభిమానులు వచ్చి ఈ మాజిక్ ఉత్సవంలో పాల్గొంటారు. ఈ ఫెస్టివల్‌లో మాజిక్ సెమినార్లు, మాజిక్ పాఠాలు, క్లోజప్ మాజిక్ పోటీలు, స్టేజి మాజిక్ పోటీలు జరుగుతాయి. విజేతలకు బంగారు, వెండి పతకాలు బహుకరిస్తారు. రిజిస్ట్రేషన్‌కు ఆఖరి తేదీ 31-8-85 ఈ ఫెస్టివల్‌లో పాల్గొన కోరేవారు పూర్తి వివరాలకోసం మెజీషియన్‌బోసు, కేరాఫ్ స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, తాడేపల్లి గూడెం–534101 వారికిరాసి తెలుసుకోవచ్చు.** □

## వంద మిలియన్ డాలర్ల గంజాయి దొంగ రవాణా!

పాకిస్తాన్‌లో కరాచిక ఏజెన్సికలో మిటర్ల దూరంలో ఒక చోట పదిహేడున్నర టన్నులు గంజాయిని పట్టుకున్నారట ఈ గంజాయి కెనడాకు దొంగతనంగా ఎగుమతి అవబోతుండగా దొరికిందట దీని ఖరీదు నూరు మిలియను డాలర్లట ఇంత పెద్ద మొత్తం గంజాయి దొరకడం యిదే మొదటిసారిట

## వేశ్యాగృహాల వారి వింత ప్రకటనలపై కోర్టు తీర్పు!

ఆస్ట్రేలియాలోని రెండు వేశ్యాగృహాల యజమానులు తమవద్ద సుందరమైన, క్రొత్త, సరికొత్త అమ్మాయామణులు వున్నారని ప్రకటనలు చేస్తూ 'మీ కోసం తహతహలాడే' అనే ముక్క వుపయోగించారట ఆ ముక్క ముందు నే వుపయోగించానంటే నేనే వుపయోగించానని వారిద్దరూ కోర్టుకు వెళితే న్యాయమూర్తి వాదనలు విని విక్టోరియా వాబర్స్ అనే ఆవిడను ఆ ముక్క తీసివేసి మరో పదం వుపయోగించుకోమని తీర్పిచ్చాడట

## పెరిగిపోతున్న ప్రపంచ జనాభా!

1988వ సంవత్సరం నాటికి ప్రపంచ జనాభా 500 కోట్లు అవ్వచ్చునట 1983వ సంవత్సరం నాటికి 467 కోట్లట చావుల సంఖ్య తగ్గడం వల్ల, పుట్టుక సంఖ్య పెరక్కపోయినా, జనాబా అధికంగా వున్నట్లు అయిందట ఈ విషయం యునైటెడ్ నేషన్స్ డెవలప్‌మెంట్ ఫోరమ్ వెల్లడించిందట స్వాతంత్ర్యం వచ్చినాటి నుంచి మన భారతదేశపు జనాబా రెట్టింపయ్యిందని మనవాళ్ళే చెప్తున్నారు గదా!




## కడుపు ఉబ్బరానికి చిట్కా వైద్యాలు!

మామిడపళ్ళు ఘుమ్మని లాగించేసి, పొట్ట బరువైతే పాలు త్రాగితే కాస్త హాయి వస్తుందట దానికది విరుగుడుట అలాగే ఎక్కువ నెయ్యి వాడ్డం వల్ల కడుపు ఉబ్బరం వస్తే నిమ్మరసం త్రాగితే హాయిట అరటిపళ్ళు ఎక్కువ తింటే ఉప్పు తినాలనీ, కేకులు మితిమీరి తింటే వేడినీళ్ళు విరుగుడనీ, పాలు త్రాగినందువల్ల అజీర్తయితే మజ్జిగ విరుగుడనీ, జామపళ్ళకు అరటిపండు విరుగుడనీ, కొబ్బరికి కొంచెం బియ్యం విరుగుడనీ, నీళ్ళు ఎక్కువ తాగి పొట్ట పుబ్బరం చేస్తే ఓ చెమ్చాడు నెయ్యి ఉపశమనమని విజ్ఞుల ఉవాచ

## కడుపు నెప్పి భరించలేక ఆత్మహత్య!

వందవాస అనే వూరిలో 40 ఏళ్ళ ముత్తు అనే ఆయన గత నాలుగేళ్ళుగా కడుపునొప్పితో బాధపడుతూ అనేక రకాల, రకరకాల వైద్యాలు చేయించుకున్నాడట అయినా ఫలితం లేకపోగా వయస్సు ఎక్కువయినకొద్దీ యీ నొప్పి మరింత ఎక్కువవుతూండటం వల్ల ఇహ జీవితం మీద విసుగొచ్చి నల్లులమందు త్రాగి, వొత్తిగిలి పడుకున్నాడట మర్నాటికి ప్రభుత్వ ఆసుపత్రిలో చనిపోయాడట

## పాల ఉత్పత్తిలో మూడవ స్థానం!

భారతదేశం పాల వుత్పత్తిలో ప్రపంచంలో మూడో స్థానాన్ని అలంకరించిందట ఏటికి మనదేశంలో 38 మిలియను టన్నుల పాలు వుత్పత్తి అవుతున్నాయట లెక్కకు రాని పాల పాలెంతో కదా!

## సుప్రీంకోర్టులో పెండింగ్ కేసులు!

1984 డిశంబరు 31 నాటికి మనదేశపు సుప్రీంకోర్టులో లక్షా నలభై ఎనిమిదివేల ఎనిమిది వందల తొంభై ఒక్క కేసులు పెండింగులో పడున్నాయట వీటిలో 1,02,023 కేసులు ఎడ్మిషను, చిల్లర విషయాలట 46,868 కేసులు విచారణ జరుపాల్సినవట

## చర్మ సౌందర్యానికి నిమ్మకాయ!

నిమ్మకాయని నమ్ముకుంటే శరీరం ఎంచక్కగా హాయిగా వుంటుందట చర్మాన్ని మృదువు పరుస్తుందట నేరుగా ముఖానికి, వొంటికి నిమ్మరసం రాసి అది యింకేవరకూ అలానే వొదిలేసి ఆనక స్నానం చేస్తే చర్మం ఎంచక్కా మృదువుగా తయారవుతుందట శరీరానికి, ముఖానికి పడ్డ ముడతలను కూడా యిది సాగదీయగలదట చుండ్రు వున్న తలకు నిమ్మరసం రాస్తే నయమవుతుందట

## అల్లికలో ప్రపంచ రికార్డు!

గుయినిస్ బుక్‌లో ఎక్కాలని స్వీడన్ స్టాక్‌హోమ్ వేయస్తురాస్‌కు చెందిన మాజ్-లిస్-జొహన్సన్ అనే వో గృహిణి అదే పనిగా నూటొక్క గంట అల్లిక పనిచేసి ప్రపంచరికార్డు స్థాపించిందట ఆవిడ ప్రతి గంటకూ ఒక అయిదే అయిదు నిముషాలు కళ్ళకు విశ్రాంతినిస్తూ నూటొక్క గంటలు స్వెట్టరు అల్లకం చేసిందట – ఏన కేన ఉపాయేన ప్రసిదో పురుషః భవేత్ అన్నారు కదా! □









# "నాకూ మానవత్వం ఉంది"

గొల్లపూడి రాజ్యలక్ష్మి

"ఏమిటట్లా చూస్తున్నావు ?" అడిగింది కస్తూరి.

"ఎట్లా ?"

"అదొకలా – కొత్తగా...వింతగా..."

"నాకళ్ళకెప్పుడూ నువ్వలాగే కనిపిస్తావ్ కస్తూరీ !"

"అంటే ? నేను పరాయి వ్యక్తినా ?"

"కాదు, నా ప్రాణానివి ధ్యానానివి"

"ఇంకానయం. పానానివి అనలేదు"

"అవును...పానానివి కూడా. నా కళ్ళతోనే నిన్ను తాగేస్తాను."

"ఇంకా ?"

"ఇంకానా ? నా హృదయాన్ని మెత్తగా తాకి నిలువెల్లాపాకిన మధురానుభూతివి. నా జీవ చైతన్యానివి."

"అంతటితో ఆపు నీ పైత్యం !"

"నన్నాపకు...నిన్నిట్లా నాలో నింపుకోనీ!'

"హాయ్ రావ్... నిజంగా నీ కివాళేదో అయింది !"

"అవనీ...నాకేది సుఖంగా, ఆనందంగా



వుంటే అది చేస్తాను...ఇప్పుడు నిన్నిట్లా చూడడం నాకిష్టంగా ఉంది !''

''నన్ను రోజూ చూస్తూనే ఉన్నావుగా !''

''నిజమే...అయినా నాకింకా ఇది కలకాదు కదా ! అన్న భ్రమ వీడడంలేదు''

''గిచ్చనా ?''

''ఏయ్...కొంటే...''

''లేకపోతే ఏమిటె చెప్పు ? నన్నొదులు అన్నం మాడుతున్నట్లుంది.''

''పోనిద్దూ, మాడనీ...ఏది శాశ్వతం ?''

''అలాగా ? అయితే నేను మాత్రం శాశ్వతమా ?''

''కస్తూరీ !''

''ఓ...సారీ...సారీ అన్నానుగా. ఊరుకో చైతూ...మానాన్నవుకదూ ! అట్లా చూడకు.. ఆ చూపుల్లో ఏదో శూన్యం నన్ను భయపెడుతోంది...ప్లీజ్...!''

''అట్లాంటి మాటలెప్పుడూ రానీకు కస్తూరీ ! నువ్వులేని నన్ను ఊహించలేను. కావాలంటే నన్ను చంపెయ్యి. సంతోషిస్తాను... ఇట్లాంటి మాటలకంటే...అదే నయం.''

''అబ్బ ... ఏదో సరదాకు అన్నానులేవోయ్. అంత సీరియస్‌గా తీసుకుంటావెందుకు ? అయినా ... కాన్పు ఆడదానికి మరో జన్మ అంటారు కదా !''

''అందుకే మనకు పిల్లలు వద్దు అన్నాను. నాకు నువ్వు, నీకు నేనూ చాలు. డాక్టర్ దగ్గరకు పోదాం అంటే ఏమన్నావ్ ? 'మైదానం' లోని అమీర్‌లా కర్కోటకుడిగా మారకు... అట్లాంటి ప్రేమని సహించను'' అన్నావు. నోరు మూసుకున్నాను !''

''మంచిపని చేశావు ... ఇప్పుడూ అదే పని చెయ్యి కాసేపు. నా మాటలు పూర్తిగా విను. నాకు నువ్వు, నీకు నేనూ కావాలి నిజమే ! కానీ నా తృష్ణ అంతటితో ఆగనంటోందే ! చిన్ని చిన్ని పాదాలు, చేతులు, బోసినవ్వులు, ఎంత అందంగా ... శాంతిగా ఉంటాయి. ఆ ఆనందం నాకు కావాలి చైతూ ! నాకు మొదటినుంచీ పసిపిల్లలంటే ఇష్టమని నీకు తెలుసుగా !''

''అయితే నువ్వు బిడ్డలకోసం.. నన్ను...?''

''ఛీ నోర్ముయ్ ... దానికోసం నీవెంట రానక్కర్లేదు ! ఎవడికైనా కనొచ్చు.''

''కోపమా ? నా కస్తూరీ... నీ దాసుడిని క్షమించు. నాకోసం ... నువ్వు మీ వాళ్ళను వదులుకొని ఇంతదూరం నాతో వచ్చావు ... నా ప్రాణమా !''

''ఈ మాటల గారడీతోనే నన్ను బుట్టలో వేసుకున్నావు !''

''... ... ...''

''ఏమిటది ? అటూ ఇటూ వెదుకుతున్నావు ?''

''నిన్ను ఏ బుట్టలో వేశానా ? అని.''

''ఏడ్చినట్లే ఉంది జోకు కానీ, అదిగో అన్నం మాడువాసన !''

''ఇదెక్కడి పిడకలవేట మధ్యన ? ఛలో హోటల్‌కి !''

''ఇంకేం ప్రోగ్రాం లేదా ? ఇవాళ ఆదివారం కదా !''

''వద్దమ్మా...నా చిట్టితల్లి అలిసిపోదూ? నీ తెల్లని పాదాలు ఎర్రగా కంది, తనూలత వాడి...చెంపలు...చెంపలు...''

వాయించనా ?''

''ఏయ్ ... నేనెవరిననుకున్నావ్ ? నీ మొగుడ్ని.''

''కాదు. నా ఆత్మవి.''

''కస్తూరీ !''

... ... ...

★ ★ ★

''ఏయ్ మొద్దూ నిన్నే ?''

''ఊఁ !''

''ఏమిటి ఆలోచిస్తున్నావ్ ?''

''ఏం లేదు...''

''ఏదో ఉంది...దాటేస్తున్నావ్ !''

''అబ్బ లేదన్నాగా !''

''చెప్పవూ ?''

''ఏముందని చెప్పను ?''

''నేను చెప్పనా ?''

''చెప్పు ?''

''అమ్మ గుర్తొచ్చింది కదూ !''

మాట్లాడలేదు కస్తూరి.

''అవును... ఆడవాళ్ళ కిట్లాంటి సమయంలో తల్లి దగ్గరుండాలని ఉంటుందట''

''నాకా అదృష్టంలేదు. పోనీయ్ !''

''ఒకపని చేస్తే ?''

''ఏవిఁటది ?''

''మనిద్దరం మీ ఇంటికెళ్దాం.''

''ముఖానే తలుపులు మూసుకుంటారు.''

''నిన్నీ పరిస్థితిలో చూసికూడానా ?''

''మానాన్న స్వభావం నీకేం తెలుసు ? నన్నీపాటికి చచ్చినదానితో జమచేసి ఉంటాడు.''

''మీ అమ్మ ?''

''ఆయన మాట కాదని అనలేదు.''

''వాళ్లకు నువ్వొక్కదానివే కదా ! అయినా అంత నిర్దయులా ?''

''అందుకే ఆ కఠినత్వం...నాపై ఏవేవో ఆశలు పెట్టుకున్నారు. ఎంతో గొప్ప మొగుడ్ని తేవాలనుకున్నారు. వాళ్ళ ప్రాణాలన్నీ నాపైనే నిలుపుకున్నారు మరి !''

''నేనెంత పాపాత్ముడిని ! వాళ్ల ఉసురు పోసుకున్నాను కదూ !''

''ఏమ్మాటలవి ? నేను నిన్ను వలచి వచ్చాను చైతూ ! వాళ్ళు నాకెన్ని సుఖాలు కల్పించుకాక, అవన్నీ నీతోడి జీవితాన్ని తెచ్చి ఇవ్వగలవా ? నాకు అవన్నీ నీ మనసులో కన్పించాయి. ఆ సంపద చాలునాకు !''

''కానీ...నీకు నీ తల్లిప్రేమను దూరం చేశాను !''

నువ్వేం చేశావ్ ? వాళ్ళే చేసుకున్నారు.''

''నేను నిమ్నజాతి వాడిని. వాళ్ళట్లా ద్వేషించడంలో వింత ఏముంది ? ''

''అట్లా అని నీ ముఖం మీద రాసుందా? మరొకసారి జాతి పేరు ఎత్తకు.''

''జీ...హుజూర్.. ప్రస్తుత కర్తవ్యం?''

''నాలాంటి వాళ్ళకు హాస్పటల్సేపుట్టిళ్ళు ''

''కస్తూరీ...నా బంగారం... ఎన్ని బాధలు నీకు.''

'' అసలు బాధపడడానికి ఇంకా పదిరోజులు టైముంది సార్... ప్రస్తుతం హేపీగా నిద్రపోండి. గుడ్ నైట్ ! ''

★ ★ ★

''డాక్టర్ ! నా కస్తూరికెట్లా ఉంది ? ఆమె బ్రతకాలి డాక్టర్. బ్రతకాలి. . ఆ పిండం



పోయినా సరే... ఆమె నాకు కావాలి. డాక్టర్ ప్లీజ్...''

''డోంట్ వర్రీ చైతన్యగారూ! వీలైనంత వరాకూ ఇద్దర్నీ బ్రతికించడానికే ప్రయత్నం.. మీరట్లా కూర్చోండి గొడవ పెట్టక !''

''ఇది గొడవా? ఘోష... నా ఆత్మ ఘోష డాక్టర్... మీకు అర్థం కాదు...''

''ఎందుకు కాదు ? భార్య ప్రసవించే టప్పుడు ప్రతి మగాడు ఇవేమాటలు మాట్లాడు తాడు తెలుసా ? ''

''కానీ... ఆమె నాకు భార్య మాత్రమే కాదు. నా సర్వస్వం.''

''ఆల్ రైట్... మీరిలా ఎక్సైట్ అవకండి మరి ! మరో అరగంటకి గుడ్ న్యూస్ చెపు తానుగా !'' ఆమె లోపలికెళ్ళింది.

మరో గంట తర్వాత...

కస్తూరి శవం, పొత్తిళ్ళలో పసి పాప చైతన్యకు మిగిలాయి. కుప్ప కూలిపోయాడు చైతన్య.

★ ★ ★

ఎవరు ? ను...నువ్వా ? ఎందుకొచ్చావ్?''

''మీ సొత్తును అప్ప చెప్పడానికి.''

''మా సొత్తా ? ఏదీ కస్తూరి ? ''

''ఈ బిడ్డను మిగిల్చిపోయింది.''

''ఏమిటి నువ్వనేది ?''

''కస్తూరి ప్రసవంలో పోయింది !''

''హా ! అయ్యో తల్లీ... కస్తూరీ...ఎంత పని జరిగింది !''

''ఏడవకండి ! ఇంకా మీలో కన్నీరు కార్చే గుండె ఉందని అర్థమైంది.

చాలు... ఇదిగో దీన్ని తీసుకోండి !''

''దుర్మార్గుడా ! నా కూతుర్ని పొట్టన బెట్టుకున్నావ్ ... అభం శుభం తెలియనిదాన్ని ప్రేమలోకి దింపి, మానుంచి వేరు చేశావ్ ! అనుభవిస్తావురా !''

''ఇంతకంటె ఇంకా అనుభవం ఉందా ? సరే మీ కూతురి కూతుర్ని ఉంచుకుంటారా ? తీసుకుపోనా ?''

తీసుకుపోయి దాన్ని చంపేస్తావా ? ఇటివ్వు !''

''ఇదిగో... కానీ... ఒక విషయం. . దీనికి అయిదేళ్ళు రాగానే నాతో పంపాలి.''

''ఎందుకు పంపాలి ?''

''నా కూతురు కనుక.''

''అయితే...నీ కూతుర్ని నువ్వే పెంచుకో. పో... !''

''సరే. నాకిట్లాంటివి తెలియవు. మీరు కూతురు పోయిన దుఃఖంలో ఉన్నారు. ఆ కూతుర్ని దీన్లో చూసుకుని కొంత ఉపశమనం పొందుతారనుకున్నాను. నా పోషణలో దీనికి ...

''ఒద్దు... ఇట్లా ఇవ్వు.''

''వస్తాను.''

''సాధ్యమైనంతవరకు రావొద్దు.''

''ప్రయత్నిస్తాను !''

★ ★ ★

''శీలా !''

''ఆఁ ... వస్తున్నా ! పిల్చారా ?''

''ఈ నానిగాడు చూడు ... సిరా ఎట్లా ఒలకబోశాడో !''

''చంటి వెధవ ! వాడికేం తెలుస్తుంది చెప్పండి. మనమే జాగ్రత్త పరచుకోవాలి ఇట్లాంటి వస్తువులు.''

''నీతులు చెప్పమని కాదు నిన్ను పిలిచింది. వాణ్ణి అవతల కీడ్చి ఇక్కడ బాగుచెయ్యి.''

''ఎందుకంత రుసరుసలు ? వస్తూనే ఏదో ఒకటి గొడవ మొదలు పెడ్తారు.''

''ఛీ ... ఇల్లొక నరకంగా తయారైంది ! ఎప్పుడూ సాధింపులు ... సాధింపులు.''

''ఔను ... మీ స్వర్గం కస్తూరితోనే పోయిందని తెలుసులెండి. వందసార్లు గుర్తు చెయ్యనక్కర్లే ''

''మాట్లాడితే కస్తూరి ... కస్తూరి ! ఆ ప్రేమమయి పేరు తల్చే అర్హతలేదు నీకు !''

''ఆమె ప్రేమమయి. నేను దయ్యాల మయిని. అంతేగా మీరనేది ?''

''అనవసర వాదన చేయకు. వీణ్ణి తీసుకు అవతలకి పో...''

''పోతానండీ, ఎందుకు పోను ? కానీ ఒక విషయం... నేనేం బలవంతంగా మీ జీవితంలోకి ప్రవేశించలేదన్న సంగతి గుర్తు పెట్టుకోండి !'' నానిగాణ్ణి తీసుకుని శీల వెళ్ళిపోయాక కాస్త స్థిమితపడ్డాడు చైతన్య.

వాలుకుర్చీలో కూర్చుని కాస్త రిలాక్స్ అవుతూ, పుస్తకం తెరిచాడు.

అందులో బోసినవ్వులతో, కాటుక కళ్ళు చికిలిస్తూ, పాప !

తదేకంగా చూస్తూండిపోయాడు.

పాపని చూసి అప్పుడే ఆరునెలలయి పోయింది. ఏట్లా ఉందో...రేపు శెలవుపెట్టి వెళ్ళి చూసిరావాలి. పాపను చూస్తుంటే కస్తూరిని చూసినంత తృప్తికలుగుతుంది ఎందుకనో..'

''ఇదిగో వీణ్ణి కాసేపు పట్టుకోండి. నాకు వంటకాలేదు.''

''అక్కడ వొదిలేయ్... ఆడుకుంటాడు.''

''మళ్ళీ ఏవైనా వొలకపోస్తే మీతో అదొక తంటా! ఎందుకొచ్చిన గొడవ? తీసుకోండి !''

''చెప్తుంటే నీక్కాదు ? అక్కడొదిలేయ్! నేను చదువుకోవాలి.''

''ఎందుకట్లా చీదరించుకుంటారు? నానిని నేనెవరికో కన్లేదండి.''

''నోర్మూసుకో ... వెధవ్వాగుడూ నువ్వూనూ...''

''నాది వెధవ్వాగుడు. నా బిడ్డ వెధవబిడ్డ! మీ దృష్టిలో ఆ పాప ఒక్కతే మీబిడ్డ. దానిపై చూపే ప్రేమలో నాలుగో వంతైనా వీడిపై చూపిస్తున్నారా? అస్తమానూ ఆ ఫోటో పట్టుకుని మురిసిపోవడం. వదల్లేకపోతే ఇంటికితెచ్చి పెట్టుకోవచ్చుగా !''

''అసూయతో అయినా, నిజమే చెప్పావు. రేపెళ్ళి ఆ విషయమే మాట్లాడాలను కుంటున్నాను.''

''అనుకుంటారు...ఎందుకనుకోరూ?దాన్ని ఇంటికి తెచ్చాక నానిగాడి స్థానం ఈ యింట్లో ఏమిటో చెప్పండి !''

''వేరే ఏం చెప్పాలి? పాప తమ్ముడేగా!''

''ఆ మాట మీరు మనస్ఫూర్తిగా అంటు న్నారా ?''

''ఏమిటీ పిచ్చిశీలా? నీకూ వాడికీ ఏం తక్కువ చేశాను?''

''ఆ ప్రశ్న సూటిగా మీ అంతరాత్మను వేసుకోండి తెలుస్తుంది.''

''ఊఁ...చాల్లే...''

''ఏం నేనన్నది అంత అప్రియమా? ఒక్క సారంటే ఒక్కసారైనా వాణ్ణి దగ్గరకు తీసుకుని ముద్దు పెట్టుకున్నారూ?''

''ముద్దు పెట్టుకుంటేనా ప్రేమ ఉన్నట్లా ?''

''అలా అని కాదు. మీ ప్రవర్తన, మాటలు ఆ విషయం రుజువు చెయ్యాలి. సరే వాడిసంగతి వదిలేయండి. నన్ను మాత్రం? పెళ్ళిచేసుకున్నది మొదలు...''

''స్టుపిడ్ శీలా స్టుపిడ్ ! నన్నెందుకిలా వేధిస్తావు. నాలో చెలరేగే అంతర్మథనం నీకు తెలీదు. నేనెంత చిత్రవధ అనుభవిస్తున్నానో, నీకు అర్థం కాదు''

''ఎందుకు కాదు? మీరు చెప్పేది తెలుగు లోనే కాబట్టి బాగానే అర్థం అవుతుంది.

''కస్తూరిని నేను ప్రేమించి, ఆమెకోసం తపించి, నావాళ్ళను నేను, ఆమె తరఫువాళ్ళను

ఆమె వదులుకొని కోరి పెళ్ళి చేసుకున్నాం. ఆమెతోటి గడిపిన మూడేళ్ళూ పది జన్మల వరకూ సరిపోయేంతటి అమూల్యమైన అనుభవాల్ని సంతృప్తినీ కలిగించాయి.''

''మరి నన్నెందుకు చేసుకున్నట్లు ? ఆ అనుభవంతోనే సరిపుచ్చుకోక ?''

''మధ్యలో కల్పించుకోకు. పూర్తిగా విను.''

''ఏవిటండీ వినేది ? మన పెళ్ళయి మూడేళ్ళయింది. అప్పట్నించీ ఆమె గురించి వినలేక ఛస్తున్నాను. అసలు ఈ యింట్లో నాకున్న స్థానం ఏమిటో చెప్పండి ! మీకు రెండో పెళ్ళాన్నయినా... మీరు నాకు మొదటి మొగుడనే సంగతి మర్చిపోకండి !'' లీల కంఠం రుద్ధమై పోగా అక్కడినుంచి వెళ్ళిపోయింది.

చైతన్య దాదాపు రాయిలా కూర్చుండిపోయాడు.

''లీల ఇంత బాధపడుతోందా ? తన ప్రవర్తన తనకే అసహ్యాన్ని కలిగిస్తోంది... నిజమే ఆమె మనసు గాయపడుతోందని తెలుసు.. తెలిసే చేస్తున్నాడిదంతా... నిజంగా తనీ పెళ్ళి చేసుకుని పొరపాటు చేశాడా ? లేదు. కస్తూరి ఆఖరి కోరిక తీర్చడానికి తను మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు. తనకు పుట్టే బిడ్డ అనాధ కాకూడదన్న కస్తూరి కోరికమీద మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు. కస్తూరిని మర్చిపోలేకపోయినా, లీలా తనకు కావాలి. లీలతో జీవితాంతం బ్రతకాలి. అదే... అదే... ఆ భయమే తన్ని కర్కశంగా మార్చేస్తోంది. తన నోటినుండి అనరాని మాటల్ని అనిపిస్తోంది. తను పాపాత్ముడు. కస్తూరి నట్లా పోగొట్టుకున్నాడు. లీల నిట్లా హింసిస్తున్నాడు. దీనికి ఇది మార్గం కాదేమోననిపిస్తోంది. ఏదో ఒకటి చేయాలి. తప్పదు.''

★ ★ ★

రాత్రి పది గంటలు దాటింది.

చదువుతున్న పుస్తకం మూసి, లీలవైపు చూశాడు చైతన్య.

ఆమె అటు తిరిగి పడుకుంది, ప్రక్కన నాని నిద్రపోతున్నాడు.

''లీలా !'' మెల్లగా, ఆప్యాయంగా పిలిచాడు.

''... ... ... ... ...''

''ఏయ్ ! నిన్నే... లైటాపి ఇట్లా రా !''

లీలకు దుఃఖం ముంచుకొచ్చింది.

''అరె ! ఎందుకు ?... ఎందుకేడుస్తున్నావ్ ? ప్లీజ్ ఊరుకో... నా తల్లివి కదూ... నా బంగారం కదూ...''

''మీ బంగారం వేరే ఉంది. నేనో గుదిబండను మీకు.''

''ఛ... అట్లా ఎప్పుడైనా అన్నానానేను?''

''వేరే అనాలా? మీ ప్రవర్తన చాలదూ?''

''లీలా... నీకు ఆవేశం ఎక్కువ. ఏదీ పూర్తిగా వినవు. అర్ధం చేసుకోవు.''

''ఆవేశం కాదు, ఆవేదన. పెళ్ళయింది మొదలూ, ప్రతిక్షణం మీనుండి నాకు ఆశాభంగం ఎదురౌతోంది. సాధారణంగా లోకంలో రెండోపెళ్ళాన్ని ఎంతో అపురూపంగా చూసుకుంటారు. కాని మీరు ? కస్తూరిని మర్చిపోలేనప్పుడు పెళ్ళి ఎందుకు చేసుకున్నారు ? నా గొంతు కొయ్యడానికా ?''

''లేదు లీలా...నిన్ను మనస్ఫూర్తిగా ఇష్టపడే చేసుకున్నాను. కస్తూరిని అంత త్వరగా మరచిపోయే ప్రేమకాదు మాది. సరే, ఆ విషయం ఏంచెప్పినా, నీదుఃఖం పెరుగుతుందని నాకు తెలుసు. అయితే, నా ప్రవర్తనకు కారణం అది కాదు...''

''ఏది ? ఇప్పటికైనా మీరు మనసు విప్పి చెప్పండి. లేదా మనం...మనం విడిపోకతప్పదు...

''లీలా !''

''అవును...నేనెంతో ఆలోచించే ఈ నిర్ణయానికొచ్చాను. మీకు నాపై, నానిపై యే మాత్రం అభిమానం లేనప్పుడు ఇక్కడెందుకు ఉండడం ? విడిగాపోతే కొంతైనా మనశ్శాంతి!''

''లీలా...ప్లీజ్ కలలోనైనా అట్లాంటి ఆలోచన రానీయవద్దు. నిజంగా నేనెంతో దుర్మార్గుడిని. నిన్ను చాలా కష్టపెడుతున్నాను. నానిగాడ్ని దూరంగా ఉంచుతున్నాను...నిజమే...కానీ దానికి కారణం నా మనోదౌర్బల్యమే లీలా...నన్ను నమ్ము. అర్ధం చేసుకో...నా ప్రేమలో ఏదో అపశ్రుతి ఉంది. నా ఆప్యాయతలో విషం ఉంది. అది ఎదుటి మనిషిని బ్రతుకనీయదు. నా కస్తూరిని అట్లాగే పోగొట్టుకున్నాను. ఆమెతో హాస్యానికైనా పోల్చు మాట్లాడలేదు. అయితే ఏమయింది ? నా ప్రేమ, ఆరాధన, అనురాగం ఆమెని దక్కించుకోలేక పోయాయి. అందుకే నాలో ఒక నమ్మకం ఏర్పడిపోయింది, నేను ద్వేషించిన వాళ్ళే నాకు దక్కుతారనే నమ్మకం. అందుకే మీపట్ల అలా ప్రవర్తిస్తున్నాను. నన్ను క్షమించు !''

ఆశ్చర్యంగా చూసింది చైతన్యవైపు. అతని నమ్మకానికి నవ్వొచ్చింది.

''మరి పాపను అభిమానిస్తున్నారే ? అప్పుడేమయిందీ నమ్మకం ?''

''అది దూరంగా ఉందికదా ! రేపే పాప దగ్గరికోసారి వెళ్ళిచూసి రావాలి.''

''మీరు మాట్లాడేదానికి అర్థం ఉందా ? ఇదేం సెంటిమెంటు ? పాప దగ్గరికి కాదు మీరు వెళ్ళవలసింది. ముందు సైక్రియాటిస్ట్ దగ్గరకు వెళ్ళండి. ఇన్నాళ్ళూ అర్థంలేని భయాలతో సంసారాన్ని నిస్సారవంతం చేసి పారేశారు.''

''ఇకనుంచి అట్లాజరగదు లీలా ! ఈ సంగతి నీకు ఎప్పుడో చెప్పాల్సింది.''

''కస్తూరి మరణంతో బాగా దెబ్బతిని ఇట్లాంటి ఊహలు...నా మాట విని రేపే సైక్రియాటిస్ట్ దగ్గరకెళ్ళండి.''

''నేను పిచ్చివాణ్ణి కాదు లీలా !''

''ఇదీ ఒక రకం పిచ్చే! ఇప్పుడు తగ్గినా, రేపేదైనా చిన్న అవాంతరంవస్తే మళ్ళీ అట్లా మారరనీ నమ్మకం ఏముంది ?''

''సరే... నీ ఇష్ట ప్రకారమే చేస్తాను.''

''మరో సంగతి. పాపను మనింటికి తీసుకొచ్చేయండి. కస్తూరి పోయినంత మాత్రన ఆమె తల్లి లేనిదవకూడదు. మీతో పెళ్ళయిన నాటి నుండీ చెప్పాలని ఎన్నోసార్లు ప్రయత్నించాను. మీ ప్రవర్తన వల్ల చెప్పలేకపోయాను.''

''కానీ, వాళ్ళు పంపనంటున్నారు. నాకు ఇదొక సమస్యగా మారింది. అప్పట్లో మనసు విరక్తిగా ఉండి దాన్ని పెంచలేక వాళ్ళ కప్ప

# నాకూ మానవత్వం ఉంది

చెప్పాను. అక్కడి నుండి పాపను తీసుకురావడం అంత తేలిగ్గా జరిగే పనికాదు వాళ్ళకు, నాపై కసి, కోపం. నా కులం వేరు కావడం వలన, అల వాట్లు వేరవుతాయని వారి నమ్మకం.''

''అది అర్థంలేని విషయం. ఎప్పుడో జరిగి పోయిన దానికి ద్వేషాలు, కోపాలు ఎందుకు ? మర్యాదగా పని జరగకపోతే, 'లా' ద్వారా ప్రయత్నిద్దాం.''

''మంచి సలహా... రేపే లాయర్ని సంప్రదిస్తాను.''

''లాయర్నే కాదు. డాక్టర్ని కూడా !''

''ఈ క్షణం నుంచీ నీ ఆనందం కోసం ఏమైనా చేస్తాను లీలా ! ప్రామిస్...''

★ ★ ★

''నువ్వా ? రా నాయనా!'' అంది కస్తూరి తల్లి.

''లాయర్ నోటీస్ అందిందనుకుంటాను.'

''అందింది. బాబూ ! మా మీద నీకెందు కింత కక్ష?''

''నాకా ? చాలా పొరపాటు. అలాంటి వన్నీ మీకే... కస్తూరి నేను ప్రేమించుకున్న పాపానికి ఎన్ని మాటలన్నారు ?మర్చిపోయారా?''

''అవి ఇప్పుడు అప్రస్తుతం. మర్చిపో చైతన్యా !'' అన్నాడు కస్తూరి తండ్రి.

''ఎట్లా మర్చిపోను ? కస్తూరి పోవడం మర్చిపోనా ?''

''అవును. అది పోవడం నీ కెంత బాధను కలిగిస్తోందో, మాకూ అంతే. అది కాదనే హక్కు నీకు లేదు. మాది కన్నకడుపు... ఒక్కగానొక్క కూతురు దిక్కులేని దానిలా... తలుచుకుంటే కడుపు తరుక్కుపోతోంది. కానీ, ఏం చెయ్యగలం? అది పోయిందన్న బాధలో ఏవేవో అన్నాం... గతాన్ని ఇప్పుడు తవ్వకు... ప్రస్తుత విషయంలోకిరా !''

''సరే... నా పాపను నాతో పంపండి రచ్చకెక్కడం నా కిష్టం లేదు.''

''అందుకేనా లాయర్ నోటీస్ పంపావు ?'' అన్నది కస్తూరి తల్లి.

''ఏం చెయ్యను? గత్యంతరంలేక చెయ్యాల్సి వచ్చింది.

''ఒక్క విషయం... ముందు అట్లా కూర్చో... నువ్వెళ్ళి అతనికి కాస్త కాఫీపట్టుకురా పో !'' అన్నాడు కస్తూరి తండ్రి.

లోపలికెళ్ళింది ఆమె.

''బాబూ ! చైతన్యా... నా మాటలు సాంతం విను, ఈ ముసలివాళ్ళ మనసును కాస్త అర్థం చేసుకో. కస్తూరి మాకు చెప్పకుండా నీతో అట్లా వెళ్ళిపోవడంతో కృంగిపోయాము. ఆ దుఃఖం, ఆక్రోశం నీకు చెప్పినా అర్థం కాదు. అది చాలదన్నట్లు పూర్తిగా లోకం విడిచి వెళ్ళిపోయింది. ఒక విధంగా బతికి ఉన్న శవాలం బాబూ మేము. పాపలో కస్తూరిని చూసుకుని మురిసిపోతున్నాము. పాప మా ప్రాణమైపోయింది బాబూ ! దాన్ని దగ్గరకు తీశాక కులాలు, మతాలు అర్థం లేనివని తెలిసింది. పాప ఒక్క క్షణం కనిపించకపోతే మా మతులు గతులు తప్పుతాయి. ఈ వయసులో మా ఆశ, ఊపిరి, ఆనందం అన్నీ పాపే ! అందుకే నీతో పంపడానికి ఎప్పటికప్పుడు వ్యతిరేకిస్తున్నాం. కానీ నువ్వు 'లా' దాకా పోయావు. నిజమే 'లా' ప్రకారం ఆలోచిస్తే పాప నీదే. అది తిరుగులేని న్యాయం. కానీ... కానీ...మానవతా దృష్టితో కాస్త ఆలోచించు. రోజాల గుద్దని గుండెల కద్దుకుని పెంచాము. ఇంకొక విషయం. పాప మమ్మల్ని విడిచి ఉండగలదా ? దాన్ని విడిచి మేం బతగ్గలమా ? ఆలోచించు బాబూ !''

చైతన్య ఆలోచించసాగాడు.

వంటింట్లోంచి కస్తూరి తల్లి వచ్చింది కాఫీ కప్పుతో. ఆమె వెనగ్గా చీర చాటుచేసుకుని పాప వచ్చింది. కాఫీ చైతన్య కిస్తుంటే బెరుగ్గా అతనివైపు తొంగిచూస్తోంది.

''పాపా! రా!'' అన్నాడు చైతన్య.

రాలేదు. మళ్ళీ పిలిచాడు.

బెరుకుగా దగ్గరకొచ్చింది. ఆరేళ్ళ పాప కాస్త పెరిగి చక్రాల్లాంటి కళ్ళతో కాస్త కస్తూరి పోలికలతో ఉంది. తను తెచ్చిన బొమ్మలు, బిస్కట్ పాకెట్స్ ఇచ్చాడు. సంశయిస్తూనే తీసుకుంది.

''పాపా నేను... నీకేమౌతానమ్మా ?''

మాట్లాడలేదు.

''చెప్పు...చెప్పమ్మా!'' అన్నాడు దగ్గరకు తీసుకుని ముద్దు పెట్టుకుంటూ.

''నాన్న !'' అంది.

''గుడ్ ... మరీ ... మీ అమ్మ ... కొత్త అమ్మన్నమాట... నిన్ను తీసుకురమ్మంది...మరీ ... అక్కడ నీకో బుల్లి తమ్ముడున్నాడు ... ఎంచక్కా ముద్దుస్తాడు... నీతో ఆడుకుంటాడట! మరి అక్కడి కెళ్దాం వస్తావా?''

పాప అతని ముఖంలోకి చూసింది,

''తమ్ముడా బుల్లితమ్ముడా?'' అన్నది ఏదో ఆలోచిస్తూ.

''అవును తల్లీ...అక్కను తీసుకురానాన్నా! అన్నాడు వెళ్దామా ?'' అన్నాడు ఆత్రంగా.

''ఊఁ'' అంది ఉత్సాహపడుతూ.

''పాప ఒప్పుకుంది. నన్ను క్షమించండి తీసుకెళ్తున్నందుకు.''

''ఏమిటిది ? మీరైనా చెప్పరేమండీ ! తీసుకెళ్ళవద్దని, అది లేకపోతే ఎట్లాగండీ ?'' అన్నది కస్తూరి తల్లి.

''నేను చెప్పవలసినవన్నీ చెప్పాను. నువ్వు దాని బట్టలన్నీ సర్దేయ్...అంతే'' అన్నాడాయన నిర్లిప్తంగా.

ఆమె కళ్ళనీళ్ళు కారుస్తూనే వైరు బుట్టలో పాపబట్టలు, బొమ్మలు సర్ది తెచ్చింది.

పాపను ఎత్తుకుని, వైరుబుట్ట తీసుకుని, వాళ్ళిద్దరివంకా చూసి తప్పుచేసినవాడిలా తల దించుకుని ''వస్తానండీ...నన్ను...క్షమించండి'' గొణిగాడు.

కస్తూరి తల్లికి దుఃఖం పెల్లుబికింది.

''నువ్వెంతటి కఠినాత్ముడివి చైతన్యా ! అసలు దాన్ని నా చేతుల్లో ఎందుకు పెట్టావు ? ఇట్లా మాపై కక్ష తీర్చుకున్నావ్ కదూ ! ఇన్నాళ్ళూ పెంచిన మమకారంతో చావమని శపిస్తున్నావు కదూ !''

చైతన్య బదులు చెప్పలేదు. అతని మనసు భారమైంది. అయినా పెదవి కదిపినందువల్ల ప్రయోజనం లేదని ఊరుకున్నాడు. వీధిగుమ్మం దాటి మెట్లు దిగుతున్నాడు.

''పాపా ! వెళ్తున్నావా తల్లీ! నీకీ అమ్మమ్మతో పని అయిపోయిందిటే'' అన్నది శోకభారంతో.

తండ్రి చంకలో ఉన్నా పాప కళ్ళన్నీ అమ్మమ్మమీదే ఉన్నాయి. ఆమె ఏడుస్తుంటే బిక్కమొహంతో తండ్రినీ, ఆమెనీ మార్చిమార్చి చూస్తోంది. ఆమె పిలుపుతో ఒక్కసారిగా చైతన్య నుంచి గుంజుకుని విడిపించుకుంది. పరుగున వెళ్ళి ఆవిడ ఒడిలోదూరి ''అమ్మమ్మా! నేను వెళ్ళనే ! నాన్నతో చెప్పు !'' అన్నది తనూ బావురుమంటూ.

చైతన్య దిగ్భ్రాంతి చెందాడు. పాపకు తనతో రావడం ఇష్టంలేదన్న సంగతి గ్రహించి నిశ్చేష్టుడయ్యాడు.

కాస్సేపటికి తేరుకుని, చేతిలోని బుట్ట గడపమీదుంచి, ''పాప మీదగ్గరే ఉంటుంది. నాకూ మానవత్వం ఉంది... వస్తాను'' అంటూ మెట్లుదిగి గబగబా కదిలిపోయాడు. □

## ఫ్లుకోమాట్

కడివెడుపాలను కలుషితం చేయటానికి ఒక చుక్క విషం చాలు– అనేది పాతబడుతున్నది. ఈనాటి పరిస్థితులల్లో– ఒక తొట్టి మంచినీటిని విషపూరితం చేయటానికి ఒక చుక్క పెట్రోలుచాలు అంటే సరిపోతుంది. అందుకని మంచినీటిలో పెట్రోలు కాలుష్యాన్ని గుర్తించేందుకు పశ్చిమ జర్మనీలోని ఫ్లుకోమాట్ అనే పరికరాన్ని తయారుచేశారు. దీనిని నీటికి 50 సెం.మి. ఎత్తున అమరుస్తారు. దీనిలో ఒక ఎలక్ట్రానిక్ బాక్స్, ఒక యాంత్రిక హస్తం ఉంటాయి. నీరు కలుషితమయినపుడు వెంటనే అలారం మ్రోగి అప్రమత్తులను చేస్తుంది. ఫ్యాక్టరీలలో ఉపయోగం కోసం దీనిని ప్రత్యేకంగా రూపొందించారు.

(గ్లోబల్)

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# 1985 దీపావళి కథల పోటీ

## మొత్తం బహుమతులు రు. 6,600/-

ఎప్పటిమాదిరే ఈ సంవత్సరం కూడా దీపావళికి కథల పోటీ నిర్వహిస్తున్నాము. గత సంవత్సరంలాగే ఈసారి కూడా సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన ఆరు కథలని ఆంధ్ర సచిత్ర వార పత్రిక దీపావళి సంచికలోనూ, ఆ తర్వాతి సంచికలోనూ ప్రచురిస్తాము. అటు తరువాత ఆ కథలపై **పాఠకుల బాలట్** నిర్వహిస్తాము.

## ముగింపు తేది : 24 ఆగస్టు 1985

పోటీలో ఎన్నికైన ఆరు కథలకు ఒక్కొక్క దానికీ రు. 650 – చొప్పున బహుమతి లభిస్తుంది. ఆ తరువాత పాఠకుల బాలట్‌లో మొదటి, రెండవ, మూడవ స్థానాలలో వచ్చిన కథలకి వరుసగా రు. 700/–, రు. 600/–, రు. 500/–లు వంతున అదనపు బహుమతులు అందజేస్తాము. మిగతా మూడు కథలకీ ఒక్కొక్క దానికీ రు. 300/–లు చొప్పున ప్రత్యేక బహుమతిగా ఇస్తాము.

## నిబంధనలు

1. కథా వస్తువు తెలుగువారి సామాజిక జీవితానికి సంబంధించినదై ఉండాలి.
2. కథ పన్నెండు అరఠావులకి మించి ఉండరాదు (అరఠావు అంటే ఎక్సర్‌సైజు పుస్తకం పేజీకి రెట్టింపు). కాగితానికి ఒక వైపే సిరాతో లేదా బాల్‌పెన్‌తో రాయాలి. కథ వ్రాతప్రతిపైన "1985 దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి.
3. అనువాదాలు, అనుసరణలు, కాపీ కథలు పంపరాదు. గతంలో ప్రచురింపబడిన, రేడియోలో ప్రసారం అయిన కథలని, ఇతర పత్రికల పరిశీలనలో ఉన్న వాటిని పంపకూడదు. ఈ మేరకి తమ కథల వ్రాత ప్రతులతో పాటు రచయిత(త్రు)లు హామీ రాసి సంతకం చేసి పంపాలి. హామీ పత్రంలేని రచనలు పరిశీలింపబడవు.
4. రచయిత(త్రు)లు కలం పేరు వాడినా తమ అసలు పేరు, పూర్తి చిరునామా స్పష్టంగా రాయాలి.
5. సంపాదకుని ఎన్నికలో బహుమతి పొందిన ఆరు కథలని ఆయా రచయిత(త్రు)ల పేర్లు లేకుండా ప్రచురిస్తాము. బాలట్ ఫలితాలతో పాటు వారి పరిచయాలు ఫోటోలతో సహా తరువాత ప్రచురిస్తాము.
6. పోటీలో గెలుపొందిన కథా రచయిత(త్రు)లు తమ ఫోటో, జీవిత విశేషాల ప్రచురణకి అంగీకరించాల్సి ఉంటుంది.
7. రచనలపై వచ్చే ఎటువంటి పేచీలకైనా ఆయా రచయిత(త్రు)లే బాధ్యత వహించవలసి ఉంటుంది.
8. పోటీకి పంపే కథలు 24 ఆగస్టు 1985 నాటికి కాని, ఆలోగా కానీ మా కార్యాలయానికి చేరాలి. ఆ తేదీ తరువాత అందిన కథలని సాధారణ ప్రచురణకి మీలు వెంబడి పరిశీలించడం జరుగుతుంది.
9. పోటీకి పంపిన కథలని ఎటువంటి పరిస్థితులలోనూ తిప్పి పంపడం జరగదు. కాబట్టి రచయిత(త్రు)లు వాటితో పాటు తగినన్ని తపాలా బిళ్ళలు అతికించిన స్వంత చిరునామా కల కవర్లని జత పరచి పంపనవసరంలేదు.
10. పోటీలో బహుమతి పొందని కథలలో కొన్నిటిని సాధారణ ప్రచురణకి స్వీకరించి వీలు వెంబడి వాటిని ప్రచురించడం జరుగుతుంది. ఆ విషయాన్ని ఉత్తరాల ద్వారా ఆయా రచయిత(త్రు)లకి తెలియజేస్తాము.
11. పోటీకి పంపే కథలని సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వార పత్రిక, గాంధీనగరం, విజయవాడ-520 003 అన్న చిరునామాకి పంపాలి. వ్యక్తుల పేర పంపరాదు. కవరు పైభాగంలో "1985 దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి.

రచయిత(త్రు)లందరూ ఉత్సాహంగా ఈ పోటీలో పాల్గొని దీనిని జయప్రదం చేయగలరని ఆశిస్తున్నాము.

–సంపాదకుడు

# హైదరాబాద్ నోట్‌బుక్

## శ్రీ మల్లాది రామచంద్ర శాస్త్రి:-

విశాఖ విజయసాహితి సంస్థాపకులు, మిత్రులు శ్రీ మల్లాది రామచంద్రశాస్త్రిని చూచినప్పుడెల్లా నాకుపెరియాళ్వార్- విష్ణుచిత్తులు జ్ఞాపకం వస్తారు. విష్ణుచిత్తులు గురుముఖ మనధీత్య ప్రాహవేదాన శేషాన్- గురుముఖంగా అధ్యయనం చేయకుండానే వేద వేదాంగాలు ప్రవచించారట. కాళిదాసుఅన్నట్టు ఆయనకు ప్రపేదిరే ప్రాక్తన జన్మవిద్యాః- పూర్వజన్మ సంస్కారంతో ఇహజన్మలో అన్నివిద్యలూ తమంతట తామే అబ్బాయి. ఆకోవవారు శ్రీ మల్లాది రామచంద్రశాస్త్రి. ఆయన పట్టుగా చదివింది ప్రాథమిక పాఠశాలలో ఐదవతరగతి; కాని, సంపాదించింది అపారజ్ఞానం, తెలుగు సంస్కృతాంగ్లాలలో మృదుమధుర కవిత చెబుతారు; హిందీ బెంగాలీ సాహిత్యాలను కంఠదఘ్నంగా కబళించారు. ఈ విశాల విశ్వమే విశ్వవిద్యాలయంగా, ఏకలవ్యుడే లక్ష్యంగా, జ్ఞానమే ధనంగా జిజ్ఞాసేసాధనంగా కృషి చేశారు. సాధించారు. విశాలదృష్టిని అలవరచుకొన్నారు. దీనికి కారణం ఆయన 7వ ఏటే 1924లో వందేమాతరం, గాంధీజీకి జై, తిలక్ మహారాజ్‌కి జై అని స్వాతంత్ర్య సమరాంగణంలో దూకడం, తర్వాత నేటివరకూ గాంధి మార్గాన్ని అనుసరిస్తూ వుండడమూను. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని రెండేళ్లు కారాగారవాసం అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలోనూ పాల్గొని 'కాంగ్రెస్ విజయ దుందుభి' అనేజాతీయగీతకావ్యం రచించారు. దానిని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘం ప్రచురించింది. 25వ ఏట'విశ్వవీణ' అనే కావ్యం విశ్వమానవ దృష్టితోరచించారు. అది పలువురు పెద్దల మెప్పుపొందింది. మాధవీచి, శ్రేయోరాజ్యం మార్గదర్శి ప్రచురించారు. అప్రకటిత రచనలు దాదాపు 40 ఉన్నాయి. తెలుగు సంస్కృతాలలో వాటిలో మహోత్తమమైనది మాతృపూజ.

మాత కన్నతల్లి మాత స్వదేశమ్ము
మాతమాతృభాష మాత ధరణి
మాతృపూజ నరుని మహితు నొనర్చును
మాతృపూజ వేద మాతృపూజ.

ఇది మల్లాదివారి మాతృశబ్ద నిర్వచనం. దీనిలో బాలప్రాజ్ఞ భక్తి సౌందర్యానందాలనే ఐదు ప్రకరణాలూ ఈయన విశ్వదృష్టి వైశాల్యాన్ని తెలుపుతాయి.

విశాల విశ్వనందనే
వికాసి కల్పవల్లికాం
విదారి తాప చింతనాం
విచారితాత్మ భావనాం
జితారి షట్క పేచికాం
నుతాత్మ నిత్యవిశాకాం
నమామి దేశ మాతరం
నమామి వేద మాతరం-

అని ఆనంద నృత్యం చేస్తారు. మాతృపూజలోని బాలప్రకరణంలో దశవతారాలు మొదలు కష్ణుడన్నట్టు యద్యత్ విభూతిమత్- ప్రాచీన వాల్మీకి మొదలు నేటి రవీంద్రుని వరకు అందరు కవులు, గాయకులు దర్శన మిస్తారు. ప్రాజ్ఞ ప్రకరణంలో భారతదేశానికి మల్లాదివారు కొత్త నిర్వచన మిచ్చారు- భాసిరతః భారతః- కాంతిని- జ్ఞానతేజస్సులను సంపాదించుకొనడంలో నిమగ్నమైంది భారతం. భక్తి ప్రకరణంలో గీతకు ప్రాధాన్య మిచ్చినా సకల మతాలను సమాన పీఠంపై గౌరవిస్తారు. సౌందర్య ప్రకరణంలో విశ్వ సౌందర్య వర్ణనంలో సమకాలిక సాంస్కృతికా రామంలోని కుక్కమూతి పిందెల పట్ల అసంతృప్తి కని పిస్తుంది. ఆనంద ప్రకరణం ఆత్మావలోకనంతో సమాప్త మవౌతుంది. ఇప్పటి పరిస్థితి

దేశపరంగా కోతలు
జాతి పరంగా గీతలు
మత పరంగా వాతలు
అతుకుల మర్గతి బతుకులు-

అని ఆయన ఆవేదన పడుతారు. విరాణ్మూర్తిక



మల్లాదివారు ఆళ్వార్ల ధోరణిలో

నక్షత్రతతి నిన్ను నిత్యమే నర్చింతు
అరుణో దయమ్ము నే నర్పింతు ఆరతి
విశ్వ సౌభాగ్యమ్ము నీకు నైవేద్యమ్ము-

అని ఈ విశ్వాన్నే అర్పించి వేశారు. మల్లాదివారు ఉత్తర అమెరికా ఆంధ్ర మహాసభకు విమానం ఎక్కుతుండగా కలుసుకున్నాను బేగంపేట విమానాశ్రయంలో. సాంస్కృతిక విప్లవం, దివ్వెలాగ వెలగడం, తమ పుస్తకాలు ప్రచురించడం తమ ప్రస్తుత లక్ష్యమన్నారు. అమెరికాలో తమ సమాన భావుకులను కలుసుకుంటానని, భారతీయ సంస్కృతిలో విశ్వ సంస్కృతి ఎలా అవినాభావంగా వుందో వివరిస్తానని అన్నారు. ముఖ్యంగా ప్రపంచానికి మహా సంపదను ప్రసాదించిన వ్యాస వాల్మీకుల వాక్కులను ప్రచారం చేస్తానన్నారు. మల్లాది వారికి కవులంటే గొప్ప విశ్వాసం.

లోకే ద్వావేవ దాతారౌ
రవి స్సుకవి రేవచ,
రవి నాదీయతే తేజః
కవినా ధీః ద్యుతిప్రదా.

లోకంలో ఇద్దరే దాతలు:-ఒకడు రవి, మరొకరు సుకవి. రవి తేజస్సు ఇస్తాడు, సుకవి బుద్ధిని కాంతిని ఇస్తాడు- ఇది మల్లాదివారి విశ్వాసం. ఆయనకు దైన్యం పడదు- 'పాపాహం పాప కర్మాహం పాపాత్మా పాప సంభవః' అని ఆయనదైన్యం చూపరు.

"పుణ్యోహం పుణ్య కర్మాహం
పుణ్యాత్మా పుణ్య సంభవః'

అని ఆయన ధీమాగా చెప్పుకుంటారు. శ్రీరామచంద్ర శాస్త్రి కోరికలన్ని సఫలమ్మై, ఆయన నూరేళ్లు మరిపదురు గాక ఆరోగ్యంతో- అని కోరుకుంటు న్నాను. ఇంతకూ ఇప్పుడాయన వయస్సు 71. మిసమిసలాడుతూ నవనవలాడుతూ పహలా పచ్చిస్‌లాగ ఉంటారు. ఈ మిసమి జీవితమంతా ముసి ముసిగా నవ్వని!

## ఉపశ్రుతి:-

సినిమాకు వస్తారా?- అనడిగారు ఒక మిత్రుడు. డబ్బు పెట్టి నిద్రాపోయి బాధపడడం ఎందుకూ?- అన్నాను. సుప్రసిద్ధ వైద్యురాలు శ్రీమతి శాంతా బాయిని ఆమె పిల్లలు సినిమాకు వస్తావా అమ్మా- అని అడిగారట. నేను నా వైద్యశాలలో రాత్రిళ్లు మేల్కొని కాన్పులు చేసినందుకు వేల రూపాయలు వచ్చాయి. డబ్బు రాకపోగా, చేతి నుంచి పెట్టుకుని ఎవరు మేల్కొంటారు సినిమా చూడడానికి- అని ఆమె ఛలోక్తి విసిరిందట అన్నారు డాక్టర్ కె. ప్రభాకరశాస్త్రి.

—తిరుమల రామచంద్ర

*Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3, Editor S Radhakrishna,*
*Phones P B X 61247, 61248 & 75667*

# ఆ సంగీత విద్వాంసుడు మీమనసును పరవశింపజేసిన ఆమధుర క్షణాలు సజీవంగా ముద్రించబడతాయి.

వెయ్యిసార్లు విన్నా
మొదటిసారి
విన్నట్టే శాశ్వతంగా
నిలచిపోతాయి.



## అంతా సంగీతమయమే! మరే ఇతర శబ్దాలు ఉండబోవు.

# koneru
## ఆడియో క్యాసెట్లు

ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన జపాన్ యంత్రాలపై తయారు చేయబడిన కోనేరు క్యాసెట్లు మీకు అంతర్జాతీయస్థాయి నాణ్యతను అందిస్తాయి.

### కోనేరుకు ఆ ప్రత్యేక ధ్వని తరంగాలు లభించడానికి గల కారణాలు:

● మాగ్నటిక్ అణువులు టేపంతయు సమానంగా వ్యాపించి ఒకే మూసలో పోసినట్టు నిర్దిష్టంగా రూపొందించిన రూపకల్పన. ● నేపథ్యంలోని అతి తక్కువస్థాయి శబ్దతరంగాలను సైతము స్వచ్ఛంగా వినబడేవిధంగా తీర్చిదిద్దిన ప్రత్యేకత. ● మార్మోగిపోయే అతి హెచ్చుస్థాయి శబ్ద తరంగాలను సైతము సున్నితంగా గ్రహించుకోగల అసమానత. ● రవాణాలోని ఏ మాత్రం దెబ్బతినడానికి వీలుగాని కట్టుదిట్టమైన నిర్మాణము. ● టేపును వక్రమంగా. సున్నితంగా తిరుగునట్లుచేయు సిలికాన్ చేర్చబడ్డ రోలర్లు. ● ప్రత్యేకంగా పోతపోసిన లోహంతో నిర్మించిన సంపూర్ణ భద్రతగల ఫ్రేంనిర్మాణము. ● తెరచినపుడు క్యాసెట్ పడిపోకుండ ఆపేందుకు యంత్ర తాళపు సౌకర్యము.




CLARION/SEC/8514

తయారుచేయువారు: **శక్తి ఇంజనీరింగ్ కంపెని**, ఎలెక్ట్రానిక్స్ డివిజన్, 26-36-39 మ్యూజియం రోడ్డు, విజయవాడ 520 002.